జనవరి 2008

21

సంపుటి :2 సంచిక : 9

వెల : రూ.5/-

# మార్క్సిస్టు

## సైద్ధాంతిక మాసపత్రిక

ఈ సంచికలో.....

# ఆదర్శ కమ్యూనిస్టు మానికొండ సుబ్బారావు

యు. రామకృష్ణ

సాధారణ విజ్ఞానం కలిగి, సాధారణ స్థానాల్లోనే ఉండి బాధ్యత వహించి పని చేసిన విప్లవకారుడాయన. ఉత్తమ పని పద్ధతులు, స్వార్థరహిత దృష్టి, ఉదాత్తమైన మనస్సు, త్యాగం, సాహసం, ప్రజల కష్ట సుఖాలే తన కష్టసుఖాలు అనుకున్న ఆయన చైతన్యం ఆయనను ఒక అసాధారణ మానవుడిగా, విప్లవకారుడిగా రూపొందించాయి. తన ఆస్తిపాస్తులు, తన సర్వస్వం పీడిత ప్రజల సేవకు అర్పించిన ఆదర్శప్రాయుడాయన. తన మాతృమూర్తిని విప్లవ మాతగా, సతీమణిని విప్లవకారిణిగా తీర్చిదిద్ది విప్లవకారులకు మార్గదర్శిగా నిలిచాడాయన. ఆయనే మానికొండ సుబ్బారావు.

మానికొండ సుబ్బారావు 1918లో కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా నందమూరులో జన్మించారు. బాల్యంలోనే తండ్రిని కోల్పోయారు. తల్లి బుల్లెమ్మ కొద్దిపాటి చదువు సంధ్యలే ఉన్నా పెద్ద సంస్కారంగల ఇల్లాలు. మానికొండ చదువులో ఆలస్యంగా ప్రవేశించాడు. తాను ఇంగ్లీషు చదువుకుంటానని ఎనిమిదో ఏటనే మారాం చేసి మాట నెగ్గించుకున్నాడు. బందరు సెకండరీ పాఠశాలలో చేరిన మానికొండ శ్రద్ధగా చదవడమేగాకుండా, క్రమశిక్షణాయుతంగా అందరికీ ఆదర్శంగా ఉండేవాడు. బందరు హిందూ కళాశాలలో ఇంటర్మీడియట్‌లో ఉత్తీర్ణుడయ్యాక బివిఎస్‌సి కోర్సులో ప్రవేశించాడు. ఒకటి రెండేళ్లు చదివి అక్కడ జరిగే అన్యాయాలకు, అక్రమాలకు వ్యతిరేకంగా చదువుకు స్వస్తిచెప్పి స్వగ్రామం చేరాడు.

మానికొండకు 19వ ఏట వివాహం అయ్యింది. వివాహ సందర్భంగా అంత చిన్న వయసులోనూ మానికొండ నూతన ప్రమాణాలు నెలకొల్పారు. కట్నం మీద పెద్దలు మక్కువ చూపగా, 'నేను చేసుకునేది పిల్లనా, డబ్బునా?' అంటూ తన ఇష్టప్రకారమే కట్న కానుకలు లేకుండా సూర్యావతిని వివాహం చేసుకున్నారు. 1938-39లో ఆనాడు కమ్యూనిస్టు ప్రముఖుడుగా ఉన్న అన్నాప్రగడ కామేశ్వరరావు గుంటూరు జిల్లా మంతెనవారిపాలెంలో 'విద్యావనం' అనే ఆదర్శ పాఠశాల ప్రారంభించారు. బాలబాలికల్లో నూతన ఆదర్శాలు ప్రేరేపించి



నూతన విద్యావిధానంతో తీర్చిదిద్దాలనే ఆశయంతో ఆ పాఠశాలను ప్రారంభించారు. తుమ్మల వెంకట సుబ్బయ్య మొదలైన మిత్రలతో కలిసి సేవాదృష్టితో మానికొండ ఆ పాఠశాలలో ఉపాధ్యాయుడుగా ప్రవేశించారు. అక్కడ పని చేసినన్నాళ్లూ పిల్లల మనస్తత్వాన్ని చక్కగా గమనించి గ్రహించి వ్యవహరించారు. పిల్లల్లో సత్ప్రవర్తన, అభ్యుదయ భావాలు కలిగించడానికి ప్రత్యేక తరగతులు నడిపేవారు. ఎక్కడా చెల్లని పిల్లలను కొందరిని మంచి మార్గంలో తీర్చిదిద్దారు. ఆ పాఠశాలలో ఆయన ఉపాధ్యాయుడుగా చూపిన సామర్థ్యాన్ని తరువాత రాజకీయ జీవితంలో మరోమారు నిరూపించుకున్నారు. రాష్ట్ర, జిల్లా కమిటీలు నడిపిన రాజకీయ పాఠశాలల్లో సిద్ధాంత రాజకీయ నిర్మాణ సమస్యలను సమర్థంగా బోధించి ఉపాధ్యాయుడుగా చాలా రాణించారు.

'విద్యావనం'లో పనిచేస్తున్న రోజుల్లోనే కమ్యూనిస్టు సాహిత్యం అధ్యయనం చేస్తుండేవారు. స్థానిక కమ్యూనిస్టు కార్యకర్తలతో సంబంధాలు పెట్టుకున్నారు. ఆయనలో ఉన్న స్వచ్ఛమైన దేశభక్తి, ప్రజలందరికీ శాంతి సౌఖ్యాలతో కూడిన జీవితం అందుబాటు కావాలనే మానవతా దృష్టి, కమ్యూనిస్టు సాహిత్య అధ్యయనం ద్వారా ఏర్పడిన దృక్పథం, దాని వల్ల కలిగిన చైతన్యం, కొంతమంది కమ్యూ నిస్టుల ఆచరణను ప్రత్యక్షంగా చూడగలగటం, ఇవన్నీ పెనవేసుకొనే ఆయన కమ్యూనిస్టు పార్టీలో చేరడానికీ, కార్యాచరణకూ ప్రేరేపించాయి. నిండు చైతన్యం, పరిపూర్ణ బాధ్యత, విప్లవ కార్యాచరణ ఆయనలో పెనవేసుకు పోయాయి.

పార్టీకి అతి క్లిష్ట సమయం అది. నందమూరులో మానికొండ ఇల్లు పార్టీ కార్యకర్తల రహస్య సమావేశాలకు స్థావరంగా, రక్షణ దుర్గంగా తయారయింది. కృష్ణాజిల్లా కమ్యూనిస్టు కమిటీ ఆ రహస్య కాలంలో జయప్రదంగా నడవడానికి మానికొండ ప్రధాన పాత్ర వహించారు. ఒక ఏడాదిపాటు మానికొండ విప్లవ కార్యాచరణను ప్రత్యక్షంగా చూసిన జిల్లా, రాష్ట్ర నాయకత్వం ఆయనను పార్టీ గన్నవరం తాలూకా ఆర్గనైజర్‌గా నియమించింది. అది 1941వ సంవత్సరం. చిత్తశుద్ధితో, అవిరామంగా పనిచేసి గన్నవరం తాలూకాలో ఆయన బలమైన కమ్యూనిస్టు పార్టీని నిర్మించారు. ప్రజల పట్ల, పార్టీ కార్యకర్తల పట్ల, ఆయన తీసుకునే వైఖరి, వారితో చర్చించే పద్ధతి, వారిని ఒప్పించి తలకొకపని అప్పగించి ప్రోత్సహించి పంపించే విధానం ఆదర్శప్రాయంగా, ప్రయోజనాత్మకంగా ఉండేవి. పార్టీ శాఖలు, కమిటీలు అవి ఎదుర్కొనే రాజకీయ నిర్మాణ ప్రజా సమస్యలను ఎలా పరిష్కరించుకోవాలో ఆయన నేర్పేవారు. ప్రతి సమస్యనూ రాజకీయ దృక్పథంతో విశ్లేషించి పరిష్కారం చూపేవారు. తీవ్ర విభేదాలు తలెత్తిన సందర్భాల్లో కూడా సహనం కోల్పోకుండా ఇతరులు చెప్పింది ఓపిగ్గా విని విప్లవ పరిజ్ఞానంతో వివరించడం ఆయన ప్రత్యేకత. ముఖంలో చిరునవ్వు, వైఖరిలో నమ్రత ఆయనను వీడేవికావు. కార్మికుల నుంచి మేధావుల వరకూ అందరితో ఆయన సామరస్యంగా వ్యవహరించేవారు. ముఖ్యంగా కార్యకర్తలను రాజకీయంగా చైతన్యవంతులను చేయడంలోనూ, వాళ్లు తమ కాళ్లమీద తాము నిలబడగలిగేపాటి దక్షత సమకూర్చడంలోనూ పార్టీ ఆర్గనైజర్‌గా ఆయన ప్రతిభ వెల్లడయింది. రెండేళ్లలో పార్టీ నిర్మాణానికీ ప్రజా ఉద్యమానికీ ఆయన చేసిన కృషికి గుర్తింపుగా ఆయనను కృష్ణాజిల్లా నాయకత్వానికి ప్రమోట్ చేసింది.

పార్టీ కృష్ణాజిల్లా నాయకత్వం స్వీకరించిన తరువాత అనేక వ్యతిరేక శక్తులను ఎదుర్కొంటూ పార్టీ విధానాలను ప్రజలకు ఓపికతో, సమర్థతతో వివరిస్తూ ప్రజల నిత్య జీవిత సమస్యలపై నిర్మాణాత్మకంగా పనిచేస్తూ పార్టీ పట్ల ప్రజల్లో అనుకూల ధోరణి, మార్పు తీసుకురావడంలో ఆయన ప్రధాన పాత్ర నిర్వహించారు. పార్టీపై అంత వ్యతిరేకత ఉన్న ఆ రోజుల్లో సయితం పార్టీ కొత్త ప్రాంతాలకూ, కొత్త వర్గాలకూ

(మిగతా 51వ పేజీలో)

KRSA102M118

## లోపలి పేజీల్లో...




## సంపాదక వర్గం

**పాటూరు రామయ్య (సంపాదకులు)**

**ఎస్.వెంకట్రావు (వర్కింగ్ ఎడిటర్)**

**డా. వై. రాధాకృష్ణమూర్తి**

భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు)
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ తరుపున
ప్రచురణ కర్త, ముద్రాపకుడు : బి.వి.రాఘవులు
సంపాదకులు : పాటూరు రామయ్య
ముద్రణ : ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్,
1-1-60/2, ఆర్టీసీ క్రాస్ రోడ్స్,
హైదరాబాద్-20
ఫోన్ : ఎడిటోరియల్ 27665420, 27663761
మేనేజర్: 27673787 ఫ్యాక్స్: 27639921
EMail::marxist@cpimap.com
Visit cpi(m) site at : cpim.org


# పార్టీ నిర్మాణాన్ని పటిష్టపరుచుకుందాం!

మార్క్సిజం-లెనినిజం అనేది కేవలం సిద్ధాంతం మాత్రమే కాదు, ఆచరణకు మార్గదర్శి. మానవ సమాజాన్ని శాస్త్రీయ పద్ధతితో విశ్లేషించే విజ్ఞాన శాస్త్రం. సమాజ గమన మార్గాన్ని చూపించే దిక్సూచి. అటువంటి శాస్త్రీయమైన సిద్ధాంతాన్ని భారతదేశ పరిస్థితులకు వర్తింపజేసేదే భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) కార్యక్రమం. విజ్ఞాన శాస్త్రం ఎంతగానో అభివృద్ధి చెందినప్పటికీ మానవ సర్వతోముఖాభివృద్ధి జరక్కుండా అడ్డుపడుతున్న నేటి భారతీయ సామాజిక వ్యవస్థను సమూలంగా మార్చి, నూతన సమాజాన్ని నిర్మించే విప్లవ కార్యక్రమం అది. ఆ కార్యక్రమాన్ని అర్థం చేసుకుని, ఆమోదించి, ఆచరణలో పెట్టడమంటే మార్క్సిజం-లెనినిజాన్ని ఆచరణకు జోడించడమే. భారత దేశంలో అటువంటి విప్లవ కార్యచరణ, నిర్మాణం కలిగిన పార్టీ భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు). ప్రస్తుతం పార్టీ మహాసభలు జరుపుకుంటోంది. మార్చిలో అఖిల భారత మహాసభలు, ఫిబ్రవరిలో రాష్ట్ర మహాసభలు జరుగుతున్నాయి. మూడేళ్లకొకసారి జరిగే మహాసభలు గడిచిన మూడేళ్ల రాజకీయ, పోరాట అనుభవాలను విశ్లేషించుకుని రానున్న మూడేళ్ల కాలానికి మార్గనిర్దేశం చేసుకునే సందర్భాలు. గత మూడేళ్లుగా సిపిఐ(ఎం) అనుసరించిన రాజకీయ విధానం దేశ రాజకీయ రంగంలో దానికి విశిష్ట స్థానం కల్పించింది. మతోన్మాదులను అధికారానికి దూరంగా ఉంచేందుకు యుపిఎకు మద్దతిస్తూనే దాని ప్రజా వ్యతిరేక విధానాలపై పార్టీ రాజీలేని పోరాటం చేస్తోంది. ప్రజాసమస్యలమీద, శ్రామిక ప్రజల హక్కులకోసం మిలిటెంట్ పోరాటాల వరవడికి తెరతీసింది. రాష్ట్రంలోనూ వరంగల్ మహాసభల నిర్ణయం మేరకు ప్రజాపునాది విస్తరణ లక్ష్యంగా అనేక పోరాటాలు నిర్వహించింది. నిర్వాసితుల సమస్యలు, పట్టణ పేద ప్రజల పోరాటాలు, సామాజిక సమస్యలు, అసంఘటిత కార్మిక సమస్యలతోబాటు గ్రామీణ పేదలకు సంబంధించిన అనేక సమస్యలపై ప్రజలను కదిలించింది. కదిలిస్తోంది. భూపోరాటం వీటన్నిటికీ తలమానికం. ఈ పోరాటాల ద్వారా పార్టీ విస్తృత స్థాయిలో ప్రజల్లోకి వెళుతోంది. రానున్న కాలంలో మరిన్ని పోరాటాల ద్వారా అధిక సంఖ్యాక ప్రజలకు చేరువ కానున్నది. అయితే పోరాటాలు చేస్తే సరిపోదు. పోరాటాల్లోకి వచ్చిన ప్రజలను రాజకీయంగా చైతన్య పరిచి విప్లవ పార్టీ నిర్మాణంలోకి ఇముడ్చుకున్నప్పుడే పార్టీ పునాది విస్తరిస్తుంది. దీనికిగాను యావత్తు పార్టీ యంత్రాంగాన్ని సైద్ధాంతికంగానూ, నిర్మాణపరంగానూ విజ్ఞానవంతులను చేయాలి. ఆచరణలేని సిద్ధాంతం కుంటిది, సిద్ధాంతం లేని ఆచరణ గుడ్డిది అని మార్క్స్ మహనీయుడు చెప్పాడు. విప్లవ పార్టీ ఈ రెంటినీ మేళవించాలి. పార్టీలో వివిధ కమిటీల స్థాయిల్లోనూ, వ్యక్తుల స్థాయిలోనూ అది జరగాలి. ఆ ఉద్దేశ్యంతోనే ఈ సంచికను పార్టీ నిర్మాణ ప్రత్యేక సంచికగా తీసుకువచ్చాం. పార్టీ సభ్యులు, అనుయాయులు, వామపక్ష అభిమానుల్లోకి దీన్ని విస్తృతంగా తీసుకుపోవాలి. ఇందులోని అంశాలను చదవాలి, చదివించాలి. ఆచరణలో పెట్టాలి.

పాటూరు రామయ్య


## చందా వివరాలు

విడిప్రతిక : రు.5.. సంవత్సర చందా : రు.60
పోస్టు ద్వారా లేదా ఏజెంటు ద్వారా తెప్పించుకోవచ్చు.
లేదా మీ స్థానిక పార్టీ కార్యాలయంలో సంప్రదించండి.
ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలలోనూ లభిస్తాయి.

**చిరునామా**
మార్క్సిస్టు
(సైద్ధాంతిక మాసపత్రిక)
వీధి నెం1, అశోక్‌నగర్,
హైదరాబాద్-20

# పోరాటాలతో ప్రజాపునాది విస్తరణ

**చరిత్ర చోదక శక్తి వర్గపోరాటమేనని కమ్యూనిస్టుల విశ్వాసం. పోరాటం, ఉద్యమం లేకుండా ఏ పరిస్థితీ మారదు. పోరాటాలు ఉధృతం చేయడాన్ని అందుకే ముఖ్య కర్తవ్యంగా మార్క్సిస్టు పార్టీ పెట్టుకుంది. గత దశాబ్ధ కాలంలో పోరాటాల వైపుకు పార్టీని మళ్లించేందుకు తీవ్రప్రయత్నం చేశాం. కమ్యూనిస్టు ఉద్యమంలో మైలురాళ్లుగా నిలిచిపోగలిగే పోరాటాలు ఈ కాలంలో జరిగాయి.**

**బి.వి. రాఘవులు**

మన రాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమానికి ఘనమైన చరిత్ర ఉంది. 50వ దశకంలో కాంగ్రెస్ పార్టీ అధికారాన్ని సవాల్ చేసే స్థితికి కమ్యూనిసు పార్టీ ఎదిగింది. 1952 ఎన్నిల్లో ఆంధ్రా ప్రాంతంలో కాంగ్రెస్ కన్నా ఒక స్థానాన్ని ఎక్కువగా సాధించింది. హైదరాబాద్ రాష్ట్రంలో జరిగిన ఎన్నికల్లో 37 స్థానాలతో కాంగ్రెస్‌తో సమ ఉజ్జీగా నిలిచింది. 1955లో జరిగిన ఎన్నికల్లో ఆంధ్రా ప్రాంతంలో కమ్యూనిస్టులు అధికారంలోకి రాబోతున్నారన్న వాతావరణం నెలకొంది. 1956లో ఆంధ్రప్రదేశ్ అవతరించే నాటికి కాంగ్రెస్‌కు ప్రత్యర్థిగా, సమ ఉజ్జీగా కమ్యూనిస్టు పార్టీ ప్రజల్లో గౌరవాన్ని సంపాదించింది. అటువంటి స్థాయిలో ఉన్న కమ్యూనిస్టు పార్టీ తదనంతర కాలంలో బలహీనపడింది. నేడు రాజకీయంగా కీలకశక్తిగా ఉన్నప్పటికీ భౌతికంగా పరిమితశక్తిగానే మిగిలింది. ఈ పరిణామం ఎందుకు జరిగింది? మళ్లీ పూర్వ స్థాయి ఎప్పటికి వస్తుంది? ఎలా వస్తుంది? అని వామపక్ష శ్రేయోభిలాషులు అడుగుతుంటారు. కమ్యూనిస్టు పార్టీ చీలిపోయినందునే బలహీనమైంది, కాబట్టికలిసిపోతే మళ్లీ బలపడుతుంది అని కొంతమంది సూచిస్తుంటారు. ఈ వాదన మొదటి భాగంలో కొంత వాస్తవం ఉన్నప్పటికీ రెండో భాగంలో వాస్తవికత వుందని చెప్పలేం. బెంగాల్, కేరళ, త్రిపురల్లో కూడా కమ్యూనిస్టు ఉద్యమంలో చీలికలు సంభవించాయి. అయినా ఈ చీలిక దుష్ప్రభావం అక్కడ కమ్యూనిస్టు ఉద్యమాన్ని బలహీనం చేయలేకపోయ్యింది. అనంతర కాలంలో యింకా బలం పుంజుకుని ఆ రాష్ట్రాల్లో పరిపాలనను సాధించే స్థాయికి కమ్యూనిస్టు ఉద్యమం చేరుకుంది. కాని ఆంధ్రప్రదేశ్‌లో అలా జరగలేదు. అందుకే రాష్ట్రంలో ఉద్యమం బలహీనం కావడానికి చీలికలు మాత్రమే కారణంగా పరిగణిస్తే సరిపోదు. కమ్యూనిస్టు ఉద్యమం ఆంధ్రా, తెలంగాణా ప్రాంతాల్లో అభివృద్ధియైన తీరుతెన్నులనూ, మంచిచెడులనూ కూలంకుషంగా పరిశీలించి, అనేక అంశాలను పరిగణనలోకి తీసుకుంటేనే కారణాలు అర్థమవుతాయి. ప్రస్తుతం ఈ వ్యాసంలో ఇటువంటి పరిశీలన చేయబోవడం లేదు. కాని, పాత ఔన్నత్యాన్ని మళ్లీ సాధించగలమా? సాధించాలంటే ఏం చేయాలి? అనే అంశాలను పరిశీలించడం ప్రస్తుతం అవసరం. ఆంధ్రప్రదేశ్‌లో నేడు వస్తున్న పరిణామాల నేపథ్యంలో కమ్యూనిస్టు ఉద్యమం మళ్లీ పాత ఔన్నత్యాన్ని సాధించడం కష్టం ఏమీ కాదని ఎవరికైనా సులభంగానే అర్థమవుతుంది. ఇందుకు మూడు ముఖ్యమైన కర్తవ్యాలు నెరవేరాలి. అవి 1. ప్రజాపోరాటాలను ఉధృతం చేయడం, 2.రాష్ట్రవ్యాప్త నిర్మాణాన్ని పటిష్టం చేయడం, 3.వామపక్ష ఐక్యతను బలపర్చడం.

చరిత్ర చోధక శక్తి వర్గపోరాటమేనని కమ్యూనిస్టుల విశ్వాసం. పోరాటం, ఉద్యమం లేకుండా ఏ పరిస్థితీ మారదు. పోరాటాలు ఉధృతం చేయడాన్ని అందుకే ముఖ్య కర్తవ్యంగా మార్క్సిస్టు పార్టీ పెట్టుకుంది. గత దశాబ్ధ కాలంలో పోరాటాల వైపుకు పార్టీని మళ్లించేందుకు తీవ్రప్రయత్నం చేశాం. కమ్యూనిస్టు ఉద్యమంలో మైలురాళ్లుగా నిలిచి పోగలిగే పోరాటాలు ఈ కాలంలో జరిగాయి.

2000 సంవత్సరంలో విద్యుత్ ఛార్జీల పెంపుదలకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమం ఈ పోరాటాల్లో మొదటిది. పెరిగిన విద్యుత్ ఛార్జీలను తగ్గించాలన్న కోరికతో ఉద్యమం జరిగినప్పటికీ, సరళీకరణ విధానాలకు దేశంలో ఎదురైన మొట్టమొదటి గట్టిసవాల్ ఈ ఉద్యమమే. ప్రపంచబ్యాంకు ప్రయోగశాలగా ఎంచుకుని ఆంధ్రప్రదేశ్‌లో అమలుచేసే సర్దుబాటు పథకాల్లో భాగంగా విద్యుత్‌రంగ సంస్కరణలు చేపట్టబడ్డాయి. ఆ సంస్కరణల దుష్ప్రభావమే విద్యుత్ ఛార్జీల పెరుగుదల. ఛార్జీలు తగ్గించాలని 100 రోజుల పాటు



రచయిత భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) రాష్ట్ర కార్యదర్శి, పొలిట్‌బ్యూరో సభ్యులు

పోరాటం నడిచింది. సరళీకరణ విధానాలకు వ్యతిరేకంగా, అనుకూలంగా తీవ్రస్థాయిలో సంఘర్షణ జరిగింది. ఉద్యమాన్ని అణిచి వేయాలని ఒకవైపు ప్రభుత్వం శాయశక్తులా ప్రయత్నం చేస్తే, మరోవైపు విశాలమైన మద్దతు ఉద్యమానికి లభించింది. ఈ ఉద్యమం దేశంలో సరళీకరణ విధానాలను వ్యతిరేకించే ఇతర శక్తులకు ఉత్తేజాన్నిచ్చింది. 'ప్రపంచబ్యాంకు విధానాలకు ఎదురులేదు, ప్రత్యామ్నాయం లేదు' అనే నిర్లిప్త వాతావరణాన్ని బద్దలు చేసి, ప్రతిఘటించవచ్చు, తిప్పికొట్టవచ్చు అనే

> " ప్రపంచబ్యాంకు ప్రోత్సాహంతో ప్రతిష్టాత్మకమైన ప్రభుత్వ రంగ సంస్థ ఆర్‌టిసిని బలహీనం చేసి ప్రైవేటురంగాన్ని ప్రోత్సహించడానికి ప్రభుత్వం ప్రారంభించిన ప్రయత్నాలను త్రిప్పి కొట్టడానికి కార్మికవర్గం చేసిన ముఖ్య ప్రయత్నమే ఈ సమ్మె. ఈనాటికీ ఆర్‌టిసి రక్షించబడిందంటే ఆ వీరోచిత పోరాట ఫలితమే. ఐక్య పోరాటాలను నిర్వహిస్తే ప్రపంచబ్యాంకు ప్రోత్సాహంతో హానికరమైన సంస్కరణలను నిలవరించ గలమన్న విశ్వాసాన్ని ఈ పోరాటం కల్గించింది. "



2000 ఉవ్వెత్తున సాగిన విద్యుతుద్యమంపై తెలుగు దేశం ప్రభుత్వ దమనకాండ



విశ్వాసాన్ని కల్గించింది. ఆఖరుకు ప్రతిపక్షంలో ఉన్న కాంగ్రెస్ కూడా ప్రపంచ బ్యాంకుకు వ్యతిరేకంగా మాట్లాడాల్సిన పరిస్థితిని ఉద్యమం కల్పించింది. ప్రపంచ బ్యాంకు ప్రశంసలు, అమెరికా అధ్యక్షుని కరచాలనాలు చూసి, మురిసిపోయి అదే ప్రజా మద్దతు అని భ్రమపడిన తెలుగు దేశం పార్టీ ఎన్నికల్లో ఖంగు తినాల్సి వచ్చింది. ప్రజా తీర్పుకు తలొగ్గాల్సిన పరిస్థితి వచ్చింది.

ఆర్.టి.సి. ఉద్యోగులు 2001 అక్టోబరు, నవంబరు మాసాలలో 24 రోజుల పాటు చారిత్రాత్మకమైన సమ్మె చేశారు. నిర్బంధాన్ని ప్రయోగించి సమ్మెను అణిచివేయాలని తెలుగుదేశం ప్రభుత్వం చేసిన ప్రయత్నాలను అసాధారణ ఐక్యతతో, పోరాట పటిమతో ఉద్యోగులు త్రిప్పి కొట్టారు. ఈ సమ్మెకు వెన్నెముకగా నిలిచి పోరాటానికి నాయకత్వం వహించి నడిపింది యస్.డబ్ల్యుఎఫ్, సిఐటియు, సిపియం కార్యకర్తలే. ప్రపంచబ్యాంకు ప్రోత్సాహంతో ప్రతిష్టాత్మకమైన ప్రభుత్వ రంగ సంస్థ ఆర్‌టిసిని బలహీనం చేసి ప్రైవేటురంగాన్ని ప్రోత్సహించడానికి ప్రభుత్వం ప్రారంభించిన ప్రయత్నాలను త్రిప్పి కొట్టడానికి కార్మికవర్గం చేసిన ముఖ్య ప్రయత్నమే ఈ సమ్మె. ఈనాటికీ ఆర్‌టిసి రక్షించబడిందంటే ఆ వీరోచిత పోరాట ఫలితమే. ఐక్య పోరాటాలను నిర్వహిస్తే ప్రపంచబ్యాంకు ప్రోత్సాహంతో హానికరమైన సంస్కరణలను నిలవరించగలమన్న విశ్వాసాన్ని ఈ పోరాటం కల్గించింది.

కొత్తగా అధికారం చేపట్టిన కాంగ్రెస్ ఒక సంవత్సరం పాటు ప్రపంచ బ్యాంకుకూ, సరళీకరణ విధానలకూ దూరంగా ఉన్నట్లు కనిపించినా, భారత పాలకవర్గాల నైజంలో భాగంగా మళ్లీ ప్రపంచబ్యాంకును అది ఆశ్రయించింది. అదే సరళీకరణ విధానాలను ప్రారంభించింది. రహస్యంగా ప్రపంచబ్యాంకు షరతులను అమలు జరపడానికి ప్రభుత్వం పూనుకుంది. ప్రభుత్వ రంగ సంస్థలను వదిలించుకోవడానికి జిఓనెం5ను విడుదల చేసింది. తీవ్ర ప్రతిఘటన మూలంగా ప్రభుత్వం ఉపసంహరించుకున్నది.

జిల్లా సమగ్రాభివృద్ధి కోసం ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడానికి మార్క్సిస్టు పార్టీ ఆధ్వర్యంలో అన్ని జిల్లాల్లో పాదయాత్రలు జరిగాయి. 2005 నవంబరు నుండి 2006 ఫిబ్రవరి వరకు 22 జిల్లాల్లో పార్టీ జిల్లా నాయకుల ఆధ్వర్యంలో మారుమూల ప్రాంతాలను తాకుతూ మహాపాదయాత్రలు జరిగాయి. ఖమ్మం జిల్లాలో 2004లోనే కాలినడక యాత్ర పూర్తయింది. ఈ యాత్ర స్ఫూర్తితోనే రాష్ట్రవ్యాపితంగా అన్ని జిల్లాల్లో కాలినడకలు జరిగాయి. తూర్పుగోదావరి, విశాఖపట్నం జిల్లాల్లో ప్రత్యేకంగా గిరిజన ప్రాంతాలలో కొండలు,

> **“ ఎక్కడ నిర్వాసితులుంటే, ఎక్కడ అన్యాయం జరుగుతుంటే అక్కడ పార్టీ నాయకులు ప్రత్యక్షమయ్యారు. చిత్తూరు జిల్లా సత్యవీడు యస్ఇజడ్ అయినా, తూప్రాన్ కార్ల ఫ్యాక్టరీ నిర్వాసితులయినా, కృష్ణపట్నం పోర్టు బాధితులైనా, వెంగళరాయసాగర్, మిడ్‌మానేరు ముంపు రైతులయినా, గుండ్లకమ్మ-హంద్రీనీవా, పిఎబిఆర్, వంశధార నిర్వాసితులయినా, ఔటర్ రింగు రోడ్డు బాధితులయినా - పార్టీ వారికి అండగా నిలిచింది. ”**



2007లో భూ పోరాటంపై కాంగ్రెస్ ప్రభుత్వ నిర్బంధ కాండ

కోనలన్నీ చుడుతూ నడక సాగించారు. ఈ యాత్రలలో 230 మంది నాయకులు 26500 కిలో మీటర్లు నడిచారు. 800 మండలాల్లో 8000 గ్రామాలను సందర్శించారు. ప్రజలను కలుసుకోవడం, వారి నుండి తెలుసుకోవడం ప్రత్యక్షంగా అధ్యయనం చేయడం, అభివృద్ధికి తోడ్పడే మార్గాలను ప్రజల నుంచి ప్రత్యక్షంగా సేకరించడం, ప్రభుత్వ పరిపాలన తీరుతెన్నులను గమనించడం, మేధావులు, పరిశీలనా పరుల నుండి సూచనలను సేకరించడం పాదయాత్ర బృందాలు చేశాయి. యాత్రలో గడించిన అనుభవం, వచ్చిన సమాచారం ప్రాతిపదికన జిల్లా సమగ్రాభివృద్ధి ప్రణాళికలను తయారు చేసి ప్రభుత్వం ముందు, పరిపాలనా యంత్రాంగం ముందుంచడం జరిగింది. ఈ యాత్రలు పార్టీని ప్రజలతో మమేకం చేశాయి. ప్రజల సాధకబాధకాలను నాయకులకు సాక్షాత్కరింపజేశాయి. సమగ్ర దృక్పథాన్నిచ్చాయి. అనంతర కాలంలో జరిగిన ఉద్యమాలకు, పోరాటాలకు ప్రాతిపదికనూ, అవగాహననూ కల్గించాయి.

ఈకాలంలో నిర్వాసితుల సమస్యలు తీవ్రరూపం దాల్చాయి. అభివృద్ధి పేరుతోనూ, ప్రాజెక్టుల పేరుతోనూ వేల ఎకరాలు రైతుల నుండి కారుచౌకగా ప్రభుత్వం బలవంతంగా స్వాధీనం చేసుకుంది. త్యాగం ఒకరిది, లాభం ఒకరిది - ఇది అన్యాయం అని సిపియం నిర్వాసితుల పక్షాన నిలబడి పోరాడింది. విజయనగరం జిల్లా తోటపల్లి నిర్వాసితుల ఉద్యమాన్ని నడిపింది. ఉద్యమాన్ని అణిచివేసేందుకు 2005 ఏప్రిల్‌లో ప్రభుత్వం ప్రజలపై కాల్పులు జరిపింది. పోలవరం ప్రాజెక్టు నిర్వాసితుల కోసం పోరాటాన్ని నడిపింది. 2005 జూలై ఆగస్టులలో 602 కి.మీ. పాదయాత్ర నిర్వహించి గ్రామ గ్రామాలలో గిరిజన ప్రజలను కదిలించింది. 2007 జనవరిలో ఆందోళన చేస్తున్న ప్రజలపై కాల్పులు జరిపి ప్రభుత్వం దమనకాండను ప్రయోగించింది. న్యాయం కోసం ఈ పోరాటం ఇంకా కొనసాగుతూనే వున్నది.

గంగవరం పోర్టు నిర్మాణం కోసం వందలాది మత్స్యకార్మికుల కుటుంబాలను ప్రభుత్వం వీధులపాల్జేసింది. సముద్రపు వేటను నిరోధించి దూరంగా తరిమి వేయడానికి పూనుకున్నది. మత్స్యకారుల తరపున పార్టీ నిలబడి పోరాడింది. 2000 మార్చిలో ఉద్యమాన్ని అణిచివేయడానికి పోలీసులు జరిపిన కాల్పుల్లో ఒకరు మృతి చెందారు. ఆఖరుకు ప్రభుత్వం కొన్ని రాయితీలిచ్చి దిగిరావలసి వచ్చింది.

ఎక్కడ నిర్వాసితులుంటే, ఎక్కడ అన్యాయం జరుగుతుంటే అక్కడ పార్టీ నాయకులు ప్రత్యక్షమయ్యారు. చిత్తూరు జిల్లా సత్యవీడు యస్ఇజడ్ అయినా, తూప్రాన్ కార్ల ఫ్యాక్టరీ నిర్వాసితులయినా, కృష్ణపట్నం పోర్టు బాధితులైనా, వెంగళరాయసాగర్, మిడ్‌మానేరు ముంపు రైతులయినా, గుండ్లకమ్మ-హంద్రీనీవా, పిఎబిఆర్, వంశధార నిర్వాసితులయినా, ఔటర్ రింగు రోడ్డు బాధితులయినా - పార్టీ వారికి అండగా నిలిచింది.

రాష్ట్రంలో నూటికి 94 శాతం కార్మికులు అసంఘటిత రంగంలో వున్నారు. సరళీకరణ ఆర్థిక విధానాలు వచ్చిన తర్వాత వారి పరిస్థితి ఇంకా దిగజారింది. ఉద్యోగభద్రత, కనీస భృతి, సామాజిక భద్రత కావాలని సిఐటియు రంగాల వారీగా, అన్ని రంగాలు కలిపి పెద్ద యెత్తున రాష్ట్రవ్యాపిత ఆందోళనలు నిర్వహించింది. 2006 అక్టోబరులో శ్రామిక సమరభేరి పేరుతో 1000 మండలాలను తాకుతూ యాత్ర నిర్వహించింది. 2007 ఫిబ్రవరిలో వేలాది మందితో ఛలో అసెంబ్లీ కార్యక్రమం నిర్వహించింది. సిపియం శాసనసభాపక్షం అసంఘటిత రంగ కార్మికుల సమస్యలపై సభలో ప్రభుత్వాన్ని నిలవేసింది. ఇతర రాష్ట్రాలను పరిశీలించిన తర్వాత అసంఘటిత రంగ కార్మికుల సంక్షేమం కోసం ప్రత్యేక పథకాన్ని చేపడతామని ప్రభుత్వం ప్రకటించాల్సి వచ్చింది. 2007 ఆగస్టులో జరిగిన అసంఘటిత రంగ దేశవ్యాపిత సమ్మె

రాష్ట్రంలో సంపూర్ణంగా జయప్రదమైంది.

సమాజంలో వేళ్ళూనుకొని కొనసాగుతున్న కులవివక్ష, అస్పృశ్యతల నిర్మూలనకై సిపియం సమరశంఖం పూరించింది. కులవివక్ష వ్యతిరేక పోరాట సంఘం నిర్వహిస్తున్న ఉద్యమాలకు అండగా నిలిచింది. ఆనాటి నుండి ఈనాటి వరకు నిర్విరామంగా, నిరంతరాయంగా కులవివక్షపై పోరాటం చేస్తున్నది. 1999 మార్చిలో వేలాదిమందితో శాసనసభను ముట్టడించే కార్యక్రమాన్ని నిర్వహించింది. బయట పట్టువదలని ప్రజలు, లోపల గట్టిగా పట్టుబట్టిన శాసనసభ్యులు ఈ వత్తిడితో కులవివక్షను అధ్యయనం జేసేందుకు ప్రత్యేక కమీషన్ నియమిస్తామని ప్రభుత్వం ప్రకటించాల్సి వచ్చింది. 2001లో కమీషన్ నివేదిక సమర్పించిన తర్వాత శాశ్వత కమీషన్ కోసం ఆందోళన కొనసాగించాం. కమిషన్‌ను సాధించుకున్నాం. 2001 మార్చి, ఏప్రిల్ మాసాలలో గ్రామ గ్రామాన కులవివక్షపై ప్రతిఘటనా కార్యక్రమాలు చేపట్టాం. 136 కేంద్రాలలో కులవివక్షను ప్రతిఘటించి రూపుమాపడం జరిగింది. 2006 ఏప్రిల్‌లో రంగారెడ్డి జిల్లాలో 152 గ్రామాలలో 950 కి.మీ. దూరం సైకిల్ యాత్ర నిర్వహించి గ్రామ గ్రామాన కులవివక్షను నిర్మూలించే ప్రతిఘటనలను సాగించాం. 2007 ఫిబ్రవరిలో 25 మంది కార్యకర్తలు వారం రోజులపాటు నిరాహారదీక్షలు జరిపి నోడల్ ఏజన్సీ నియామకం చేస్తామన్న వాగ్దానాన్ని ప్రభుత్వం నుండి సాధించడం జరిగింది. ఏప్రిల్‌లో 170 సైకిల్ బృందాలు 998 మండలాల్లోని 8336 గ్రామాలలో, 50000 కి.మీ. పర్యటించి కుల వివక్షకు వ్యతిరేకంగా ప్రజలలో చైతన్యం రగిలించడం జరిగింది. సాంఘిక అసమానతల సమస్యను రాజకీయ ఎజెండాలోకి, బలహీన వర్గాల అభివృద్ధిని శాసనసభలో చర్చనీయాంశాల్లోకి ఈ ఉద్యమం తేగల్గింది. దళితులలో క్రొత్త ఆశలు రేకెత్తించింది.

బలహీనవర్గాల పిల్లలు అత్యధికంగా వుండే సాంఘిక సంక్షేమ హాస్టల్స్ అధ్వాన్న స్థితిలో వున్నాయి. వాటి మెరుగు కోసం ఎంతో కాలం నుండి విద్యార్థులు ఆందోళన చేస్తున్నారు. 2005లో భారత విద్యార్థి ఫెడరేషన్ 1772 హాస్టల్స్‌ను సర్వే చేసి సంక్షేమ హాస్టల్ దుర్భర పరిస్థితులను సమాజం ముందుకు తెచ్చింది. 2006 డిశెంబరులో వేలాదిమందితో ఛలో అసెంబ్లీ నిర్వహించి ప్రభుత్వాన్ని నిలదీశారు.

**❝ ప్రజల ఆకాంక్షలకనుగుణంగా వామపక్షాలు ఎదగాలంటే పోరాటాలే చాలవు. పోరాటాలకు తోడు రాష్ట్రవ్యాపితమైన నిర్మాణం కూడా కావాలి. పోరాటాలలో ముందుకువచ్చిన సమరశీలురలను పార్టీ, ప్రజాసంఘాలలో ఇముడ్చుకొని రాష్ట్రవ్యాపిత ప్రభావాన్ని వేయగల శక్తిగా ఆవిర్భవించాలి. అటువంటి నిర్మాణాన్ని ఏర్పర్చుకోవాలి. దానికోసం అవసరమైన ప్రయత్నం చేయాలి. ❞**

సంక్షేమ హాస్టల్ సమస్యను రాజకీయ ఎజండాలోకి తీసుకురావడంలో సిపియం విద్యార్థులకు సంపూర్ణంగా సహకరించింది.

ఈకాలంలో జరిగిన పోరాటాలలో తలమానికంగా చెప్పుకోదగ్గది భూపోరాటం. ఇళ్ళ స్థలాల కోసం, సాగుభూమి కోసం సుదీర్ఘకాలం పోరాటం సాగింది. కోనేరు రంగారావు భూకమిటీ సిఫారసులను అమలు చేయాలని ఉద్యమం కోరింది. ఉవ్వెత్తున ప్రజానీకం ఉద్యమంలో పాల్గొన్నారు. నిర్బంధం ప్రయోగించినా, లాఠీచార్జి చేసినా, జైళ్ళలో కుక్కినా వెరవకుండా ప్రజలు ముఖ్యంగా మహిళలు సమరశీలంగా ఉద్యమాన్ని నిర్వహించారు. ఉద్యమ ఉధృతిని చూసి ప్రభుత్వమే ఆశ్చర్యపోవలసి వచ్చింది. తొక్కిపట్టిన భూకమిటీ నివేదికను బహిరంగపర్చి అత్యధిక సిఫారసులను ఆమోదించామని ప్రకటించాల్సి వచ్చింది. మొక్కుబడిగానైనా కమీషనర్‌ను నియమించాల్సి వచ్చింది. భూఉద్యమాన్ని బలహీనం జేసేందుకు మొక్కుబడిగానైనా నాల్గు విడతలు భూపంపిణీ చేపట్టాల్సి వచ్చింది. ఇందిరమ్మ ఆదర్శ గ్రామాల అక్రమాలు బట్టబయలు చేస్తే కొన్ని లోపాలను సవరించాల్సి వచ్చింది. అయినా మౌలికమైన నిర్ణయాలు తీసుకోకుండా ఉద్యమాన్ని అణిచివేయడానికీ, అప్రతిష్ట పాల్జేయడానికే ప్రభుత్వం పూనుకున్నది. వామపక్షాల రాష్ట్ర నాయకుల నిరాహార దీక్షను బలవంతంగా భగ్నం చేసింది. హర్తాళ్ చేస్తున్న ప్రజలపై అన్యాయంగా కాల్పులు జరిపి ఏడుగుర్ని పొట్టన బెట్టుకున్నది. ఈ కిరాతక హత్యాకాండ కాంగ్రెస్ ప్రభుత్వానికి ఒక మాయని మచ్చగా మిగిలి పోతుంది. రాష్ట్రంలో భూ పోరాటం ప్రజాపోరాటాలలో అగ్రభాగాన నిలిచిపోతుంది. ఈ ఉద్యమాన్ని మరింత ఉధృతంగా, సమస్య పరిష్కారమయ్యేదాకా కొనసాగించేందుకు పార్టీ, సంఘాలు, ప్రజలు మళ్ళీ సన్నాహమవుతున్నాయి.

ఈ ఉద్యమాలు వామపక్షాల యొక్క ముఖ్యంగా సిపియం యొక్క ప్రతిష్టను ఇనుమడింప జేశాయి. నిస్వార్థంగా, పట్టుదలతో త్యాగాలకు వెనకాడకుండా ప్రజలకు సేవ చేసే పార్టీగా విశ్వాసం పొందింది. వామపక్షాలు ప్రత్యామ్నాయశక్తిగా ఆవిర్భవించాలన్న ప్రజల ఆకాంక్షను పెంచింది. అయితే ప్రజల ఆకాంక్షలకనుగుణంగా వామపక్షాలు ఎదగాలంటే పోరాటాలే చాలవు. పోరాటాలకు తోడు రాష్ట్రవ్యాపితమైన నిర్మాణం కూడా కావాలి. పోరాటాలలో ముందుకువచ్చిన సమరశీలురలను పార్టీ, ప్రజాసంఘాలలో ఇముడ్చుకొని రాష్ట్రవ్యాపిత ప్రభావాన్ని వేయగల శక్తిగా ఆవిర్భవించాలి. అటువంటి నిర్మాణాన్ని ఏర్పర్చుకోవాలి. దానికోసం అవసరమైన ప్రయత్నం చేయాలి.

వామపక్షాల మధ్య ఐక్యత కూడా ప్రత్యామ్నాయ శక్తులు పెరగడానికి, ప్రజల విశ్వాసం పొందడానికి అవసరం. ఉద్యమాల సందర్భంలో ఉభయకమ్యూనిస్టు పార్టీల మధ్య ఐక్యత బలపడుతున్నది. ఇది ఇంకా బలపడాల్సి వున్నది. భవిష్యత్తులో మరిన్ని పోరాటాలు, మరింత ఐక్యతతో నిర్వహించాల్సి వుంది. ఆ క్రమంలోనే వామపక్షాల ఐక్యత దుర్భేధ్యమైన స్థాయికి చేరుకుంటుంది. ఉమ్మడి రాజకీయ అవగాహన బలపడుతుంది. అంతిమంగా రాష్ట్రంలో కమ్యూనిస్టుఉద్యమం పూర్వవైభవాన్ని సాధించుకునేందుకు అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. పోరాటాలు, ఐక్య పోరాటాలు తప్ప వామపక్ష ఉద్యమ ఔన్నత్యాన్ని సాధించడానికి మరో దగ్గర మార్గం లేదు.



# ప్రత్యామ్నాయం: మార్క్సిస్టు పార్టీ అవగాహన

ప్రత్యామ్నాయంలో ఏ పార్టీలుంటాయన్నది కాదు, ఆ పార్టీల విధానాలు ఏమిటి అన్నది ముఖ్యం. ఈ ప్రత్యామ్నాయం ఎలా ఏర్పడుతుందన్నది కాదు, ఎందుకు ఏర్పడుతుందన్నది ముఖ్యం. ఆ ప్రత్యామ్నాయం ఎన్నికల్లో పాల్గొనవచ్చు కాని ఎన్నికల కోసం ఏర్పడిన ప్రత్యామ్నాయం కాదు.

**ఎస్. వెంకట్రావు**

తృతీయ ప్రత్యామ్నాయం అనే మాట నేడు రాజకీయాల్లో మారుమోగిపోతోంది. కేంద్రంలో బిజెపి, కాంగ్రెస్‌లకు ప్రత్యామ్నాయంగా మూడో ఫ్రంట్ గురించి మాట్లాడేవారు కొందరైతే, మన రాష్ట్రంలో కాంగ్రెస్, తెలుగు దేశం పార్టీలకు వ్యతిరేకంగా తృతీయ ప్రత్యామ్నాయం రావాలని కోరుకునే వారు మరి కొందరు.

బూర్జువా పాలక పార్టీలు, మీడియా దృష్టిలో తృతీయ ఫ్రంట్ అన్నా, తృతీయ ప్రత్యామ్నాయమన్నా, లేక పొత్తులన్నా...ఇవన్నీ కూడా ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని కొన్ని పార్టీలు కలవడం, విడిపోవడం మాత్రమే. వాళ్ల దృష్టిలో ప్రత్యామ్నాయం అంటే అధికారంలో ఉన్న పార్టీని, లేక పార్టీల కూటమిని వ్యతిరేకించే మరో పార్టీ లేక పార్టీల కూటమి. అంతేగాని ఆ పార్టీల విధానాలతో వాటికి నిమిత్తం లేదు. ప్రజాపోరాటాలతో అంతకన్నా సంబంధం లేదు. అందుకనే మీడియాలో నిత్యం ఎన్నికల పొత్తులకూ, ప్రత్యామ్నాయానికీ తేడా లేకుండా వార్తలూ, విశ్లేషణలూ వస్తుంటాయి. బూర్జువా రాజకీయ నాయకులు కూడా ఇదే ధోరణితో ప్రకటనలూ, వ్యాఖ్యానాలూ చేస్తుంటారు. అందువల్ల ప్రజల్లో తృతీయ ప్రత్యామ్నాయం అనగానే ఎన్నికల పొత్తులు అనే ధోరణి వ్యక్తం అవుతోంది. కమ్యూనిస్టుల రాజకీయాలనుకూడా వారు ఇదే దృష్టితో చూస్తుంటారు.

కాని భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) దృక్పథంలో ప్రత్యామ్నాయం అంటే బూర్జువా పార్టీలకు భిన్నమైన వైఖరి ఉంది. నిజానికి పార్టీ దృష్టిలో "తృతీయ ప్రత్యామ్నాయం" అనేదే లేదు. ఉన్నది ఒకే ప్రత్యామ్నాయం. అది పాలకపార్టీల విధానాలకు భిన్నమైన విధానాలు గల శక్తులు, పార్టీలతో కూడిన ప్రత్యామ్నాయం మాత్రమే. మార్క్సిస్టు పార్టీ దృష్టిలో ప్రత్యామ్నాయం వేరు, ఎన్నికల పొత్తులు వేరు. పార్టీ ఎన్నడూ ఈ రెంటినీ కలగా పులగం చేయదు. పార్టీ నాయకులు ఈ రెండు పదాలనూ రెండు అర్థాల్లో ఉపయోగిస్తారు. కాని వారి ప్రకటనలు అర్థమయ్యీ, అర్థంకాక– ఒకోసారి పనిగట్టుకుని – మీడియా కలగాపులగం చేస్తుంది. దాంతో పార్టీ విధానంపై ప్రజల్లో గందరగోళానికి అవకాశం కలుగుతుంది. పార్టీ సభ్యులు కూడా ఒక్కోసారి ఈ గందరగోళం నుండే ఎన్నికల పొత్తులపై పదేపదే ప్రశ్నలు వేస్తుంటారు. అందువల్ల మార్క్సిస్టు పార్టీ దృష్టిలో ప్రత్యామ్నాయం అంటే ఏమిటో, ఎన్నికల పొత్తులకూ ప్రత్యామ్నాయానికీ తేడా ఏమిటో విడమరిచి తెలుసుకోవడం అవసరం.

దేశంలో తమ వర్గ ప్రయోజనాలు కాపాడే ఒకేఒక రాజకీయ పార్టీ అధికారంలో కొనసాగితే పాలకవర్గాలు సంతోషిస్తాయి. అలా కాకపోతే అమెరికా, బ్రిటన్‌ల మాదిరిగా రెండు పార్టీల వ్యవస్థ ఉండాలని కోరుకుంటాయి. రెండు పార్టీల్లో ఏ పార్టీ అధికారంలో ఉన్నా పాలక వర్గాల అనుకూల విధానాలు అమలు చేస్తుంది. ఆ విధానాల వల్ల ప్రజల్లో వచ్చే అసంతృప్తిని ఉపయోగించుకునేందుకు ప్రతిపక్షంలో ఉన్న పార్టీ ప్రజానుకూల నినాదాలు ఇస్తుంది. తీరా ఆ ప్రతిపక్ష పార్టీ అధికారంలోకి వస్తే అది కూడా పాలకవర్గ విధానాలనే అనుసరిస్తుంది. ఇప్పుడు ప్రతిపక్షంలో ఉన్న మాజీ అధికార పార్టీ ప్రజానుకూల నినాదాలను అందుకుంటుంది. అమెరికా, బ్రిటన్‌లో జరుగుతున్నది అదే. దీన్నే సామ్రాజ్యవాదులు ఆధునిక ప్రజాస్వామ్య నమూనాగా వర్ణిస్తున్నారు. ప్రజాస్వామ్య విస్తరణ పేరుతో ప్రపంచ దేశాలన్నిటి మీదా ఈ నమూనానే రుద్దడానికి ప్రయత్నిస్తున్నారు.

మన దేశంలో కాంగ్రెస్, బిజెపిలు రెండు పార్టీల వ్యవస్థలను స్థాపించాలని కోరుకుంటున్నాయి. కాని బూర్జువా పాలకవర్గాల్లో సంక్షోభం దేశ రాజకీయ వ్యవస్థను ముక్కలు చేసింది. దాంతో అనేక ప్రాంతీయ పార్టీలూ, ఉప ప్రాంతీయ పార్టీలూ ఆవిర్భవించాయి. అందువల్ల మన దేశ రాజకీయాలు నేడు సంకీర్ణ యుగంలోకి అడుగుపెట్టాయి. సంకీర్ణాల యుగంలో కూడా కాంగ్రెస్, బిజెపి కేంద్రంగానే సంకీర్ణాలు ఏర్పడాలని కోరుకుంటున్నాయి. గత ఎన్నికల్లోనూ, అంతకు ముందూ వామపక్షాలు మినహా మిగిలిన పార్టీలన్నీ ఈ రెండు పార్టీల వెనుక చేరిపోవడంతో రెండు సంకీర్ణాలు ఏర్పడ్డాయి. ఒకటి, కాంగ్రెస్ నాయకత్వంలోని యుపిఎ, రెండోది బిజెపి నాయకత్వంలోని ఎన్డీఎ. అయితే ఎన్నికల్లో ఈ రెండు సంకీర్ణాల్లో



రచయిత భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) రాష్ట్ర కమిటీ సభ్యులు

దేనికీ పూర్తి మెజారిటీ రాకపోవడంతో మతతత్వ బిజెపిని అధికారం నుండి దూరంగా ఉంచే లక్ష్యంతో 'కనీస ఉమ్మడి కార్యక్రమం' (సిఎంపి) ప్రాతిపదికగా వామపక్షాలు యుపిఎ సంకీర్ణానికి బయటి నుండి మద్దతిచ్చాయి.

మార్క్సిస్టు పార్టీ దృష్టిలో యుపిఎ, ఎన్డీఎ రెండూ ఒకదానికొకటి ప్రత్యామ్నాయం ఎంతమాత్రం కాదు. రెంటిలో ఏది అధికారం లో ఉన్నా పాలకవర్గాలకు అనుకూలమైన విధానాలనే అనుసరిస్తాయి. రెండూ సామ్రాజ్య వాద ఒత్తిళ్లకు లొంగి దేశ ప్రయోజనాలకు హానిచేసే విధానాలనే చేపట్టాయి. రెండూ సరళీకరణ విధానాల పేరుతో ప్రజా వ్యతిరేక ఆర్థిక విధానాలనే అమలు చేశాయి. చేస్తున్నాయి. కాంగ్రెస్, బిజెపిలకు వ్యతిరేకంగా గతంలో కేంద్రంలో అధికారం చేపట్టిన నేషనల్ ఫ్రంట్, యునైటెడ్ ఫ్రంట్‌లు కూడా మార్క్సిస్టు పార్టీ దృష్టిలో ప్రత్యామ్నాయాలు కావు. అవి కూడా విధానాల విషయంలో కాంగ్రెస్, బిజెపిలకు భిన్నమైనవి కావు. కాకపోతే కాంగ్రెస్, బిజెపిలను అధికారానికి దూరంగా ఉంచడానికి తాత్కాలికంగా ఆ రెండు కూటములకు వామపక్షాలు మద్దతిచ్చాయి.

మరి మార్క్సిస్టు పార్టీ దృష్టిలో ప్రత్యామ్నాయం అంటే ఏమిటి? బూర్జువా పార్టీలకు భిన్నమైన విధానపరమైన ప్రత్యామ్నాయాన్ని మార్క్సిస్టు పార్టీ కోరుకుంటోంది. భారత దేశ సామాజిక పురోగమనం పట్ల మార్క్సిస్టు పార్టీకి స్పష్టమైన దృక్పథం ఉంది. పార్టీ కార్యక్రమం నిర్దేశించిన దృక్పథం అది. మార్క్సిజం–లెనినిజాన్ని భారత దేశ నిర్దిష్ట పరిస్థితులకు వర్తించేదే మార్క్సిస్టు పార్టీ కార్యక్రమం. మన దేశంలో సాగుతున్నది బూర్జువా భూస్వామ్య వర్గాల పాలన అనేది ఈ కార్యక్రమ అవగాహన. ఈ పాలక వర్గాలు విదేశీ పెట్టుబడిదారులతో రానురాను మరింతగా మిలాఖత్ అవుతున్నాయి. అందువల్ల స్వాతంత్ర్యానంతరం అధికారంలో ఏ పార్టీ, లేక సంకీర్ణం ఉన్నా పాలక వర్గ అనుకూల విధానాలనే అమలుచేస్తూ వస్తున్నాయి. ఈ విధానాలవల్ల ధనికులు మరింత ధనికులు అవుతూంటే, సామాన్య ప్రజల పరిస్థితి మరింత దిగజారుతోంది. ప్రజల చేతుల్లోకి నిజమైన అధికారం వచ్చినప్పుడే ఈ విధానాలు మారుతాయన్నది పార్టీ నిశ్చిత అభిప్రాయం. అధికారం ప్రజల చేతుల్లోకి రావాలంటే పాలక వర్గాల అధికారాన్ని కూలదోయాలి. కార్మికవర్గ నాయకత్వంలో, రైతాంగం, మధ్యతరగతి ప్రజలు, చిన్న పెట్టుబడిదారులతో కూడిన విశాల ఐక్య సంఘటన మాత్రమే ఈ పనిచేయగలదు. విస్తృతమైన ప్రజానీకంతో కూడిన వర్గ సంఘటన ఇది. దీన్ని 'జనతా ప్రజాతంత్ర ఐక్య సంఘటన' అని పార్టీ కార్యక్రమం పేర్కొంది. ఈ ఐక్యసంఘటనను నిర్మించి, ప్రజలను ఈ సంఘటనలోకి సమీకరించాలంటే ఆయా వర్గాల ప్రజల సమస్యలపై విస్తృతమైన పోరాటాలు నిర్వహించాలి. ఆ పోరాటాల క్రమంలో అనేక రాజకీయ వేదికలు నిర్మించబడతాయి. ఇటువంటి వేదికలు తాత్కాలికమైనవే కావచ్చు కాని ఇవి పాలక వర్గ అనుకూల విధానాలకు ప్రత్యామ్నాయంగా ప్రజానుకూల విధానాలను ముందుకు తెచ్చే వేదికలు. ఆయా వర్గాల ప్రజల పోరాటాల నుండి పుట్టుకొచ్చే వేదికలు. ప్రస్తుత పరిస్థితుల్లో అటువంటి రాజకీయ వేదిక నిర్మాణమే మార్క్సిస్టు పార్టీ దృష్టిలో ప్రత్యామ్నాయం అంటే.

**“ మార్క్సిస్టు పార్టీ దృష్టిలో యుపిఎ, ఎన్డీఎ రెండూ ఒకదానికొకటి ప్రత్యామ్నాయం ఎంతమాత్రం కాదు. రెంటిలో ఏది అధికారం లో ఉన్నా పాలకవర్గాలకు అనుకూలమైన విధానాలనే అనుసరిస్తాయి. రెండూ సామ్రాజ్య వాద ఒత్తిళ్లకు లొంగి దేశ ప్రయోజనాలకు హానిచేసే విధానాలనే చేపట్టాయి. రెండూ సరళీకరణ విధానాల పేరుతో ప్రజా వ్యతిరేక ఆర్థిక విధానాలనే అమలు చేశాయి. చేస్తు న్నాయి. ”**

ఈ ప్రత్యామ్నాయంలో ఏ పార్టీలుంటాయన్నది కాదు, ఆ పార్టీల విధానాలు ఏమిటి అన్నది ముఖ్యం. ఈ ప్రత్యామ్నాయం ఎలా ఏర్పడుతుందన్నది కాదు, ఎందుకు ఏర్పడుతుందన్నది ముఖ్యం. ఆ ప్రత్యామ్నాయం ఎన్నికల్లో పాల్గొనవచ్చు కాని ఎన్నికల కోసం ఏర్పడిన ప్రత్యామ్నాయం కాదు. ఎన్నికల ముందూ, ఎన్నికల తరువాత కూడా ఆ ప్రత్యామ్నాయం పనిచేస్తుంది. ప్రజాపోరాటాలు నిర్మిస్తుంది, నిర్వహిస్తుంది. అందువల్ల అది ఒక కనీస ప్రజానుకూల కార్యక్రమం మీద ఏర్పడుతుంది. ఆ కార్యక్రమం పరిపూర్తి చేయడం అనే లక్ష్యంతో పనిచేస్తుంది. అధికారంలో లేనప్పుడు ప్రజలను సమీకరించి పోరాటాలు నిర్వహిస్తుంది. అధికారంలోకి వస్తే ఆ కార్యక్రమ పరిపూర్తికి అధికారాన్ని ఉపయోగిస్తుంది. ప్రస్తుత పరిస్థితుల్లో భారత దేశ స్వతంత్ర విదేశాంగ విధానాన్ని కాపాడ్డం, సరళీకరణ విధానాలకు చెక్‌పెట్టడం, భూ సంస్కరణలు అమలు జరపడం, వ్యవసాయానికీ, ప్రజాసంక్షేమానికీ పెద్దపీట వేయడం ఈ కార్యక్రమంలో ప్రధాన అంశాలుగా ఉంటాయి.

మార్క్సిస్టు పార్టీ చెప్పిన ప్రత్యామ్నాయం కొన్ని రాష్ట్రాల్లో పోరాటాల ద్వారా ఏర్పడింది. పశ్చిమ బెంగాల్, త్రిపురల్లో వామపక్ష సంఘటనలు, కేరళలో వామపక్ష ప్రజాతంత్ర సంఘటన ఇటువంటి ప్రత్యామ్నాయాలే. అయితే వాటి మధ్య తేడాలున్నాయి, వాటికి అనేక పరిమితులూ ఉన్నాయి. కాని ఇవన్నీ కూడా సుదీర్ఘమైన ప్రజాపోరాటాల ద్వారా ఏర్పడిన సంఘటనలే. ఒక కార్యక్రమం ఆధారంగా ఏర్పడినవే. అధికారంలోకి వచ్చిన తరువాత కూడా అవి భారత రాజ్యాంగ పరిమితులకు లోబడి ప్రజానుకూల కార్యక్రమాలను అమలు పరుస్తున్నాయి. అంతిమంగా జనతా ప్రజాతంత్ర విప్లవ సంఘటనలోకి ప్రజలను సమీకరించడానికి ఈ వామపక్ష సంఘటనలూ, వాటి ప్రభుత్వాలూ మంచి వేదికలుగా ఉపయోగపడుతున్నాయి. అందుకే పాలక వర్గాలకు ఆ సంఘటనలన్నా, వాటి ప్రభుత్వాలన్నా కంటగింపు. వాటిని కూలదోయడానికి ఎడతెగని కుట్రలూ, కుయుక్తులూ.

కాని కొన్ని రాష్ట్రాల్లో మాత్రమే ప్రత్యామ్నాయాలుంటే సరిపోదు. అధికారం ఢిల్లీలో కేంద్రీకృతమై ఉంది. అందువల్ల దేశవ్యాపితమైన ప్రత్యామ్నాయం అవసరం. ప్రజా పోరాటాల నుండి అటువంటి ప్రత్యామ్నాయ రాజకీయ వేదిక పుట్టుకు రావాలి. పేరు ఏమి పెట్టినా దానికి ఒక ప్రజానుకూల కార్యక్రమం ఉండాలి. ఎన్నికలతో నిమిత్తం లేకుండా ఆ ప్రత్యామ్నాయం పనిచేయాలి. కేంద్రంలోని ప్రస్తుత రాజకీయాలను చూస్తే మార్క్సిస్టు పార్టీ చెబుతున్న ప్రత్యామ్నాయాన్ని నిర్మించడానికి ఉపయోగపడే శక్తులుగానీ, రాజకీయ పార్టీలుగాని వామపక్షాలు

రించదు.

మన రాష్ట్రంలో చూసుకున్నా పరిస్థితి దీనికి భిన్నంగా ఏమీ లేదు. కాంగ్రెస్, తెలుగు దేశం, తెలంగాణా రాష్ట్ర సమితి, బిజెపిల మౌలిక విధానాలు ఒకటే. వీటిల్లో దేన్నో ఒకదాన్ని కలుపుకుని ప్రత్యామ్నాయం నిర్మిస్తాం అనడంలో అర్థం లేదు. కొత్తగా పుడతాయని ఊహలలో మాత్రమే వుంటున్న పార్టీలు ఎటువంటి విధానాలతో ముందుకు వస్తాయో తెలవకుండానే ప్రత్యామ్నాయానికి సరిపోతాయనుకోవడం హాస్యాస్పదం. కుల ప్రాతి

> **“ మన రాష్ట్రంలో చూసుకున్నా పరిస్థితి దీనికి భిన్నంగా ఏమీ లేదు. కాంగ్రెస్, తెలుగు దేశం, తెలంగాణా రాష్ట్ర సమితి, బిజెపిల మౌలిక విధానాలు ఒకటే. వీటిల్లో దేన్నో ఒకదాన్ని కలుపుకుని ప్రత్యామ్నాయం నిర్మిస్తాం అనడంలో అర్థం లేదు. కొత్తగా పుడతాయని ఊహలలో మాత్రమే వుంటున్న పార్టీలు ఎటువంటి విధానాలతో ముందుకు వస్తాయో తెలవకుండానే ప్రత్యామ్నాయానికి సరిపోతా యనుకోలేం. ”**

మినహా మరేమీ కనిపించడం లేదు. మన రాష్ట్రంలో కూడా అదే పరిస్థితి.

కేంద్రంలో రాజకీయ పార్టీలన్నీ కాంగ్రెస్, బిజెపిల వెనుక సమీకృతమైనాయని ముందుగానే చెప్పుకున్నాం. అయితే గత ఎన్నికల తరువాత ఎన్డీఏ నుండి వైదొలగిన తెలుగు దేశం, మరికొన్ని ఇతర పార్టీలూ కలిసి కాంగ్రెస్, బిజెపి కూటములకు వ్యతిరేకంగా యునైటెడ్ నేషనల్ డెమొక్రటిక్ ప్రోగ్రెస్సివ్ అలయెన్స్ (యుఎన్‌పిఎ) పేరుతో వేదికను ఏర్పాటు చేసుకున్నాయి. తెదే అధ్యక్షుడు చంద్రబాబు నాయుడు, సమాజ్‌వాదీ పార్టీ నేత ములాయం సింగ్ యాదవ్‌తో సహా యుఎన్‌పిఎ నాయకులంతా తమది తృతీయ ప్రత్యామ్నాయం అంటున్నారు. మీడియా కూడా ఇదే మాట ఉపయోగిస్తోంది. వీరి దృష్టిలో తృతీయ ప్రత్యామ్నాయం అంటే బూర్జువా పార్టీల మూడో కూటమి అని. కాని విధాన పరంగా చూసినప్పుడు కాంగ్రెస్, బిజెపిలు ఒకదానికొకటి ప్రత్యామ్నాయం ఎలా కావో యుఎన్‌పిఎ కూడా వాటికి ప్రత్యామ్నాయం కాదు. అందువల్ల రెండో ప్రత్యామ్నాయమే లేనప్పుడు ఇక మూడో ప్రత్యామ్నాయం ఏమిటి? కాని వామపక్షాలను తమ కూటమిలోకి ఆహ్వానించడం కోసమో లేక ప్రజలకు తమది అభివృద్ధికర సంఘటన అని చెప్పడం కోసమో యుఎన్‌పిఎ నేతలు తాము భిన్నమైన విధానాలు అమలుపరుస్తామని చెబుతున్నారు. ఇప్పటివరకు సరళీకరణ విధానాల వల్ల సంపద పెరిగింది, ఇకపై సంపద పంచే కార్యక్రమాలు చేపడతామంటున్నారు. కాని అధికారంలో లేని బూర్జువా పార్టీలన్నీ చెప్పే మాటలే ఇవి. వారి విధానాల్లో మాత్రం మౌలికమైన మార్పులేమీ లేవు. ప్రజానుకూల విధానాలూ లేవు, వాటికోసం పోరాటమూ లేదు. అందువల్ల యుఎన్‌పిఎను తృతీయం మాట అలా ఉంచితే అసలు ప్రత్యామ్నాయంగానే మార్క్సిస్టు పార్టీ అంగీక



ఉవ్వెత్తున సాగే ప్రజా పోరాటాలనుండే నిజమైన ప్రత్యామ్నాయం పుడుతుంది

పదికపై పనిజేస్తామని ప్రకటించి పనిజేసే పార్టీలు ఏరకంగానూ ప్రత్యామ్నాయంలో భాగం కాలేవు. టిడిపి, కాంగ్రెస్ పార్టీల విధానాలతో సారూప్యంగా ఉండే కొత్త పార్టీలు వచ్చినా ప్రత్యామ్నాయం కాజాలవు.

సిపిఐ(ఎం), సిపిఐ ఇతర వామపక్షాలు కలిసి పనిచేసినా వాటి శక్తి పరిమితం. అందువల్ల వామపక్షాలతో కలిసి ప్రత్యామ్నాయ వేదిక నిర్మాణానికి అవసరమైన శక్తులుగాని, పార్టీలుగాని ఆవిర్భవించాల్సి వుంది. ప్రజా పోరాటాలు ఉధృతమయ్యేకొద్దీ అటువంటి శక్తులు ఖచ్చితంగా ఆవిర్భవిస్తాయి. అందుకే సిపిఐ(యం) ఐక్య పోరాటాలు, ఉద్యమాలకు ప్రాధాన్యతనిచ్చి కృషి చేస్తున్నది. ప్రత్యామ్నాయ విధానాల గురించీ, ప్రత్యామ్నాయం అవసరం గురించీ నిరంతరం ప్రచారం చేస్తున్నది. ఎన్నికల నాటికి అటువంటి శక్తులు ఆవిర్భవిస్తే అంతకన్నా కావాల్సింది ఏమీ వుండదు. వామపక్షాలతో కలిసివచ్చే ఆ శక్తులు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల విధానాలకు వ్యతిరేకంగా స్పష్టమైన వైఖరితీసుకోవడమే కాదు, ఆ విధానాలకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాల్లో కూడా కలిసి రావాలి. కలిసి పోరాటాల్లో పాల్గొనడం ద్వారా ప్రజల్లో విశ్వాసం కల్పించగలగాలి. అప్పుడది నిజమైన ప్రత్యామ్నాయం అవుతుంది. ఎన్నికల్లో ప్రత్యామ్నాయ కార్యక్రమంతో ప్రజలముందుకు వెళ్లగలుగుతుంది. మార్క్సిస్టు పార్టీ కోరుకుంటున్న ప్రత్యామ్నాయం అదీ.

మరి ఎన్నికల్లోపు అటువంటి ప్రత్యామ్నాయం ఆవిర్భవించకపోతే? స్పష్టమైన ప్రత్యామ్నాయ విధానాలు కలిగిన శక్తులు ముందుకు రాకపోతే? అప్పటికి ఉన్న పార్టీల్లో దేనితోనో ఒకదానితో ఎన్నికల పొత్తుల సమస్య ముందుకు వస్తుంది. మార్క్సిస్టు పార్టీ దృష్టిలో ఎన్నికల పొత్తులు వేరు ప్రత్యామ్నాయం వేరు. ఎన్నికల పొత్తులు కేవలం ఎన్నికలకు మాత్రమే పరిమితం. ఆనాటి పరిస్థితులను బట్టి ఎన్నికల్లో ఇతర పార్టీలతో పొత్తులు పెట్టుకోవచ్చు లేదా ఒంటరిగానూ పోటీచేయవచ్చు. అయితే కమ్యూనిస్టులు ఏ పార్టీతోనూ పొత్తు పెట్టుకోకుండా ఒంటరిగా పోటీచేయాలని కోరుకునే వారూ ఉన్నారు. కాని పార్టీకి ఒంటరిగా పోటీ చేయడం అనేది చివరి ఆప్షన్ మాత్రమే. పార్టీ స్వతంత్రంగా ఉండాలి కాని ఒంటరిగా కాదు. స్వతంత్రతను కాపాడుకోవాలి అదే సమయంలో ఒంటరిపాటు కాకూడదు. ఎన్నికల్లోనైనా పోరాటాల్లోనైనా. బూర్జువా పార్టీల్లో చీలికలను ఉపయోగించుకుని పార్టీ బలపడ్డానికి ఎన్నికల ఎత్తుగడలు అవసరం. ప్రస్తుత మన పార్లమెంటరీ ఎన్నికల విధానంలో మన ఓట్లబలాన్ని సీట్లుగా మార్చుకోవాలంటే ఇతర పార్టీలతో ఎన్నికల పొత్తులూ, అవగాహనలూ కుదుర్చుకోవడం అనివార్యమవుతోంది. ఈ కారణాల రీత్యా పార్టీ ఎన్నికల్లో పొత్తులు, అవగాహనలు కుదుర్చు కుంటుంది. ఇవి ఎలా ఉంటాయి అన్నది నిర్దిష్ట రాజకీయ పరిస్థితులను బట్టి ఉంటుంది.

> **"ఒకవైపు యుపిఎ ప్రభుత్వానికి మద్దతిస్తూనే ప్రజా సమస్యల విషయంలోనూ, ఆ ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాల విషయం లోనూ వామపక్షాలు స్వతంత్ర వైఖరి తీసుకు న్నాయి. ప్రజా వ్యతిరేక సమస్యలపై రాజీలేని పోరాటం చేస్తున్నాయి."**

గతంలో కూడా జాతీయ స్థాయిలోనూ, మన రాష్ట్రంలోనూ వివిధ ఎన్నికల్లో ఆనాటి రాజకీయ పరిస్థితులను బట్టి పార్టీ వివిధ బూర్జువా పార్టీలతో ఎన్నికల అవగాహనలూ, పొత్తులూ కుదుర్చుకున్నది. అది ఎన్నికలవరకే పరిమితం. ఎన్నికల తరువాత ఏర్పడిన పరిస్థితులనుబట్టి ప్రభుత్వాలకు మద్దతిచ్చే విషయంపై నిర్ణయం తీసుకుంటూ వచ్చింది. గత ఎన్నికల్లో కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ బిజెపి, దానితో జతకట్టిన పార్టీల ఓటమి ప్రధాన లక్ష్యంగా పార్టీ ఎన్నికల అవగాహన కుదుర్చు కుంది. కేంద్రంలో ఎన్నికల అనంతరం ఏర్పడిన పరిస్థితుల్లో కనీస ఉమ్మడి కార్యక్రమం ఆధారంగా యుపిఎ ప్రభుత్వానికి బయటినుండి మద్దతివ్వాలని నిర్ణయించింది. వామపక్షాలు ఉమ్మడిగా ఈ నిర్ణయం తీసుకున్నాయి. ఒకవైపు యుపిఎ ప్రభుత్వానికి మద్దతిస్తూనే ప్రజా సమస్యల విషయంలోనూ, ఆ ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాల విషయంలోనూ వామపక్షాలు స్వతంత్ర వైఖరి తీసుకున్నాయి. ప్రజా వ్యతిరేక సమస్యలపై రాజీలేని పోరాటం చేస్తున్నాయి. రాష్ట్రంలో భిన్నమైన పరిస్థితులున్నాయి కాబట్టి ఇక్కడ మార్క్సిస్టు పార్టీ స్వతంత్రంగా ఉంటూ ప్రజాసమస్యలపై పోరాటాలు నిర్వహిస్తోంది. ఈ క్రమంలోనే ప్రజా సమస్యలపై వామపక్షాలను కలుపుకు పోవడానికి ప్రయత్నిస్తోంది. తృతీయ ప్రత్యామ్నాయానికి కలిసి వచ్చే శక్తులకోసం అన్వేషిస్తోంది.

రానున్న ఎన్నికల్లో కూడా రాష్ట్రంలోనూ, కేంద్రంలోనూ అప్పటి పరిస్థితులను బట్టి ఎన్నికల పొత్తులు, అవగాహనల విషయంలో పార్టీ నిర్ణయం తీసుకుంటుంది. కాని ఈలోగా పొత్తు లపై మీడియాలోనూ, ఇతరత్రా అనేక ఊహాగానాలు సాగుతున్నాయి. రానున్న ఎన్నికల్లో మార్క్సిస్టు పార్టీ ఎవరితో పొత్తు పెట్టుకుం టుంది? కాంగ్రెస్‌తో తెగతెంపులు చేసు కుంటుందా? తెలుగుదేశంతో పొత్తు పెట్టు కుంటుందా? చిరంజీవి పార్టీ పెడితే దానితో సిపిఎం పొత్తు పెట్టుకుంటుందా? అన్న చర్చ సాగుతోంది. కుల ప్రాతిపదికపై పార్టీలు పెట్టే ప్రయత్నాలూ ముమ్మరమైనాయి. ఎన్నికలు దగ్గర పడుతున్న కొద్దీ మరిన్ని పార్టీలు పుట్టుకువచ్చే అవకాశముంది. ఇటువంటి చర్చ మరింత పెరిగే అవకాశమూ ఉంది. ఈ పరిణామాలన్నిటినీ మార్క్సిస్టు పార్టీ గమనిస్తుంది. తన పోరాటాలను కొనసాగిస్తుంది. పోరాటాల ద్వారా విధానపరమైన ప్రత్యామ్నాయం ఆవిర్భవిస్తే సంతోషిస్తుంది. ప్రత్యామ్నాయంతో ఎన్నికల్లో పోటీచేస్తుంది. ప్రత్యామ్నాయం ఆవిర్భవించకపోతే ఆనాటి పరిస్థితిబట్టి పొత్తులు పెట్టుకోవడమా, లేదా నిర్ణయిస్తుంది. పొత్తులు అవగాహనలు అవసరమనుకుంటే ఎవరితో పెట్టుకోవాలన్న విషయంపై అప్పటి పరిస్థితిని బట్టి నిర్ణయిస్తుంది. మరోవైపు ఎన్నికల జయాపజయాలతో నిమిత్తం లేకుండా తన పోరాటాలూ, తద్వారా ప్రత్యామ్నాయం కోసం కృషీ కొనసాగిస్తూనే ఉంటుంది. ఇదీ పార్టీ యొక్క స్పష్టమైన అవగాహన. మిగతావన్నీ ఊహాగానాలు.



# కుల సమస్య-వర్గ పోరాటం

ఎం.వి.ఎస్. శర్మ

**కులచైతన్యం ఏనాటికీ కుల వివక్షతను అంతం చెయ్యలేదు సరికదా, దానికి మరింత బలం చేకూరుస్తుంది. కుల వివక్ష వ్యతిరేక పోరాటం అంటే దళితులు, వివక్షతకు గురైన కులాల వారు మాత్రమే చేసే పోరాటం ఎంత మాత్రమూ కాదు. వర్గ ఐక్యతతో అన్నికులాలకు చెందిన శ్రమజీవులంతా కులపీడనకు వ్యతిరేకంగా చేసే పోరాటమది.**

"మీ కమ్యూనిస్టులకు ఎంతసేపూ వర్గం, వర్గదోపిడీ, వర్గపోరాటం అన్న గొడవే తప్ప కులం, కుల వివక్షత, అగ్రవర్ణ దురహంకారం వంటివి పట్టవు" అని కమ్యూనిస్టులపై కొందరు విమర్శ చేసేవారు. ఇలా విమర్శిస్తూ కొందరు "మేధావులు" వ్యాసాలు, పుస్తకాలు పుంఖానుపుంఖాలుగా గుప్పించారు. కులవివక్షకు వ్యతిరేకంగా సి.పి.ఐ.(ఎం) గత దశాబ్ద కాలంగా ప్రత్యేక కృషి చేస్తున్నది. అయిష్టంగా నైనా ఇతరులు ఈ కృషిని గుర్తించక తప్పడంలేదు. దాంతో "ఇన్నాళ్లకైనా మీ కమ్యూనిస్టుల్లో మార్పు వచ్చిందయ్యా, సంతోషం. ఇక ఆ 'వర్గపోరాటం' వదిలి పెట్టి 'కుల పోరాటం' సంగతి తేల్చండి" అని అనేవాళ్లూ ఉన్నారు. ఇలా వర్గ పోరాటానికీ- కుల వివక్ష, పీడనలకు వ్యతిరేకంగా జరిగే పోరాటానికీ పోటీ పెట్టి చూస్తూ కమ్యూనిస్టులు అలా పోటీ పెట్టి చూడనందుకు నిందిస్తూంటారు.

సి.పి.ఐ.(ఎం) కుల సమస్య పట్ల మొదటి నుండీ స్పష్టమైన వైఖరితో ఉంది. పార్టీ యావత్తూ శిరోధార్యంగా అనుసరించాల్సిన పార్టీ కార్యక్రమంలో పార్టీ వైఖరి తేటతెల్లంగా తెలియజేయపడింది.

"5.10 కులపరమైన అణచివేతను అంతమొందించడంలో కూడా బూర్జువా భూస్వామ్య వ్యవస్థ విఫలమైంది. షెడ్యూల్డు కులాలకు చెందిన వారు అందరికన్నా దారుణంగా కష్టాలనెదుర్కొంటున్నారు. అస్పృశ్యత, తదితర వివక్షతా రూపాలు చట్ట వ్యతిరేకమని ప్రకటించబడినా దళితులు అణచివేతకు గురిచేయబడుతున్నారు. విముక్తి కోసం దళితుల్లో పెరుగుతున్న చైతన్యాన్ని క్రూరమైన అణచివేత, అత్యాచారాలతో వెనక్కి కొట్టడానికి ప్రయత్నిస్తున్నారు. దళితులు నిలదొక్కు కోవడంలో ప్రజాతంత్ర సారాంశం వుంది. సమాజంలో అత్యంత ఎక్కువగా అణచివేయబడిన వారి ఆకాంక్షలను అది ప్రతిబింబిస్తోంది. కులాలతో నిండిన సమాజంలో వెనుకబడిన కులాలు కూడా తమ హక్కులు వక్కాణిస్తున్నాయి."

"5.11 అదే సమయంలో ఓటు బ్యాంకులను పదిలం చేసుకొనే సంకుచిత లక్ష్యంతో కేవలం కులపరమైన పిలుపులతో కుల విభజనలను కొనసాగించేందుకు, దళిత వర్గాలను ఉమ్మడి ప్రజాతంత్ర ఉద్యమాల నుండి విడగొట్టేందుకు ప్రయత్నించే శక్తులు కూడా పనిచేస్తున్నాయి. అనేక మంది కులనాయకులు, కొన్ని బూర్జువా రాజకీయ పార్టీల నాయకులు కుల ప్రాతిపదికన సమీకరణను సంకుచిత ఎన్నికల లబ్ధి కోసం ఉపయోగించుకుంటున్నారు. అన్ని కులాలల్లోని పీడిత ప్రజలతో ఉమ్మడి ఉద్యమాలు నిర్వహించడం పట్ల వ్యతిరేకంగా ఉన్నారు. పాత సామాజిక వ్యవస్థను కూలదోసేందుకు ప్రాతిపదికగా వుండాల్సిన భూమి, వేతనాలు వంటి మౌలిక సమస్యలనూ, భూస్వామ్య వ్యతిరేక పోరాటాలనూ వారు విస్మరిస్తున్నారు."

"5.12 కుల అణచివేత, వివక్షతా సమస్యలకు సుదీర్ఘ చరిత్ర వుంది. పెట్టుబడిదారీ పూర్వ సామాజిక వ్యవస్థలో అది బలంగా వేళ్ళూనుకుని వుంది. పెట్టుబడిదారీ అభివృద్ధి మార్గంలో ఉన్న సమాజం కులవ్యవస్థతో రాజీ పడింది. భారత బూర్జువా వర్గమే కుల దురభిప్రాయాలను పెంచి పోషిస్తోంది. కుల వ్యవస్థకూ, దళితుల అణచివేతకూ వ్యతిరేకంగా ఐక్యత సాధించినప్పుడే కార్మికవర్గ ఐక్యత ఏర్పడుతుంది. ఎందుకంటే దళిత జనాభాలో అత్యధికులు శ్రామిక వర్గాలకు చెందినవారే. కులవ్యవస్థ నిర్మూలనకై పోరాటం ప్రజాతంత్ర విప్లవంలో ముఖ్యమైన భాగం. కుల అణచివేతకు వ్యతిరేకంగా జరిగే పోరాటం వర్గ దోపిడీకి వ్యతిరేకంగా జరిగే పోరాటంతో ముడిపడి ఉంది."

"8.3 మత ఛాందసం, మూఢత్వం, మతతత్వం, కులతత్వం ప్రజలలో చీలికలు పెట్టి వారి ప్రజాతంత్ర చైతన్యాన్ని మొద్దుబారుస్తాయి. అభివృద్ధి నిరోధక శక్తులు బూర్జువా జాతీయ వాదం, దురభిమానాలతో పాటుగా వినియోగించుకుంటాయి. ప్రజాతంత్ర ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేసేందుకు సామ్రాజ్యవాదం ఈ శక్తులను ప్రోత్సహిస్తుంది. ఈ విచ్ఛిన్నకర భావాలకు, శక్తులకు వ్యతిరేకంగా కమ్యూనిస్టులు దృఢసంకల్పంతో పోరాడతారు."

పార్టీ కార్యక్రమంలోని పై అవగాహన మార్గదర్శకంగా పెట్టుకుని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో సి.పి.ఐ.(ఎం) వ్యవహరించింది. జనతా ప్రజాస్వామిక విప్లవంలో కీలకమైనది భూమి సమస్య. ఇంకోపక్క అణగారిన కులాలలో అత్యధికులు భూమిలేని పేదలు. కులపరమైన అణచివేతకు, విక్షతకు వ్యతిరేకంగా వారిని కదిలించి, ఇతర పేదలతో ఐక్యపరచి కమ్యూనిస్టులు భూపోరాటం నిర్వహించారు. అధికారంలో ఉన్నా, ప్రతిపక్షంలో ఉన్నా, బూర్జువా పార్టీలు ఈ పోరాటం పట్ల ఒకే విధమైన ప్రతికూ



రచయిత భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) రాష్ట్ర కమిటీ సభ్యులు. ఎంఎల్‌సి

లతతో వ్యవహరించాయి. ఇదే సమయంలో అణగారిన కులాలకు ప్రతినిధులమని చెప్పుకునే కుల సంఘాల నేతలు సైతం భూపోరాటం పట్ల మౌనమే వైఖరిగా వ్యవహరించారు. ఇవతలవైపు భూపోరాటం పట్ల మాత్రమే కాదు, అవతలవైపు పెత్తందారులు అడ్డగోలుగా సాగి స్తున్న భూకబ్జాల పట్ల, భూకుంభకోణాల పట్ల సైతం కుల సంఘాలు మౌనాన్నే పాటించాయి.

భూపోరాటం అటు పాలక పార్టీ లనూ, ఇటు కుల సంఘాలనూ ఇరకాటంలో పెట్టింది. కాంగ్రెస్ పార్టీ ఈ పోరాటం తాకిడిని తట్టుకునేందుకు ఇందిరమ్మ ఇళ్ళ సంఖ్యను 13 లక్షల నుంచి 83 లక్షలకు పెంచి ప్రకటించాల్సి వచ్చింది. పెన్షన్లు, భూమి పట్టాలు-ఒకటేమిటి వరాల వర్షం కురిపిస్తున్నది. ఇంకోవైపు కులసంఘాల నేతలు భూపోరాటంలో బలైపో తున్నది అణగారిన కులాలేనంటూ వ్యాఖ్యా నాలు ప్రారంభించారు. అణగారిన కులాలలో అత్యధికులు భూమిలేని, ఇల్లు లేని పేదలైనపుడు, భూపోరాటంలో అత్యధికంగా పాల్గొన్నది వారే అయినపుడు, ఆ పోరాటం మీద జరిగిన నిర్బంధాన్ని, దానికి పాల్పడిన ప్రభుత్వాన్ని ఖండించి నిరసించాల్సింది పోయి చనిపోయిన వారి కులాల్ని వెతుక్కోవడం కులతత్వ వాదుల నైజాన్ని వెల్లడి చేస్తుంది.

ఎన్నికలెప్పుడైనా రావచ్చుననే వాతావరణం వచ్చింది. రాబోయే ఎన్నికల్లో ప్రజాపోరాటాలతో బలం పెంచుకుని అణ గారిన తరగతుల ప్రజల ఆదరాభిమానాలను పొందుతున్న కమ్యూనిస్టులు కీలక పాత్ర పోషిస్తారన్నది అందరికీ అవగం అయింది. అందుకే కమ్యూనిస్టుల వర్గ పోరాటాలను, అణగారిన తరగతులలో పెరుగుతున్న వర్గ ఐక్యతను దెబ్బతీయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. "అన్ని పార్టీలూ మనను మోసం చేసాయి, వాడుకున్నాయి, అందుకే మన పార్టీ మనమే పెట్టుకుందాం. రాజ్యాధికారం మనకే దక్కాలి" అంటూ కొత్త పార్టీలు పుట్టు కొస్తున్నాయి. "అన్ని కులాలూ బలపడాలి, అన్ని కులాలకూ ప్రాతినిధ్యం దక్కాలి" అంటూ ఇంకోపక్క సర్వజన సమ్మేళనాలూ సాగుతు న్నాయి. యు.పి.లో మాదిరి ఫార్ములాలతో కొన్ని కులాల కాంబినేషన్‌తో రాజ్యాధికారం దక్కించుకోవాలని ప్రతిపాదిస్తున్నారు. చిరంజీవి రాజకీయప్రవేశం గురించి ఊహాగానాలు వార్తల రూపం ధరించి పత్రికల్లో రావడం మొదలు చిరంజీవి మా వాడేనంటూ కొందరు హడావుడి ప్రారంభించేశారు. ఒక కులాన్ని

> **❝ కమ్యూనిస్టులు వివిధ రంగాల్లో పోరాట కార్యక్రమాలు చేస్తున్నారు. ఈ సమస్యలలో అత్యధికంగా బాధితులు అణగారిన కులాల వారే. ఈ పోరాటాలు ముందుకు సాగుతున్నకొద్దీ వారిలో వర్గచైతన్యం, వర్గ ఐక్యత బలపడుతున్నది. ఇది పాలకవర్గాలకు రుచించని పరిణామం. అందుకే ఈ వర్గ ఐక్యతను విచ్ఛిన్నం చెయ్యడానికి కులతత్వాన్ని ముందుకు తెస్తున్నారు. ప్రచార సాధనాలను ఇందుకు వాడుకొంటున్నారు.❞**

బి.సి.ల్లో చేర్చాలా వద్దా తేల్చేందుకు రాష్ట్ర ప్రభుత్వం కమిషన్‌ను ఏర్పాటుచేస్తానని ప్రకటిం చింది. వెనువెంటనే దానిని వ్యతిరేకిస్తూ మరికొన్ని కులాల వారు ఆ నిర్ణయంపై యుద్ధాన్ని ప్రకటించారు. మొత్తానికి అందరూ అణగారిన కులాల గురించి మాట్లాడేవారే.

ఒక్క భూపోరాటమేగాక, గిరిజన హక్కులు, ప్రాజెక్టు నిర్వాసితులు, ప్రైవేటు రంగంలో రిజర్వేషన్లు, అసంఘటిత రంగ కార్మికులు, ఇంటి పనివారు, బీడీ కార్మికులు తదితరులు, మైనార్టీ సంక్షేమం, సంక్షేమ హాస్టళ్లు-ఇలా వివిధ రంగాల్లో పోరాట కార్యక్రమాలు కమ్యూనిస్టులు చేస్తున్నారు. ఈ సమస్యలలో అత్యధికంగా బాధితులు అణగారిన కులాల వారే. ఈ పోరాటాలు ముందుకు సాగుతున్నకొద్దీ వారిలో వర్గచైతన్యం, వర్గ ఐక్యత బలపడుతున్నది. ఇది పాలకవర్గాలకు రుచించని పరిణామం. అందుకే ఈ వర్గ ఐక్యతను విచ్ఛిన్నం చెయ్యడానికి కులతత్వాన్ని ముందుకు తెస్తున్నారు ప్రచారసాధనాలను ఇందుకు వాడుకొంటున్నారు.

'అణగారిన కులాలకు రాజ్యా ధికారం' అన్న నినాదంలో తప్పేమీలేదని, ఈ తరగతుల కోసమే పోరాడుతున్న కమ్యూనిస్టులు కూడా ఈ నినాదాన్ని స్వీకరించితే ఇబ్బం దేమిటని అడుగుతున్న వారున్నారు. రాజ్యా ధికారం అంటే అర్థం పదవులు దక్కించు కోడానికే పరిమితమా? లేక రాజ్యంలోని వనరులపైనా, సంపదపైనా అణగారిన తరగ తుల ప్రజలందరికీ అధికారం రావడమా? అన్నది ప్రశ్న. పదవులు దక్కించుకోవాలని కులనాయకులు చూస్తున్నారు. అణగారిన తరగతులకు వనరులు దక్కేందుకు కమ్యూ నిస్టులు పోరాడుతున్నారు. ఆ కుల సంఘాల ఎజెండాకు, కమ్యూనిస్టు ఎజెండాకు పోలికే లేదు. దళితులకే, బహుజనులకే రాజ్యాధికారం అని, బ్రాహ్మణవాదమే శత్రువు అని, తాము తప్ప అన్ని పార్టీలూ మనువాద పార్టీలే అని బయలుదేరిన బి.ఎస్పీ ఇప్పుడెక్కడికి చేరింది? ఆ మనువాదులకే, బ్రాహ్మణులకే తన ప్రభు త్వంలో పెద్దపీట వేసింది. కులవ్యవస్థకు పెనుసవాలుగా తయారైన బుద్ధుడిని సైతం విష్ణువు దశావతారాల్లో ఒకటిగా ప్రకటించేసి తిరిగి పెత్తనం చేజిక్కించుకుని బుద్ధుడు పుట్టిన దేశంలో బౌద్ధమతాన్నే నామావశిష్టం చేసిన కౌటిల్యం మనువాదానిది. చివరికి మాయావతి సైతం అక్కడికే చేరారు.

ఇది ఆశ్చర్యపడవలసిన పరిణా మం ఏమాత్రమూ కాదు. ఎందుకంటే కుల చైతన్యం ఏనాటికీ కుల వివక్షతను అంతం చెయ్యలేదు. సరికదా, దానికి మరింత బలం చేకూరుస్తుంది. కుల వివక్ష వ్యతిరేక పోరాటం అంటే దళితులు, వివక్షతకు గురైన కులాల వారు మాత్రమే చేసే పోరాటం ఎంత మాత్ర మూ కాదు. వర్గ ఐక్యతతో అన్నికులాలకు చెందిన శ్రమజీవులంతా కులపీడనకు వ్యతి రేకంగా చేసే పోరాటమది. అటువంటి పోరాటంలోని వర్గచైతన్యాన్ని తిరస్కరించి, అదే సమయంలో తామూ కుల పీడనకు వ్యతిరేకం గా పోరాటం చెయ్యడానికి బయలుదేరామన్న వారంతా ఇప్పుడెక్కడున్నారు? ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ విధానాల దుష్ఫలితాలను చాలా మందికన్నా ఎక్కువగా భరిస్తున్న దళితులు అంతా ఏకమై పోరాడాల్సిన తరుణంలో, ఆ దళితులనే చీల్చి వారిలో వారు పోరాడుకునే స్థితికి తెచ్చారు. ప్రభుత్వం ఎస్సీ, ఎస్టీ కాంపొ నెంట్‌ను ఖర్చు చేయడం లేదన్న సంగతే వారు మరిచిపోయారు. సంక్షేమ హాస్టళ్లు ఎలా దిగజారాయో వారు గుర్తించలేకపోతున్నారు. ప్రైవేటు రంగంలో రిజర్వేషన్లు ఎందుకు అమలు జరగడం లేదని నిలదీసేబదులు

**"అణచివేత గురించి, వివక్షత గురించి ఎంత మాట్లాడినా వర్గ పోరాటాలను వ్యతిరేకించే/ఉపేక్షించే కులసంఘాలు అంతిమ విశ్లేష ణలో పేదలను చీల్చడానికే తోడ్పడుతున్నాయి. కులాలవారీ సమీకరణలను ఆయా సంఘాల నాయకుల ప్రయోజనాలకే వాడుకుంటున్నాయి. బూర్జువా వర్గం ఐక్యతకు కులం అడ్డురాదు. పేదల ఐక్యతకు మాత్రం కులం అడ్డు వస్తోంది."**

దళితులలో కొందరైనా ప్రైవేటు పరిశ్రమల యజమానులుగా ఎదగాలని వాదిస్తున్న వారూ ఉన్నారు.

అణచివేత గురించి, వివక్షత గురించి ఎంత మాట్లాడినా వర్గపోరాటాలను వ్యతిరేకించే/ఉపేక్షించే కులసంఘాలు అంతిమ విశ్లేషణలో పేదలను చీల్చడానికే తోడ్పడుతున్నాయి. కులాలవారీ సమీకరణలను ఆయా సంఘాల నాయకుల ప్రయోజనాలకే వాడుకుంటున్నాయి. బూర్జువా వర్గం ఐక్యతకు కులం అడ్డురాదు. పేదల ఐక్యతకు మాత్రం కులం అడ్డు వస్తోంది.

ఈ కులాల సంఘాలు, వారి సమీకరణలు కమ్యూనిస్టుల పోరాటాలు కల్పిస్తున్న వర్గ చైతన్యాన్ని, వర్గ ఐక్యతను దెబ్బతీయడం ద్వారా దళితులను, బిసిలను అణచివేస్తున్న బూర్జువా భూస్వామ్య వర్గాల పార్టీలకు ఎనలేని సేవలు చేస్తున్నాయి. ఒక దెబ్బకు రెండు పిట్టలన్నట్లు ఇటు వర్గ ఉద్యమాలను దెబ్బతీయడం, అటు పాలక పార్టీల ద్రోహాన్ని కప్పి పుచ్చడం జరిగిపోతున్నది. బూర్జువా పార్టీలు ఈ కుల తత్వవాదనల్ని సంతోషంగా ప్రోత్సహిస్తున్నాయి. భూమి పంచాలనో, ఉపాధి కల్పించాలనో, ధరలు తగ్గించాలనో ఉద్యమాలు జరిగితే కష్టంగాని, మా కులానికి ప్రాతినిధ్యం కావాలనో, మాకూ రిజర్వేషన్ వర్తించాలనే ఉద్యమాలు వస్తే పాలకులకు ఇబ్బందేముంది? ఇటువంటి ఉద్యమాలెన్నొచ్చినా ప్రపంచీకరణ క్రమాన్నీ, కొల్లగొట్టే దోపిడీ వర్గాన్నీ, భూకుంభ కోణాలనూ అడ్డుకోవు గదా?

ప్రజాఉద్యమాలు, ప్రజాపోరాటాలు సహజసిద్ధంగా ప్రజాతంత్ర స్వభావం కలిగి ఉంటాయి. కులతత్వం ప్రజాతంత్ర స్వభావాన్ని దెబ్బతీస్తుంది. కులకట్టుబాట్లు ఆచారవ్యవహారాలు ఎక్కువ పాత్రపోషిస్తాయి. కుల పెద్దల పెత్తనం ఎవరూ ప్రశ్నించ వీలులేనిదిగా ఉంటుంది. ఆ విధంగా కూడా కుల తత్వం వర్గ చైతన్యానికి పూర్తి విరుద్ధం.

ఆచరణలో కుల అణచివేతకు వ్యతిరేకంగా పోరాటాలు నిర్మించడం ద్వారా నిబద్ధతను రుజువుచేసుకుంటున్న సి.పి.ఐ.(ఎం) వైపు అణగారిన కులాలకు చెందిన ప్రజలు ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు. సి.పి.ఐ.(ఎం) కార్యకర్తలుగా, నాయకులుగా ఎదిగి వస్తున్నారు. అణగారిన కులాల ప్రజల పట్ల సానుభూతి ఉన్నవారెవరైనా ఈ క్రమాన్ని ఆహ్వానించాలి. కాని సి.పి.ఐ.(ఎం) నాయకులలో ఎవరిదే కులమో ఆరాలు తీసి కొందరు చెత్త రాతలు రాస్తున్నారు. పైగా కాంగ్రెస్, బిజెపి వంటి పార్టీలే అణగారిన కులాల వారికి ఎక్కువ న్యాయం చేశాయని సర్టిఫికెట్లిచ్చేస్తున్నారు. వీరి దృష్టిలో ఇడుపులపాయలో దళితుల భూముల్ని వందల ఎకరాల మేరకు అక్రమంగా అనుభవించిన రాజశేఖరరెడ్డి దళిత పక్షపాతి అయిపోయాడు. కుల వివక్ష వ్యతిరేక పోరాటంలో మునిగితేలిన రాఘవులు ఆగ్రకుల ప్రతినిధి అయిపోయాడు. దళితులకిచ్చిన అసైన్డు భూములన్నీ ఊడలాక్కుంటున్న వై.ఎస్.ను దళిత పక్షపాతి అని, ఆ భూములపై దళితుల హక్కులను కాపాడేందుకు పోరాడుతున్న సి.పి.ఐ.(ఎం) నాయకులను ఆగ్రకులాల నేతలని వ్యాఖ్యానించినవారెవరి ఏజంట్లో తేలికగానే అర్థమవుతుంది.

ఐతే, ఇక్కడొక విషయం కూడా చెప్పాలి. దళితులకోసం, అణగారిన తరగతుల ప్రజలకోసం సి.పి.ఐ.(ఎం) పోరాడు తున్నపుడు, ఆ పార్టీలోకి ఈ తరగతులవారు చేరుతున్నపుడు పార్టీ నాయకత్వ స్థానాల్లోకి ఈ తరగతులవారు రావాలనడం తప్పా? ఎంతమాత్రమూ కాదు. నిజానికి కమ్యూనిస్టు పార్టీకి మన రాష్ట్రంలో తొలి దశలో మాలమాదిగల పార్టీ అన్న పేరే ఉండేది. సుందరయ్య, బసవపున్నయ్య, రాజేశ్వర రావు, వంటి మహా నేతల సారధ్యంలో తీవ్ర స్థాయిలో నడిచిన వర్గపోరాటాలు అణగారిన తరగతుల ప్రజలలో కమ్యూనిస్టు పార్టీకి పెద్ద చోటు కల్పించగలిగాయి. పాలక వర్గాలకు పెను ముప్పుగా కమ్యూనిస్టు ప్రమాదం కనపడిన 1952, 1955 ఎన్నికలలో కమ్యూనిస్టులపై కనీవినీ ఎరుగని విషప్రచారం జరిగింది. ఆనాటి ప్రధాని నెహ్రూతో సహా కాంగ్రెస్ నేతలు, ఇతర బూర్జువానేతలు కమ్యూనిస్టులపై విషం గక్కారు. 'కామ్రేడ్' అంటే కమ్మ, రెడ్డి అన్న వికృత వ్యాఖ్యానం ఆనాటిదే. కమ్యూనిస్టులు గెలిస్తే మనకు భూముల్ని మిగల్చరని ఒక పక్క మధ్యతరగతి, ధనిక రైతుల్లో ప్రచారం చేస్తూనే ఇంకోపక్క దళితులలో కమ్యూనిస్టులంటే అగ్రకుల నేతలని వ్యతిరేకత కల్పించప్రయత్నించారు నాడు.

కమ్యూనిస్టు ఉద్యమం రాష్ట్రంలో తిరిగి పుంజుకుని, వామపక్ష ఐక్యతను పెంపొందించుకుంటూ విద్యుత్ పోరాటం, కులవివక్ష వ్యతిరేక పోరాటం, భూపోరాటం వంటి విస్తృత ప్రజాపోరాటాలు నడిపే శక్తిగా ఎదుగుతున్నది. అణగారిన కులాలను ఆకర్షించగలుగుతున్నది. ఈ క్రమంలో ఈ తరగతులవారు నాయకత్వ కమిటీలలో సైతం మరింతగా ప్రాతినిధ్యం పొందుతారు. ఐతే ఆ స్థానాల్లోకి ఎన్నికవడానికి ప్రాతిపదిక వారి కులంబట్టి ఉండదు. నాయకత్వ పదవులు కులాలకి ప్రాతినిధ్యంగా కాక, ఉద్యమాలకి ప్రాతినిధ్యం వహించేవిగా ఉంటాయి. పైనుంచి నాయకత్వ పదవులకు నామినేట్ చేసే సీల్డ్‌కవర్ సంస్కృతి, కులాలవారీ పదవుల పందేరం చేసే సంస్కృతి బూర్జువా పార్టీలకే చెల్లింది. ఆ పార్టీలో అణగారిన కులాల పేరు చెప్పుకొని పదవులు పొందేవారంతా పాలకవర్గ ఏజంట్లుగానే వ్యవహరిస్తున్నారు తప్ప, అణచివేతపై నోరు మెదపలేకపోతున్నారు. సి.పి.ఐ.(ఎం)లో నాయకత్వ పదవులన్నీ ఎన్నికల ద్వారా నిర్ణయించబడతాయి. ఇది అంతరంగిక ప్రజాస్వామ్యం. కమ్యూనిస్టు పార్టీల మహాసభలు జరుగుతున్న నేపథ్యంలో నాయకత్వ కమిటీలకు సంబంధించి కులాల వారీ ప్రాతినిధ్యం ఎంతెంత అన్న వివాదాన్ని బూర్జువా కిరాయి రాతగాళ్లు లేవదీయడం యాధృచ్ఛికమేమీ కాదు. మరింత పదునైన వర్గపోరాటాల నిర్మాణమే ప్రధాన లక్ష్యంగా జరుగుతున్న మహాసభలను తమ చెత్తరాతలతో ప్రభావితం చేయగలమని వారనుకుంటే అంతకన్నా భ్రమ వేరొకటిలేదు. విశాల ఐక్యతను ఇనుమడింపజేసే వర్గ చైతన్య దీప్తి వెల్లి విరియడం ఖాయం.



# దిద్దుబాటు ఉద్యమం నిరంతర ప్రక్రియ

నిప్పును జేబులో పెట్టుకొని తిరగలేం. అలాగే తప్పుల్ని కనపడకుండా దాచుకుంటామనుకోవడం కూడా భ్రమే. పిల్లి కళ్లుమూసుకుని పాలు తాగుతూ తననెవ్వరూ చూడలేదనుకుందన్నట్లుగానే ఉంటుందిదీను. ఇతరులను విమర్శించడం తేలిక. మనం ఇతరుల తప్పుల్ని విమర్శించాలంటే అందుకు అవసరమైన అర్హత కూడా సాధించాలి. తప్పులకు గురికాకుండా చూసుకోవడం, పొరపాట్లు చేస్తే ఆత్మవిమర్శ చేసుకొని సరిదిద్దుకోవడం ద్వారా ఇతరులకు ఆదర్శంగా ఉంటాం. ఇది కూడా ఒక రకమైన విమర్శనా పద్ధతే. విమర్శలు చేయడానికన్నా ఆత్మవిమర్శ చేసుకోడానికి ఎక్కువ ధైర్యం కావాలి. చేసిన తప్పులు దిద్దుకుంటూ ఉండటమేనా మన పని అని అడిగే వాళ్లూ ఉన్నారు. కమ్యూనిస్టులు ఏం చేస్తున్నారంటే చేసిన తప్పులు దిద్దుకుంటున్నారని వ్యంగంగా విమర్శించే వ్యాఖ్యాతలను చూసి భయపడాల్సిన అవసరం లేదు. మనం తప్పులు దిద్దుకుంటే అభివృద్ధి అవుతామని వారి భయం.

**వి. శ్రీనివాస రావు**

ప్రపంచంలో అత్యంత ఉన్నతమైన ఆధునిక సిద్ధాంతం మార్క్సిజం–లెనినిజం. ఆ సిద్ధాంత ప్రాతిపదికపై ఏర్పడిన పార్టీ కమ్యూనిస్టుపార్టీ. వర్గపోరాటం ద్వారా రాజ్యాధికారం సాధించడం దాని లక్ష్యం. ఒక వర్గాన్ని వేరొక వర్గం, ఒక జాతిని మరోజాతి, ఒక మనిషిని మరోమనిషి దోపిడి చేయడాన్ని వ్యతిరేకించడమే గాక, దోపిడీకి అవకాశం లేని సమసమాజాన్ని నిర్మించాలని, దానికి సోషలిజమే మార్గమని కార్మికవర్గానికి లక్ష్య నిర్దేశం చేసిందీ పార్టీ. ఈ దోపిడీ వ్యవస్థకు నాయకత్వం వహిస్తున్న బడా పెట్టుబడిదారీ వర్గాన్ని రాజ్యాధికారం నుండి కూలదోయకుండా, ఆ స్థానంలో కార్మికవర్గ నాయకత్వంలో కార్మిక, కర్షక ప్రభుత్వం ఏర్పడ కుండా సోషలిజం రాదని చరిత్రసారం. "తత్త్వవేత్తలు సమాజాన్ని పరిపరివిధాల విశ్లేషించారు. కాని చేయాల్సింది దాన్ని మార్చడం" అన్నారు మార్క్స్. ఇదే కమ్యూనిస్టు సిద్ధాంతానికి పునాది. బూర్జువా పార్టీలు ఈ వ్యవస్థను కాపాడే కర్తవ్యాన్ని చేపట్టాయి. తద్విరుద్ధంగా దాన్ని సమూలంగా మార్చి నూతన సమాజాన్ని నిర్మించే బాధ్యతను కమ్యూనిస్టుపార్టీ చేపట్టింది. దాన్ని సాధించడానికి పటిష్టవంతమైన నిర్మాణం అవసరం. అత్యంత క్రమశిక్షణ కలిగిన కార్యకర్తలు దానికి ఊపిరి. ఆయువుపట్టు లాంటి వర్గపోరాట సిద్ధాంతాన్ని, దాన్ని సాధించే సాధనమైన నిర్మాణాన్ని కాపాడుకుంటేనే కమ్యూనిస్టుపార్టీ తన లక్ష్యాన్ని సాధించగలుగుతుంది. వర్గ పోరాటంలో నిర్మాణమే ఆయుధమని లెనిన్ నొక్కి చెప్పారు.

### రాజకీయ,సాంస్కృతిక నేపథ్యం

మార్క్సిజం పిడివాదం కాదు. ఆచ రణకు మార్గదర్శి అన్నారు లెనిన్. "నిర్దిష్ట పరిస్థితిని నిర్దిష్టంగా విశ్లేషించడమే మార్క్సిస్టు సారం" అన్నారాయన. కమ్యూనిస్టులంగా మనం ఈ సమాజాన్ని మార్చే లక్ష్యసాధనలో విజయం సాధించాలంటే ఏ నిర్దిష్ట పరిస్థితులలో పనిచేస్తున్నామో అర్థం చేసుకుంటేనే దానికి సరిపడే విధానాలు, పద్ధతులు, పోరాటాలు రూపొందించుకోగలుగుతాం.

నేడు ప్రపంచాన్ని సామ్రాజ్యవాదం శాసిస్తోంది. దానికి అమెరికా నాయకత్వం వహిస్తోంది. అది ప్రపంచాన్ని దోచుకు తింటోంది. కాదన్న వారిపై దాడులు చేస్తోంది. తన వ్యతిరేకులకు టెర్రరిస్టులన్న ముద్రవేసి నిర్మూలించేందుకు రాత్రింబవళ్లు పథకాలు వేస్తోంది. అమెరికా ఆధిపత్యానికి వ్యతిరేకంగా వివిధ రూపాల్లో ప్రతిఘటన తీవ్రతరమవుతోంది. పరిస్థితులను తనకనుకూలంగా మలచుకునేందుకు సామ్రాజ్యవాదం సాంస్కృతిక యుద్ధం చేస్తోంది. ప్రజల ఆలోచనలను వివిధ రూపాల్లో ప్రభావితం చేయడానికి ప్రయత్నిస్తోంది. నిత్యం కార్పోరేట్ మీడియా ద్వారా వివిధ రూపాల్లో ఈ విషాన్నే ప్రజల బుర్రల్లోకి ఎక్కిం చేందుకు ప్రయత్నిస్తోంది. కన్స్యూమరిజం, కెరీరిజం వంటి లక్షణాలు స్వేచ్ఛామార్కెట్ విధానాల పేరుతో ఊపిరి సలపకుండా నలిపేస్తుం టాయి. మానవ విలువల్ని మంటగలుపుతాయి. దీన్ని వ్యతిరేకించేవారిని కాలం చెల్లినవారి గానూ, అభివృద్ధి నిరోధకులుగానూ చూపిస్తుం టారు. ఈ సిద్ధాంతాలను ప్రచారం చేయడానికి ప్రత్యేకంగా "సెలబ్రిటీ"లను సృష్టించి ప్రజలపై వదులు తుంటారు. సినీనటులు, క్రీడాకారులు, వాణిజ్య



రచయిత భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) కేంద్ర కార్యదర్శివర్గ సభ్యులు.

> **"ఏదైనా బూర్జువా పార్టీలో ఒకరిద్దరు నిజాయితీపరులుంటే వారికి విపరీతమైన ప్రచారం కల్పిస్తారు. మరోపక్క కమ్యూనిస్టుల్లో అక్కడో ఇక్కడో ఎవరో ఒకరు తప్పులు చేస్తున్నవారుంటే వారిని పైకెత్తి చూపిస్తున్నారు. తద్వారా కమ్యూనిస్టులు చెడిపోయారని, ఇతరపార్టీలే మెరుగ్గా ఉన్నాయని చెప్పడానికి తాపత్రయపడుతున్నారు. ఎన్నడానికి తప్పులేమీ దొరక్కపోతే కుల, మత, ప్రాంతీయ తత్వాలు అంటగట్టి దుష్ప్రచారం చేస్తున్నారు."**

ప్రకటనల్లో పాల్గొనే మోడల్స్‌ను మనకు రోల్‌మోడల్స్(ఆదర్శం)గా చూపుతున్నారు. వారి పట్ల యువతలో ఆరాధనాభావాన్ని పెంచుతున్నారు. తద్వారా యువశక్తిని నిర్వీర్యం చేస్తున్నారు. అందుకే ఏ సమాజంలోనైనా పాలకుల ఆలోచనలే సాధారణ ఆలోచనలుగా చలామణిలో ఉంటాయని మార్క్స్ చెప్పారు.

దేశరాజకీయాల్లోనూ సరళీకరణ ఆర్థిక విధానాలు సరికొత్త సంస్కృతిని ప్రవేశ పెట్టాయి. అవి రాజకీయాలను కూడా వ్యాపార కళగా మార్చేశాయి. అమెరికా ప్రేరేపిత సామ్రాజ్యవాద సంస్కృతిని అనుకరించడం నేడొక ఫ్యాషన్‌గా మారింది. సమాజానికి ఏంచేశావు అనేదాని కన్నా ఎంత సంపాదించావు అన్నదే పరమావధిగా మారింది. ఆర్థిక సామ్రాజ్యాలను విస్తరించుకోడానికే నేడు అనేక మంది రాజకీయాల్లోకి వస్తున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో కమ్యూనిస్టులు మాత్రమే దీనికి భిన్నంగా కనిపిస్తారు. ఈ మధ్యకాలంలో మనదేశంలో సామ్రాజ్యవాదాన్ని సవాలు చేసి పోరాడుతోంది సిపియం. సరళీకరణ విధానాలకు బ్రేకులు వేసి కార్మికవర్గ ప్రయోజనాలను కాపాడేందుకు తన పార్లమెంటరీ బలాన్ని వినియోగిస్తున్నది. వామపక్షాలను ఎలాగైనా దెబ్బతీయాలని, అప్రతిష్టపాలు చేయాలని బడా పెట్టుబడిదారులు మొదలుకొని సామ్రాజ్యవాదుల వరకు తమ దాడిని ఎక్కుపెట్టారు. భారత అమెరికా న్యూక్లియర్ ఒప్పందా న్ని వామపక్షాలు వ్యతిరేకించడంతో ఈదాడి మరింత తీవ్రమయింది. మనరాష్ట్రంలో భూపోరాటం తర్వాత వామపక్షాల ప్రతిష్ట మరింత ఇనుమడించింది. దాన్ని పక్కదారి పట్టించి భూస్వామ్య, పెట్టుబడిదారీ వర్గాల కొమ్ముకాయడానికి కమ్యూనిస్టులపై బురదచల్లే పని చేస్తున్నారు. ఏదైనా బూర్జువాపార్టీలో ఒకరిద్దరు నిజాయితీపరులుంటే వారికి విపరీతమైన ప్రచారం కల్పిస్తారు. మరోపక్క కమ్యూనిస్టుల్లో అక్కడో ఇక్కడో ఎవరో ఒకరు తప్పులు చేస్తున్నవారుంటే వారిని పైకెత్తి చూపిస్తున్నారు. తద్వారా కమ్యూనిస్టులు చెడిపోయారని, ఇతరపార్టీలే మెరుగ్గా ఉన్నాయని చెప్పడానికి తాపత్రయపడుతున్నారు. ఎన్నడానికి తప్పులేమీ దొరక్కపోతే కుల, మత, ప్రాంతీయ తత్వాలు అంటగట్టి దుష్ప్రచారం చేస్తున్నారు. ఉన్నవి, లేనివి సృష్టించి ప్రజల్లో పార్టీ ప్రతిష్టను దెబ్బతీయడానికి ప్రయత్నిస్తున్నారు. ఈదాడికి ప్రధానంగా మూడు లక్ష్యాలున్నాయి. **ఒకటి:** పార్టీ విస్తరణ కొత్త సెక్షన్లలోకి, ప్రాంతాల్లోకి విస్తరించకుండా నిరోధించడం. **రెండు:**కొత్తతరాన్ని పార్టీకి దూరంగా ఉంచడం. వీలైతే ద్వేషించేట్లు చేయడం. **మూడు:** పార్టీ లోపల శ్రేణుల్ని గందరగోళపర్చడం. ఇలాంటి కుట్రలను, పథకాలను పారకుండా చేయాలంటే పార్టీ కార్యకర్తలు, నాయకులు మరింత జాగ్రత్తగా, చైతన్యయుతంగా ఉండాలి. అంతేకాదు పార్టీని శత్రుదాడుల నుండి నిరంతరం కాపాడుకుంటూనే మన తప్పుల్ని ఎప్పటికప్పుడు సరిదిద్దుకుంటూ ముందుకుపోవాలి. కామ్రేడ్ హోచిమిన్ అన్నట్లుగా "పార్టీ సభ్యులు చేసే చిన్నచిన్న పొరపాట్లు ప్రజలను కూడా తప్పుదోవ పట్టిస్తాయి. అందుకే వారు తమ పొరపాట్లను సరిదిద్దుకునేందుకు సిద్ధంగా ఉండాలి. చిన్న పొరపాట్లను పెద్ద తప్పిదాలుగా పరిణమించనీయరాదు. సభ్యుల పరస్పర పురోగమనానికి వీలుకల్పించే విమర్శ–ఆత్మవిమర్శను ఎప్పుడూ చిత్తశుద్ధితో అనుసరించాలి".

శత్రువుతో పోరాడి గెలవాలంటే ముందు నీలోనే ఉన్న అంతర్గత శత్రువుతో పోరాడి గెలవాలని ప్రాచీన చైనా సామెత. మన అలవాట్లు, ఆలోచనాధోరణే కొన్ని సందర్భాలలో మనకు శత్రువుగా మారుతుంది. కామ్రేడ్ బసవపున్నయ్య ఎప్పుడూ ఒకమాట చెపుతుండేవారు. "గాలిలో ఇనుపముక్కను పడేసి శుభ్రపరచకపోతే కొద్దిరోజుల్లో అది తుప్పుపట్టిపోతుంది. మరికొద్దిరోజుల్లో అసలు కనపడకుండానే పోతుంది. దాన్ని రోజూ శుభ్రం చేసుకుంటూ ఉంటేనే భద్రంగా ఉంటుంది. అలాగే కమ్యూనిస్టుపార్టీని నిత్యం పరిశుభ్రం చేస్తుండాలి" అని చెప్పేవారు. విమర్శ, ఆత్మవిమర్శయే దానికి సాధనం. రోజూ పళ్లు తోముకోకపోతే దుర్వాసన వస్తుంది. ఎవరూ దగ్గరకు కూడా రారు. అంతేకాదు పళ్లు కూడా తొందరగా పాడై నోరు బోసిపోతుంది. నిన్న చేశాం కదాని ఈరోజు స్నానం చేయకుండా ఉండం. ఏరోజు మురికి ఆరోజు వదిలించుకోవాల్సిందే. అప్పుడే ఆరోగ్యంగా ఉంటాం. పార్టీ కూడా అంతే. మావో ఇలా అన్నారు "ఏ విజయాన్నైనా సాధించినప్పుడు మనలో నిర్లిప్తత ప్రవేశించనీయకూడదు. మన ముఖాలు రోజూ కడుక్కుంటున్నట్లే, మన ఇంటిని రోజూ ఊడ్చుకొని దానిని శుభ్రంగా ఉంచుకుంటున్నట్లే మనలో నిర్లిప్తతను తొలగించుకొని మన లోపాలను నిరంతరం విమర్శించుకోవాలి" అందుకే దిద్దుబాటు ఉద్యమం అవసరమని సిపియం అభిప్రాయపడింది.

### దిద్దుబాటు ఉద్యమ ఆవశ్యకత

1992లో జరిగిన పార్టీ 14వ మహాసభ నిర్మాణ నివేదిక పార్టీలో మూడు రకాల ప్రధాన లోపాలను గుర్తించింది. అవి **ఒకటి:** పార్లమెంటరీతత్వం, **రెండు:** కమ్యూనిస్టు చైతన్యం సన్నగిల్లడం, **మూడు:** బూర్జువా సమాజపు క్షీణప్రభావం. దీనికి కారణాలను విశ్లేషిస్తూ నివేదిక ఇలా పేర్కొన్నది. "1977 తర్వాతి రెండు దశాబ్దాల కాలంలో నెలకొన్న పరిస్థితుల దృష్ట్యా బూర్జువా పార్టీలతో పొత్తు, ప్రత్యేకించి ఎన్నికల పొత్తు పెట్టుకునే ఎత్తుగడల పంథా అవసరమయింది. బూర్జువా తరహా వ్యవహారశైలి మనపార్టీలో ప్రవేశించే అవకాశాలు ఏర్పడినాయి. ఈ పార్టీలలో అనుసరించే బూర్జువా పద్ధతుల ప్రభావం, ధనబలం ప్రభావం మన కార్యకర్తలపైనా పడే అవకాశం ఏర్పడింది. మన కార్యకర్తల చేవను దెబ్బకొట్టేదిగా ఆ ప్రభావం పనిచేసే అవకాశం ఏర్పడింది." నాటి ఈ అంచనాను దృష్టిలో ఉంచుకొని దిద్దుబాటు ఉద్యమాన్ని నడపాలని పార్టీ 15వ మహాసభ నిర్ణయించింది. ఆ ఆదేశాల కనుగుణంగానే 1996 అక్టోబర్29–31తేదీల మధ్య జరిగిన సిపియం కేంద్రకమిటీ సమావేశం దిద్దుబాటు ఉద్యమ తీర్మానాన్ని ఆమోదించింది. అది ఇలా పేర్కొన్నది. "భారతదేశంలో రైతాంగమూ, పెటీ

బూర్జువా సెక్షన్లు సమాజంలో ప్రాధాన్యత వహిస్తున్నాయి. బూర్జువా, సెమీ-ఫ్యూడల్ వాతావరణంలో పార్టీ పనిచేస్తున్నది. ఈ పరిస్థితుల్లో అన్యవర్గ విలువలూ, అలవాట్లూ నిరంతరం పార్టీలోకి జొరబడతాయి. పార్టీ లోపల ఈ హానికరమైన ప్రభావాలకు వ్యతిరేకంగా పోరాడటం నిరంతరాయంగా సాగవలసిన పని". నాటి పరిస్థితులను దృష్టిలో ఉంచుకున్న కేంద్రకమిటీ ఆరు అంశాలపై కేంద్రీకరించింది. అవి 1)పార్లమెంటరీ తత్వాన్ని ఎదుర్కొనాలి. 2) కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని పున రుద్ధరించాలి. పటిష్టవంతం చేయాలి. 3) కమ్యూనిస్టు ప్రమాణాలను పాటించాలి. 4) అభ్యుదయకర విలువల్ని పాటించాలి. 5) పార్టీ విద్యాబోధన 6) సైద్ధాంతికరంగంలో పార్టీ కృషి. దీన్ని సమీక్షించిన 17వ పార్టీ అఖిల భారత మహాసభ పార్టీలో అన్యవర్గధోరణులకు వ్యతిరేకంగా పోరాటం కొనసాగించాలని అన్ని రాష్ట్రకమిటీలను ఆదేశించింది. శరీరంలోకి చెడ్డ వైరస్‌లు, బాక్టీరియాలు ప్రవేశిస్తున్నట్లే పార్టీలోకి చెడుధోరణులు ప్రవేశిస్తుంటాయని ఈ మహాసభ హెచ్చరించింది. వాటికి వ్యతిరేకంగా నిరంతరం పోరాటం చేయాలని, దానికోసం దిద్దుబాటు ఉద్యమాన్ని ఒక నిరంతర ప్రక్రియగా కొనసాగించాలని పార్టీ 18వ మహాసభ నిర్ణయించింది.

**పార్లమెంటరీతత్వం**

పార్టీని ఇది ఒక జాడ్యంలాగా పీడిస్తుంది. ఎన్నికల్లో పోటీ చేయడాన్ని పార్లమెంటరీ తత్వం అని అనలేం. పార్లమెంటు ద్వారానే రాజ్యాధికారం సాధిస్తామని చెప్పడం పార్లమెంటరీ పంథా అవుతుంది. ఈ రెంటికీ భిన్నంగా వ్యక్తులు పదవుల కోసం పాకులాడటాన్ని పార్లమెంటరీ తత్వం అంటాం. ఏ గడ్డికరిచైనా పదవి సాధించాలనుకునే తత్వం నేడు రాజకీయాల్లో కనిపిస్తుంది. బూర్జువా రాజకీయ నాయకుల వేష భాషల తీరు కూడా వేరే తీరుగా ఉంటాయి. వాటిని అనుకరించే ధోరణి మనపార్టీలో ప్రవేశిస్తుంది. పదవుల సాధనకోసం పార్టీలోనే లాబీయింగులు చేయడం, సీటు సంపాదించేందుకు అడ్డదారులు తొక్కడం, పార్టీ అంగీకరించకపోతే తిరుగుబాటుకి సిద్ధపడటం, పోటీకి పార్టీ నిర్ణయించాక గెలవడానికి డబ్బు, మద్యంతో సహా పలు తప్పుడు పద్ధతులకు పాల్పడటం వంటి ధోరణులు పొడసూపుతున్నాయి. వాటిని నికరంగా వ్యతిరేకించాలి. దీన్ని కేవలం పెడధోరణిగా మాత్రమే చూడటానికి వీల్లేదని 96 తీర్మానం స్పష్టం చేసింది. ఎన్నికల సమయంలోనే కాదు రోజువారీ పని పద్ధతుల్లో కూడా పార్టీమెంటరీతత్వం మనలను వెన్నాడుతుంటుంది. "పదవుల కోసం వెంపర్లాడటమే మురాతత్వానికి, అంతర్గత కుమ్ములాటలలో చాలావాటికి మూలం" అని ఈ తీర్మానం నిర్ధారణకొచ్చింది. "వర్గపోరాటాలను, ప్రజాపోరాటాలను పెంపొందించడం-వాటి ద్వారా ప్రజా సంఘాలను నిర్మించడం-పార్టీ పలుకుబడిని విస్తరించడంలోనూ, విప్లవప్రజాపార్టీని నిర్మించడంలోను కీలకప్రాధాన్యత వహించుతాయి. ప్రజా ఉద్యమాన్ని , పార్టీ పలుకుబడిని పెంపొందించడం కోసం పార్లమెంటరీ, పార్లమెంటేతర కృషిని జోడించుతూ పార్టీ నిర్మాణాన్ని పటిష్టమొనరించడానికి ప్రథమస్థానం ఇవ్వాలి." అంటూ పార్టీ తన శ్రేణులను ఆదేశించింది.

**కెరీరిజం పార్టీ ఎదుగుదలకు గుదిబండ:** అవకాశవాదానికి మరోరూపమే కెరీరిజం. పార్టీకి బదులుగా తమ స్వంత ఎదుగుదల గురించి కెరీరిస్టులు ఆలోచిస్తుంటారు. పార్టీలో పదవుల సంపాదనకు ఒక్కొక్క మెట్టు పైకి ఎగబాకడానికి మార్గాలను వెతుకుతూ ఉంటారు. దీనికోసం నాయకులను కాకా పట్టడం, లాబీయింగు చేయడం, ముఠాలు కట్టడం వంటి తప్పుడు పద్ధతులకు పాల్పడుతుంటారు. చెవులు కొరకడం, చాడీలు చెప్పడం, పితూరీలు చేయడం వంటి అవలక్షణాలెన్నో ఇలాంటి వారిలో ఉంటాయి. పార్టీ సహచరులు తమ పట్ల వ్యక్తిగతంగా విశ్వాసంతో ఉండేటట్టు చూసుకుంటుంటారు. పార్టీ అంటే అంతా తామే అనే అభిప్రాయం కల్పించేందుకు ప్రయత్నిస్తారు. ఇలాంటి వారికి ఈపార్టీని వేలమంది రక్తతర్పణ

## వ్యక్తిగత పనివిధానం ప్రమాదకరం:హోచిమిన్



"పాత సమాజంలోని అత్యంత ప్రమాదకరమైన దుర్లక్షణాలలో వ్యక్తిగత వాదం ఒకటి. విప్లవనైతికతకు అది బద్ధవ్యతిరేకి. విప్లవ లక్ష్యం కోసం మనస్ఫూర్తిగా పోరాడటాన్ని అది నిరోధిస్తుంది. వంచనకు, విశ్వాసఘాతుకానికి అది మారుపేరు. తిరోగమనం దిశగా అది పురిగొల్పుతుంది." అంటూ వ్యక్తిగత వాదం ఎంత ప్రమాదకరమో కామ్రేడ్ హోచ్‌మిన్ వివరించారు. ఆయనే ఇలా అన్నారు. "మన అంతరాంతరాళాల్లో పెటీ బూర్జువా మనస్తత్వం నక్కి ఉంటుంది. అవకాశం కోసం అది ఎదురు చూస్తుంటుంది. విజయమైనా, వైఫల్యమైనా అది తలెత్తుతుంది." అంటూ హెచ్చరించారు. "వ్యక్తివాదాన్ని వదులుకోలేనివారు గర్వంతోను, అహంకారంతోను ఊగిపోతుంటారు. తమ యోగ్యతలను చూసుకొని విర్రవీగుతుంటారు. ఇతరులను విమర్శిస్తుంటారు. తమను విమర్శించడాన్ని మాత్రం ఒప్పుకోలేరు. ఆత్మవిమర్శ జోలికి అసలే పోరు. పోయినా దాన్ని చిత్తశుద్ధితోను, సీరియస్‌గాను చేయరు. తమ పరువుపోతుందని, ప్రతిష్టకు భంగం కలుగుతుందని భయపడతారు. ప్రజాభిప్రాయాన్ని అసలు పట్టించుకోరు." అంటూ ఆయన వ్యక్తిగతవాదమనే పెడధోరణిపై దాడి ఎక్కుపెట్టారు. "వ్యక్తిగతవాదం వందలాది ప్రమాదకర జబ్బులను సంక్రమింపచేస్తుంది. ...వర్గం, ప్రజల ప్రయోజనాల గురించి కాక పదవులు, గౌరవాలకోసం ఆందోళన మొదలవుతుంది" దీనికి వ్యతిరేకంగా పోరాడాల్సిన ఆవశ్యకత గురించి వివరిస్తూ హోచిమిన్ ఇలా అన్నారు. "వ్యక్తిగతవాదంపై పోరాటమంటే వ్యక్తి ప్రయోజనాలను తుంగలో తొక్కడమని కాదు. ప్రతి మనిషికీ ప్రత్యేక వ్యక్తిత్వముంటుంది. కొన్ని ప్రత్యేకతలుంటాయి. వ్యక్తిగత జీవితం, కుటుంబం ఉంటాయి. సమిష్టితత్వానికి భిన్నంగా పోనంత వరకూ వాటిలో వేటి ప్రయోజనాలకూ భంగం వాటిల్లదు." అంటూ వ్యక్తిత్వానికి, వ్యక్తిగతవాదానికి మధ్య ఆయన విభజనరేఖ గీశారు. వ్యక్తిగత నైతికతకు హోచిమిన్ కొండంత గుర్తు అన్న విషయం మనకు తెలిసిందే. వ్యక్తిగతవాదం వ్యక్తిగత బాధ్యతను దెబ్బతీస్తుంది. సమిష్టి నిర్ణయాల అమలుకు ప్రతిఒక్కరూ వ్యక్తిగత బాధ్యత తీసుకోవాలని సిపియం నిర్మాణ తీర్మానం చెపుతుంది. కాని వ్యక్తిగతవాదానికి లోనయ్యేవారు ఇలాంటి బాధ్యతలను తీసుకోడానికి ముందుకురారు. వారికి తమ స్వంత అజెండాయే ముఖ్యం.

**"నేడు మనల్ని ప్రజలు ఆదరిస్తున్నారు. విరాళాలు వసూలు చేసుకోకపోవడం మనలోపం తప్ప ఇవ్వడానికి ప్రజలు సిద్ధంగా ఉన్నారు. నేడు మనకున్న అవకాశాలతో పోల్చుకుంటే కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభదినాల్లో మార్క్స్, ఎంగెల్స్‌లు పడ్డ కష్టాలు అన్నీఇన్నీ కావు. అయినా వారు ఎంతో నిబ్బరంగా కష్టాలను అధిగమించారు. కాని నేడు కొంతమంది కేవలం ఆర్థిక సమస్యలతోనే సహనాన్ని కోల్పోతుంటారు."**

చేసి త్యాగాలతో నిర్మించి మనకు వారసత్వంగా అందించారన్న విషయం కూడా గుర్తుండదు. తామే కొత్తగా పార్టీని నిర్మించినట్లుగా ఫోజు పెడతారు. వారు పార్టీ పత్రికలు చదవరు. పార్టీ నిర్ణయాలను తెలుసుకోరు. పట్టించుకోరు. వాటిని అమలు చేయడానికి ఆసక్తి చూపరు. ఇతరులను కూడా నిరుత్సాహపరుస్తుంటారు. తమ తప్పుడు పద్ధతులు బయటపడకుండా ఉండటానికి ఇతరుల తప్పులను కాస్తుంటారు. పార్టీలో ఉదారవాదాన్ని ప్రవేశపెడతారు. ఇది క్రమంగా పార్టీని చెదలు పట్టిస్తుంది.

**కమ్యూనిస్టు విలువలు**

ఈ పెట్టుబడిదారీ సమాజంలో నిజాయితీ, నిరాడంబరత-ఈ రెండు లక్షణాలు కమ్యూనిస్టులను ఇతరులకు భిన్నంగా నిలబెడతాయి. నిజాయితీ అంటే ఏమిటి? మనసా, వాచా, కర్మణా నమ్మిన ఆశయానికి కట్టుబడి ఉండటం. ఆలోచించేది, చెప్పేది, చేసేది ఒకటిగానే ఉండాలి. మాటలు కోటలు దాటుతాయి చేతలు గడపదాటవు అన్నట్లుగా ఉండకూడదు. ఈవిషయంలో బూర్జువా రాజకీయ వేత్తలు ప్రజలకు చేసే వాగ్దానాలు ఎలా భంగపరుస్తారో మనకు తెలియంది కాదు. పార్టీ దగ్గర మనం రహస్యాలు దాయకూడదు. తప్పుడు పనులు చేసేవారు పార్టీని కూడా తప్పుదోవ పట్టించడానికి అబద్ధాలు చెపుతుంటారు. వారి పట్ల పార్టీలోనే కాదు సమాజంలో కూడా గౌరవం లేకుండా పోతుంది. "మంచి కమ్యూనిస్టు ఎలా ఉండాలి" అంటూ ప్రముఖ చైనా కమ్యూనిస్టు నాయకుడు లీషావ్‌చీ ఒక పుస్తకం రాశారు. అది అందరూ చదివి తీరాల్సిన విలువైన పుస్తకం.(అందులోని ముఖ్యాంశాలను ఇదే సంచికలో విడిగా ఇచ్చారు) పార్టీ సభ్యులు వ్యక్తిగత ప్రయోజనాలకన్నా సమాజ ప్రయోజనాలకు, పార్టీ ప్రయోజనాలకు ప్రాధాన్యత నివ్వాలని ఆయన నొక్కి చెప్పారు. సిపియంలో ఎవరైనా సభ్యులుగా చేరదలచుకుంటే ఒక ప్రమాణపత్రంపై సంతకం చేయాలి. అందులో స్వప్రయోజనాల కన్నా పార్టీ ప్రయోజనాలను మిన్నగా భావిస్తానని ప్రమాణం చేస్తారు. అది జీవితంలోనే ప్రతి ఒక్కరికీ ఏదో ఒక సమయంలో పెద్ద పరీక్షగా మారుతుంది. అప్పుడు ఊగిసలాటకు గురైనా, రాజీపడ్డా ప్రజల్లో పలచబడతాం.

**ఆర్థిక అరాచకత్వం సహించరానిది:** "పార్టీ డబ్బు చాల పవిత్రమైంది. దాన్ని ఆచితూచి వాడాలి" అని 96 తీర్మానం మనకు నిర్దేశించింది. స్వంత డబ్బును పొదుపుగా వాడుకునే వారు కూడా కొంతమంది తమది కాకపోతే ఎంతైనా ఖర్చు పెట్టవచ్చన్న భావన కలిగి ఉంటారు. కొంతమంది సరిగ్గా లెక్కలు కూడా రాయరు. సకాలంలో పార్టీకి లెక్కలు అప్పగించరు. చివరకు ఇది ఆర్థిక అరాచకత్వానికి దారితీస్తుంది. నిధులు, ఖర్చుల విషయంలో ప్రతి ఒక్కరూ పారదర్శకంగా వ్యవహరించాలి. పార్టీ ఖర్చుల విషయంలోనే కాదు. వ్యక్తిగత విషయంలోనూ అంతే. ముఖ్యంగా పదవుల్లో ఉన్నవారు మరింత మెలుకువతో ఉండాలి. అప్పుడు శత్రువు అబద్ధాలు చెప్పినా ప్రజలు నమ్మరు. అందుకే నాయకులు, ప్రజా ప్రతినిధులు ప్రతి సంవత్సరం కుటుంబ ఆదాయం, ఆస్తి వివరాలను అందించాలని పార్టీ ఆదేశించింది. దీన్ని తూ.చ. తప్పక పాటించాల్సిన అవసరం ఉంది. దీన్ని అమలు చేయకపోవడమంటే అనుమానాలకు ఆస్కారం ఇవ్వడమే. అప్పుడు అనుమానించేవారిని తప్పు పట్టడంలో అర్థం ఉండదు.

**నిధి వసూళ్లు అందరి బాధ్యత:** పార్టీ, ప్రజా- ఉద్యమాల నిర్వహణకు, కార్యకర్తల పోషణకు నిధులు కావాలి. కొంతమంది పార్టీ కార్యకర్తలు, నాయకులు నిధులు వసూలు చేయడం తమ బాధ్యత అనుకోవడం లేదు. నిధి వసూళ్లు ఒక తప్పనిసరి బాధ్యత. దీన్నొక ఉద్యమంగా భావించి సామాన్య ప్రజల నుండి ఇల్లిల్లు తిరిగి వసూళ్లు చేయాలని పార్టీ నిర్ణయం. ఇందులో అందరూ భాగస్వాములై తీరాలి. అనేక సందర్భాలలో నిధులకొరత ఉద్యమ పురోగమనానికి ఆటంకంగా మారుతున్నది. దీన్ని అధిగమించాలంటే ప్రజలపై నమ్మకంతో నిధుల వసూళ్లకు పూనుకోవాలి.

నేడు మనల్ని ప్రజలు ఆదరిస్తున్నారు. విరాళాలు వసూలు చేసుకోకపోవడం మనలోపం తప్ప ఇవ్వడానికి ప్రజలు సిద్ధంగా ఉన్నారు. పార్టీ కోసం త్యాగాలు చేయడానికి అనేకమంది సానుభూతిపరులు ముందుకు వస్తున్నారు. నేడు మనకున్న అవకాశాలతో పోల్చుకుంటే కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభదినాల్లో మార్క్స్, ఎంగెల్స్‌లు పడ్డ కష్టాలు అన్నీఇన్నీ కావు. అయినా వారు ఎంతో నిబ్బరంగా కష్టాలను అధిగమించారు. కాని నేడు కొంతమంది కేవలం ఆర్థిక సమస్యలతోనే సహనాన్ని కోల్పోతుంటారు.

**ఆర్థిక ఇబ్బందులూ ఓ పరీక్షే:** జీవితంలో ఆర్థిక సమస్యలను ఎదుర్కోవడం క్లిష్టంగా ఉంటుంది. పార్టీ కుటుంబాలనేకం ఆర్థిక సమస్యలతో సతమతమవుతున్నాయి. కుటుంబసభ్యుల నుండి కూడా ఒత్తిళ్లు పెరుగుతుంటాయి. చుట్టుపక్కల వారు ఈజీగా మనీ సంపాదిస్తుంటే తాము అవకాశం ఉండీ పైసలకు ఇబ్బంది పడటం కొందరికి చిన్నతనం గా అనిపిస్తుంది. దీనికి లోబడేవారు తొందరగా పై పద్ధతులకు అలవాటుపడతారు. తర్వాత వారు పార్టీకి కూడా ఈ జాఢ్యాన్ని అంటిస్తారు. ప్రారంభంలోనే ఇలాంటి ధోరణులకు అడ్డుకట్ట వేయాలి. చాలీచాలని ఆదాయాలతో కుటుంబాన్ని నడపాలంటే దానికి తగిన జీవనపద్ధతుల్ని కూడా అలవరచుకోవాలి. 'పొదుపు' జీవితంలో ఒక భాగం కావాలి. ఆడంబరాలకు స్వస్తి చెప్పాలి.

**సరళీకరణయుగంలో కొత్త ఆకర్షణలు**

ఈ సమాజం మనలను నిరంతరం రెచ్చగొడుతూ ఉంటుంది. అవకాశాలూ వెంట బడుతూ ఉంటాయి. వ్యక్తిగత ప్రయోజనాల కోసం అందివచ్చే అవకాశాలను తిరస్కరించేందుకు ధృఢచిత్తం కావాలి. ముఖ్యంగా ఉన్నత స్థానాల్లో ఉన్నవారిని అవకాశాలు మరీ వెతుక్కుంటూ వస్తాయి. 96తీర్మానం ఇలా చెప్పింది."సరళీకరణ శకంలో, బడా పెట్టుబడిదారులు, ప్రవేటు రంగ కంపెనీలూ తమకు అనుకూలమైన విధానాల కోసం,వారి ప్రత్యేక ప్రయోజనాల నిమిత్తం లాబీయింగు కోసం కార్యకలాపాలను ముమ్మరం చేశారు. గతంలో

వారు ఉత్పతాధికారులతోను, రాజకీయవేత్తల తోనూ చాటుమాటు సంబంధాలు కలిగి ఉండేవారు. సరళీకరణ ఫలితంగా ఇప్పుడవి గౌరవనీయమైనవిగానూ, బాహాటమైనవిగానూ మారాయి. బూర్జువా రాజకీయవేత్తలూ, ఉన్నతాధికారులూ బడావాణిజ్యవర్గాలకు, వారి స్వార్థ ప్రయోజనాలకు లాబీయింగు చేసేవారు గానూ, ఏజెంట్లుగానూ వ్యవహరించుతున్నారు. మనపార్టీనాయకులు, ఎన్నికైన ప్రతినిధులూ ఈ విషయంలో తగు మార్గదర్శక సూత్రాలను పాటించడం అసవరం." ఏకే గోపాలన్ నాటి కాలం కన్నా పరిస్థితుల్లో వచ్చిన ప్రతికూల మార్పుల్ని ఇది సూచిస్తుంది. ఇప్పుడు పదవుల్లో ఉన్నవారికే కాదు సాధారణ పార్టీనాయకులకు కూడా ఇలాంటి అవకాశాలు లభిస్తున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో మరింత చైతన్యం, జాగరూకత అవసరాన్ని ఇది సూచిస్తుంది.

నేటి మార్కెట్ వ్యవస్థ కూడా మనలను ఆకర్షిస్తుంది. మీడియాలో వచ్చే పలు అంశాలు మనలను వినియోగవాదం వైపు ఉసిగొల్పుతుంటాయి. మార్కెట్‌లోకి కొత్తది ఏది వచ్చినా కొనుగోలు చేయాలనుకోవడం, ఖరీదైన వస్తువులు వాడటం ద్వారా తమ డాంబికాన్ని ప్రదర్శించుకోడానికి తాపత్రయపడటం మనం సమాజంలో చూస్తుంటాం. వాటి ప్రభావం మనపైనా పడుతుంటుంది. మన కుటుంబ సభ్యుల ఒత్తిళ్లు మనపై పనిచేస్తుంటాయి. ఇరుగుపొరుగువారి ప్రభావమూ పనిచేస్తుం టుంది. ఈ ఆడంబరాల నిర్వహణకు డబ్బు సంపాదన వైపు దృష్టి మళ్లుతుంది. లేదా అక్రమ సంపాదనకు అలవాటు పడవచ్చు. పార్టీ నిధులు దుర్వినియోగం చేయవచ్చు. ఇలాంటి కొన్ని ఉదా హరణలు అక్కడక్కడైనా మనపార్టీ జీవితం లోనూ ఉన్నాయి. బంధుమిత్రులతో నిరంతర సంబంధాలుంటాయి. అది అవసరం కూడా. కాని ఇక్కడ ఎవరు ఎవరిని ప్రభావితం చేస్తున్నా రన్నది ముఖ్యం. మనం వారిని ప్రభావితం చేయకపోగా వారి తప్పులకు మనం బాధ్యత వహించే పరిస్థితి తెచ్చుకోకూడదు. అవసరమైతే అలాంటి సంబంధాలను వదులుకోడానికి సిద్ధపడాలి. అంతేకాని మొహమాటపడితే ఒక మొరటు సామెతలాగా అది చివరకు మనకే గుదిబండగా మారుతుంది.



# సుందరయ్య, ఏకేజీ మనకు ఆదర్శం



నిరాడంబరత విషయంలోనూ మన ప్రత్యేకతను చాటుకోవాల్సిన అవసరం ఉంది. కమ్యూనిస్టుల జీవనశైలిలో ఇదొక భాగం. ఆదాయవనరులున్న ఈవిషయంలో మరింత నిబద్ధతతో వ్యవహరించాలి. ఇలా ఉండాలి...అలా ఉండాలి..అని పార్టీ ఎవరిమీదా ఆదర్శాలను రుద్దదు. ఇది ఎవరికి వారు స్వచ్ఛందంగా నిర్ణయించుకోవాలి. ప్రజలు మనల్ని ఎలా అర్థం చేసుకుంటున్నారు అనేది ముఖ్యం. మనం సుందరయ్యను ఎంతగానో ఆరాధిస్తాం. కాని ఆయన పద్ధతుల్ని మాత్రం అనుసరించడానికి సిద్ధపడం. ఆయన్నో దేవుడిగా భావించి పూజిస్తాం. ఎలాగూ దేవుడ్ని అనుసరించలేం కదా అనుకుంటాం. పూజలు చేస్తే పుణ్యం రాదు. అనుసరిస్తేనే ప్రజలు నమ్ముతారు. కొద్దిగా గుర్తింపు వచ్చినా లేదా ఒక చిన్న పదవి వచ్చినా వెంటనే అహంకారం మనలను వెన్నంటి వస్తుంది. ఇది కార్యకర్తలతో వ్యవహరించేటప్పుడే కాకుండా ప్రజలతో వ్యవహరించేటప్పుడూ కనిపిస్తుంది. క్రమంగా మనకు వారు దూరమవుతారు. ఈ విషయం గుర్తించేటప్పటికే పరిస్థితుల చేతులు దాటి పోతాయి. ప్రజలతో ఆకతాయిగా వ్యవహరించకూడదు. ప్రజల పట్ల నమ్రతతో వ్యవహరించాలని మావో పదేపదే చెప్పేవారు. ఈ విషయంలో మనకు ఏకే గోపాలన్ ఆదర్శం. ఆయన తన ఆత్మకథలో ఇలా రాసుకున్నారు. "నూతన జీవితం, నూతన పరిసరాలు,నూతన స్నేహాలు....మనిషిని సర్వనాశనం చేయడానికి ఉద్దేశించిన వాతావరణంలో అడుగుపెట్టినట్లు గ్రహించాను. మొదటి తరగతి ప్రయాణం, పార్లమెంటులో సుఖప్రదమైన ఆసనాలు, పుష్కలంగా డబ్బు, బ్రహ్మాండమైన నివాసభవనాలు, కష్టంతో కూడిన బాధ్యతలేవీ లేని జీవితం, విలాస జీవితం గడపడానికి అనుకూలమైన పరిస్థితులు. మనిషిని తలతిరిగేట్లు చేయడానికి ఇంతకంటె కావలసిందేముంది? ప్రతిరోజూ ప్రధానమంత్రితో , రాష్ట్రపతితో, ఉపరాష్ట్రపతితో ఇచ్చే ఉద్యానవిందులు, ఇవిగాక రాయబార కార్యాలయాల నుండి కుప్పలుతెప్పలుగా ఆహ్వానాలు వస్తుంటాయి. సమాజంలోని ఉన్నత శ్రేణికి చెందిన నాగరికమైన స్త్రీపురుషులతో స్నేహసంబంధాలు ఏర్పరచుకునేందుకనువైన పరిస్థితులన్నీ ఉన్నాయి.....మరోవైపున పార్లమెంటు సభ్యులను కలుసుకునేందుకు, పిటిషన్లు, మెమొరాండాలు సమర్పించడం కోసం సమాజంలోని అన్ని శ్రేణులకూ చెందిన ప్రజలు అనుదినమూ వస్తూ వుంటారు. పెత్తందారీ తనం, విలాసజీవనం పట్ల మోజుతో ప్రలోభపడటమా, ఆత్మగౌరవాన్ని నిలబెట్టు కొనునట్లుగా వ్యవహరించడమా తేల్చుకోవాల్సిన పరిస్థితులు మాకు ఎదురుబొదురుగా నిలిచి ఉన్నాయి. మార్చుకునేందుకు రెండవ జత బట్టలు లేక, రాత్రి నిద్రించేందుకు నెలవు లభించక, తేనీటికి, బస్సు చార్జీలకూ డబ్బుల్లేక, సమాజంలోని సంపన్నవర్గాలచే ఛీత్కరించబడుతూ వచ్చిన నావంటి కమ్యూనిస్టులకు, ఆకస్మికంగా ఇలాంటి సుఖప్రదమైన జీవితంలో అడుగుపెట్టడం చెడిపోయేందుకు ప్రత్యేకంగా ఆస్కారం ఇస్తోంది." అంటూ ఆయన ఆందోళన చెందారు. ఒక కమ్యూనిస్టు చైతన్యానికి ఇంతకన్నా నిదర్శనం ఇంకేం కావాలి? ప్రజా పునాదిని విస్తరింపచేసుకోవడమే లక్ష్యంగా పనిచేస్తున్న సిపియంలో ఉన్న కార్యకర్తలకు ప్రజల్లో కలగలసి పోవడానికి నిరాడంబరత ఒక సాధనం. అది ప్రజల్లో పార్టీ ప్రతిష్టను మరింత ఇనుమడింపచేస్తుంది.

**వంచనవ్యాపారాలు చేయరాదు:** పార్టీ సభ్యులు చాలా మంది సంపాదనకోసం వ్యాపా రాలు చేస్తుంటారు. అది తప్పు కూడా కాదు. కాని వ్యాపారాల్లో వచ్చే వివాదాలను పరిష్క రించుకోడానికి పార్టీని పావుగా వాడుకోవాలని చూడటం తప్పు. వ్యాపారాల్లో అక్రమ పద్ధతులు అనుసరించి పార్టీ ప్రతిష్టను దెబ్బకొట్టడం ఇంకా తప్పు. ముఖ్యంగా రియల్‌ఎస్టేట్, ఫైనాన్స్,చిట్స్ వంటి వ్యాపారాలకు అంతమంచి రికార్డు లేదు. పార్టీ సభ్యులు, నాయకులు(హోల్‌టైమర్లు కాని నాయకులు) వీటికి దూరంగా ఉండాలి. ఇక హోల్‌టైమర్లుగా ఉంటూ వ్యాపారాలు చేయడాన్ని పార్టీ అనుమతించదు. అలా చేయాలనుకునేవారు హోల్‌టైమర్‌గా వైదొలగడమే పరిష్కారం. కొన్ని రకాల వివాదాల్లో పార్టీనాయకులు తలదూర్చి మధ్యవర్తిత్వాలు చేయడం చూస్తుంటాం. వీటివల్ల

> "ప్రజా ఉద్యమాలకు, సమాజ ప్రయోజనాలకు భంగం కలిగే పద్ధతులను, విలువలను విడనాడాలి. ప్రజల మనోభావాలకు, నైతిక విలువలకు అంత: సంబంధం ఉంది. ప్రజల మనోభావాలను దృష్టిలో పెట్టుకోకుండా వ్యవహరించేవారు పార్టీకి చెరుపు చేసినవారే అవుతారు."

కొన్ని సందర్భాలలో దారినపోయే తగాదాలు కొని తెచ్చుకున్నట్లుంటుంది. పార్టీ అనుమతి లేకుండా ఎవరూ వ్యక్తిగతంగా నిర్ణయాలు తీసుకొని ఇలాంటి మధ్యవర్తిత్వాలు చేయకూడదు. ఒక వేళ చేసినా వివాదాలకు సంబంధించిన డబ్బును తమ వద్ద పెట్టుకోకూడదు. ఇది మరికొన్ని కొత్త సమస్యలకు దారితీస్తుంది.

**ఈజీమనీతో ఇక్కట్లెన్నో:** సరళీకరణతో సంపాదనకు దగ్గరదారులెన్నో ఏర్పడ్డాయి. అవినీతికి రాచమార్గాలు పరచబడ్డాయి. సంపాదనే అన్నిటికీ కొలబద్దగా మారింది. ఇటీవల కాలంలో రియల్ఎస్టేట్, ఫైనాన్స్, చిట్స్, షేర్మార్కెట్ విజృంభిస్తున్నాయి. చేతిలో చిల్లిగవ్వ లేకపోయినా నోటిమాటలతో కోట్లు సంపాదించే పద్ధతులొచ్చాయి. ముఖ్యంగా పెద్దపెద్ద నగరాలు, పట్టణాలతో పాటు వాటి చుట్టుపక్కలుండే గ్రామాలూ వీటిబారిన పడుతున్నాయి. మాయమాటలు చెప్పడం, అలవోకగా అబద్దాలు అల్లేయడం, నమ్మినవారి గొంతుకోయడం, బ్యాంకుల్ని కొల్లగొట్టడం, భాగస్తులను ముంచడం, మాఫియాలను చేరదీయడం, అధికారులను, పదవుల్లో ఉన్న రాజకీయనాయకులకు వాటాలిచ్చి లొంగదీసుకోవడం, పోలీసులతో సన్నిహిత సంబంధాలు నెరపడం వంటి అనేక జాఢ్యాలు ఈ వ్యాపారాలతో ముడివేసుకొని ఉంటాయి. ఇలాంటి అక్రమ పద్ధతుల ద్వారా సంపాదించే డబ్బునే డర్టీమనీ అనీ లేదా సున్నితంగా ఈజీమనీ అని అంటుంటారు. పేరేది పెట్టినా విలువల పతనానికి ఇది పునాది వేస్తుంది. అందరూ అలా చేస్తారా లేదా అన్న దాన్ని కన్నా ఈ తరహా వ్యాపార లక్షణాలు ఎలా ఉంటాయో అర్థం చేసుకుంటే వాటికి దూరంగా ఉండేందుకే ప్రయత్నిస్తాం.

**నైతిక విలువలు:** సమాజంలో వ్యభిచారం, అక్రమ సంబంధాలు వంటి బలహీనతలకు లోనుకావడానికి కావలసినంత అవకాశం ఉంది. ఈ వ్యవస్థ కొందరిని ఈ మురికి కూపంలోకి గుంజుతుంది. నేడు విస్తరిస్తున్న టూరిస్టు కల్చర్ 'సెక్స్ ఇండస్ట్రీ'ని కూడా ప్రోత్సహిస్తున్నది. దాని ప్రభావానికి లోనవుతున్నారు. బలాత్కరిస్తే తప్పు తప్ప పరస్పర అంగీకారం ద్వారా శారీరక సంబంధాలు పెట్టుకోవడం నేరమేమీకాదని కొందరు తమ తప్పులను కప్పెట్టుకోడానికి సూత్రీకరణలు చేస్తుంటారు. వివాహం, కుటుంబవ్యవస్థ, లైంగిక సంబంధాలు వంటి అంశాలపై మనం స్పష్టమైన అభిప్రాయాలతో ఉండాలి. ఎంగెల్స్, లెనిన్, క్లారాజట్కిన్ వంటి మార్క్సిస్టు మేధావుల రచనలు చదవాలి.

ఇక మద్యపానం, జూదం వంటి చేష్టలు కూడా హానికరమైనవే. సిగరెట్ తాగడం నిషేధం కాకపోయినా ఖర్చు దృష్ట్యా చూసినప్పుడు అది కూడా మానుకోవాల్సిందే. పరోక్షంగానైనా సరే పార్టీపై ఇలాంటి భారాలు పడకుండా చూసుకోవాల్సిన బాధ్యత మనపై ఉంది. కొంతమంది ఇలాంటి వ్యసనాలకు డబ్బులు తగలేస్తూ పార్టీకి లెవీ చెల్లించాల్సివచ్చేటప్పటికి తటపటాయిస్తుంటారు.

ప్రజా ఉద్యమాలకు, సమాజ ప్రయోజనాలకు భంగం కలిగే పద్ధతులను, విలువలను విడనాడాలి. ప్రజల మనోభావాలకు, నైతిక విలువలకు అంత: సంబంధం ఉంది. ప్రజల మనోభావాలను దృష్టిలో పెట్టుకోకుండా వ్యవహరించేవారు పార్టీకి చెరుపు చేసినవారే అవుతారు.

**అభ్యుదయ భావాలు:** మనం అర్ధఫ్యూడల్ సమాజంలో ఉన్నాం. పాతకాలపు నాటి ఆచార, వ్యవహారాలు, సంప్రదాయాలు మనలనూ వెన్నంటే వస్తాయి. కమ్యూనిస్టులు ఆకాశంలో నుండి పుట్టలేదు. ఈ సమాజంలో ఉండే అనేక లక్షణాలు మనకూ అంటుకుంటాయి. లేదా అంటిస్తారు. మూఢనమ్మకాలు, మహిళల పట్ల హీనంగా వ్యవహరించడం, కులమతప్రాంతీయ తత్వాలకు లోనుకావడం వంటి అనేక లక్షణాలు మనలను పట్టిపీడిస్తుంటాయి. తమ కుటుంబాల్లోని ఆడపిల్లల పట్ల అందరి లాగానే కొందరు కమ్యూనిస్టులు కూడా సంకుచిత దృక్పథంతో వ్యవహరిస్తుంటారు. కొందరు భర్తలు భార్యలను కొడుతుంటారు. ఇంతకన్నా అమానుషం ఇంకోటి ఉండదు. తమ కుటుంబాల్లో వివాహం వంటి శుభకార్యాలు జరుగుతున్నప్పుడు ఆర్భాటం చేయడం, అధికంగా ఖర్చు పెట్టడం ఇటీవల కాలంలో కొంచెం పెరిగిందన్న విమర్శలు వస్తున్నాయి. వీలున్నంత తక్కువ ఖర్చుతో, సాదాసీదాగా పెళ్లిళ్లు నిర్వహిస్తే కమ్యూనిస్టుల గౌరవం ఇనుమడిస్తుందే తప్ప భంగం కలగదు. ఇలాంటి ఫ్యూడల్ ధోరణులకు వ్యతిరేకంగా పోరాడకుండా మనం అభ్యుదయ వాదులం కాలేం.

**శ్రామికవర్గ దృక్పథమే ఉన్నత చైతన్యానికి చిహ్నం:** మనం కుల వ్యవస్థలో ఉన్నాం. మతాన్నయినా మార్చుకోవచ్చు కానీ కులాన్ని మార్చులేరు. పుట్టుకతో వస్తుంది. చావుతోనే అంతమవుతుంది. దీన్ని నిర్మూలించడానికి బహుశా దీర్ఘకాలం పట్టవచ్చు. అదీ కమ్యూనిస్టులు రాజ్యాధికారంలోకి వచ్చాక గొప్ప సాంస్కృతిక విప్లవం నడిపితే తప్ప దాన్ని రూపుమాపలేం. 1944లో పార్టీనిర్మాణంపై రాసిన ఒక పుస్తకంలో చంద్రరాజేశ్వరరావుగారు ఇలా పేర్కొన్నారు. "కుల అహంకారంతో డామినెంట్ కులంవారు మిగతా కులాల మీద దాడులు జరుపుతున్నప్పుడు మన పార్టీ సభ్యులు అంతా కలసి ఆ దౌర్జన్యాన్ని ఎదుర్కోవాలి. ఆ ఎదుర్కోవడంలో డామినెంట్ కులంలోని బీద రైతులు తాత్కాలికంగా మనవైపుకి రాకపోయినా, విరోధులైనా ఫరవాలేదు. అడుగునపడిఉన్న మిగతా కులాలవారిలో పలుకుబడి సంపాదించగలిగితే, పెత్తందార్ల దుశ్చేష్టలను అరికట్టుట ద్వారా ఆకులంలోని బీదలను కూడా క్రమంగా ఆకర్షించవచ్చును." కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభ దినాల నుండే కులవివక్షపై పోరాటాలు సాగుతూ వచ్చాయి. అందుకే మనరాష్ట్రంలో దళితవాడలు చాలకాలం వరకు కమ్యూనిస్టులకు పెట్టని కోటలుగా ఉండేవి. కులవివక్షకు వ్యతిరేకంగా పోరాడుతున్న అలాంటి పార్టీపై కూడా కులం దృష్టితో నీలాపనిందలు మోపడానికి కొందరు సాహసిస్తున్నారు. సుందరయ్య, చంద్రరాజేశ్వరరావు వంటి వారికి కూడా కుల గజ్జి అంటగట్టి స్వీయానందం పొందుతున్న

వారిని మనం చూస్తున్నాం. ఈ పరిస్థితుల్లో మనం మరింత చైతన్యవంతంగా ఉంటే తప్ప ఈదాడిని తట్టుకోలేం. మనం లోనుకాకుండా ఉండటమే కాదు దాన్ని తిప్పికొట్టే చైతన్యాన్ని కూడా ప్రదర్శించాలి. కమ్యూనిస్టుపార్టీలో కులాన్ని, మతాన్ని బట్టి బాధ్యతలు, ప్రమోషన్లు ఉండవు. కాని అదే సమయంలో అణగారిన కులాలు, మతాల నుండి చైతన్యవంతమైన కృషి ద్వారా నాయకత్వాన్ని, కేడర్‌ను అభివృద్ధి చేసుకోవాలి. గత దశాబ్దకాలంలో సిపియంలో అలాంటి కృషి జరుగుతోంది. దీన్ని అభినందించడానికి బదులు కొందరు పనిగట్టుకొని విమర్శలు గుప్పిస్తున్నారు. సిపియం, సిపిఐలలో ఎంతమంది ఏ కులానికి సంబంధించిన వారున్నారో లెక్కలు తీసి ప్రచురిస్తున్నారు. సహజంగానే ఇది ఆసక్తికరంగా ఉంటుంది కాబట్టి కొన్ని పత్రికలు తమ సర్క్యులేషన్ పెంచుకోడానికి కూడా దీన్ని ఒక పావుగా వాడుకుంటున్నాయి. మనకు ఆ దృష్టి లేక పోయినా బయట ప్రపంచం ఆదృష్టితోనే చూస్తుంది. దానికి మనమూ లోనవుతుంటాం. బూర్జువాపార్టీలో పదవి అంటే సంపాదనకు మార్గం. అందులో వాటాకు అందరూ పోటీ పడటం సహజం. తమకు సీటు ఇస్తేనే తమ కులం వారందరి ఓట్లూ తెస్తామని చెప్పే నాయకులున్న పార్టీల్లో ఇలాంటి లెక్కలు వేసుకోవడం సహజం. కాని ప్రజల కోసం త్యాగాలు చేస్తున్న పార్టీని కూడా ఈ బురదగుంటలోకి ఈడ్వటం విప్లవోద్యమాన్ని దెబ్బకొట్టడానికే. ఏ సమస్యనైనా కుల,మత, ప్రాంతీయ దృష్టితో చూడటం ప్రారంభిస్తే దానికి అతీతంగా ఏదీ కనపడదు. ఆ రంగుటద్దాల్లో మనమూ ఇమిడిపోతాం. కార్మిక వర్గానికి రాజ్యాధికారం అనే పంథా నుండి కుల,మత,ప్రాంతాల వారీగా రాజ్యాధికారం కావాలనుకునే 'ఐడెంటిటీ పాలిటిక్స్'కు మనలను మళ్లిస్తుంది. మన శత్రువు మన నుండి ఆశిస్తున్నది కూడా అదే. వారు కోరుకునేదీ మనం చేసేదీ ఒకటే అయితే వచ్చే ప్రమాదం ఏమిటో వేరుగా చెప్పాల్సిన అవసరం లేదు. కమ్యూనిస్టులు కూడా ఏదో ఒక కులం, మతం, ప్రాంతం నుండి వచ్చేవారే అయి ఉంటారు. కాని వారు కమ్యూనిస్టులయ్యాక ఎలా వ్యవహరిస్తున్నారన్నదే కొలబద్ద. మనం కమ్యూనిస్టులంగా వివిధ వర్గాల ప్రజలతోనే కాదు కులాలు, మతాలు, ప్రాంతాల ప్రజల మధ్య పనిచేస్తున్నామన్న మాట మరచిపోకూడదు. మనం కమ్యూనిస్టులుగా వారి మధ్య పనిచేస్తున్నాం. అంతేకాని కమ్యూనిస్టుపార్టీలో ఆయా కులాల,మతాల,

## మార్క్స్ జీవితం మనకుస్ఫూర్తిదాయకం



జెన్నీమార్క్స్ భయంకరమైన తమ కుటుంబ ఇబ్బందుల గురించి ఒక మిత్రునికి రాసిన ఉత్తరం మనలను ఎంతో ఉత్తేజపరుస్తుంది. "...ఈ స్వల్ప ఇబ్బందులు నన్ను కృంగదీశాయని మీరు భావించవద్దు. మనం సాగిస్తున్నది ఒంటరిపోరాటం కాదని నాకు తెలుసు. ముఖ్యంగా ....నా ప్రియమైన భర్త నా జీవితానికి ఆధారం ఇప్పటికీ నా పక్కనే ఉన్నారు. ....ఆయన ఎన్నడూ అతి భయంకరమైన క్షణాల్లో కూడా భవిష్యత్తు పట్ల తన విశ్వాసాన్ని కోల్పోలేదు. ఆహ్లాదకరమైన హాస్యాన్నైనా కోల్పోలేదు. నేను ఆహ్లాదంగా ఉన్నప్పుడు, మా ముద్దుబిడ్డలు తమ తల్లిచెంత చేరి కౌగిలింతల్లో మునిగి తేలుతున్నప్పుడూ చూసి ఆయన ఆనందపరవశులవుతారు..." అన్ని కష్టాల్లో కూడా సంతోషంగా ఉండటం ఎలాగో వీరి జీవితం మనకు నేర్పిస్తుంది.

ప్రాంతాల ప్రతినిధులుగా పనిచేయడం లేదు. ఒక్కసారి కమ్యూనిస్టులయ్యాక ఏకులం నుండి వచ్చినా, ఏ కులం వారి మధ్య పనిచేస్తున్నా శ్రామికవర్గ దృక్పథంతోనే వ్యవహరిస్తారు. ఈ దృక్పథాన్ని అలవరచుకొని ఆచరించడంలో లోపాలు కొనసాగుతున్నాయి. వాటిని వదిలించుకోడానికి మనతో మనం పోరాటం చేయాలి. అదే సమయంలో ఆయా సామాజిక, ప్రాంతీయ సమస్యలపై ప్రజల్ని కదిలించి నికరంగా, నిరంతరాయంగా పోరాటాలు నిర్వహించాలి. వారి ప్రజాస్వామిక కోరికలపై పనిచేయడానికి, వాటికే మనం లోనవడానికి మధ్య సంబంధాన్ని అర్థం చేసుకోలేకపోతే మనం నష్టపోతాం. ఉదాహరణకు దళిత సమస్యపై పార్టీలోని దళితులు మాత్రమే పనిచేయాలని సిపియం భావించడం లేదు. అది సరైన వైఖరి కూడా కాదు. కులాలతో నిమిత్తం లేకుండా యావత్ పార్టీ పట్టుదలతో ఒక్కతాటిపై నిలిచి కుల వివక్షకు వ్యతిరేకంగా సామాజిక న్యాయం కోసం పోరాటాలు సాగిస్తోంది. దాన్నొక రాజకీయ కర్తవ్యంగా పార్టీ భావిస్తోంది. రాష్ట్రంలో నేడు మరేపార్టీ కాని సంస్థకాని ఇలా దళిత సమస్యపై పనిచేయడం లేదు. కాని బూర్జువాపార్టీలు ఈ సమస్యనొక రాజకీయ స్టంటుగా మార్చేశాయి. ఆపార్టీల్లో వివిధ కులాలు, మతాలు, ప్రాంతాల ప్రతినిధులుగా ఆ నాయకులు వ్యవహరిస్తుంటారు. కొంతమందిని షోకేసుల్లో పెట్టి వీరు ఫలానా కులం, ఫలానా మతం నాయకులంటూ బ్రాండు తగిలించి ప్రదర్శిస్తుంటారు. ఆయా పార్టీల నేతలుగా దళితులో, ఓబీసీలో, మైనారిటీలో, మహిళలో అయినంత మాత్రానే ఆయా సామాజిక తరగతుల స్థితిగతులు బాగై, వారే రాజ్యాధినేతలుగా మారితే ఈపాటికి సామాజిక న్యాయం సాధించబడి ఉండాలి. కాని ఆచరణలో సామాజిక వివక్ష మరింత పెరుగుతోంది. కారణం ఆయా సామాజిక తరగతుల ప్రతినిధులమని చెప్పుకునేవారు ఆచరణలో బూర్జువా, భూస్వామ్యవర్గాలకు ప్రతినిధులుగా వ్యవహరిస్తుంటారు. అందుకే ఇలాంటి ఎన్నికల వ్యాపార కళలతో ఈ సమస్య పరిష్కారం కాదని తేలిపోయింది. కమ్యూనిస్టు పనిపద్ధతి దీనికి పూర్తిగా భిన్నం.

**పార్టీ వ్యాపార సంస్థా కాదు- ట్రేడ్ యూనియనూ కాదు:** మన లక్ష్యసాధన నుండి దృష్టి మళ్లించేందుకు కొన్ని కుల సంఘాలు, పత్రికలు, విదేశీనిధులందుకునే కొన్ని స్వచ్ఛంద సంస్థలు పనిగట్టుకొని కృషి చేస్తున్నాయి. ఏ కులం వారు ఏపార్టీలో ఎందరున్నారు, ఏ కులం వారు ఏపదవుల్లో ఉన్నారు వగైరా వివరాలతో చర్చలు చేస్తుంటారు. ఆ ట్రాప్‌లో అక్కడో ఇక్కడో మనవారు కూడా కొందరు పడిపోతుంటారు. ట్రేడ్‌యూనియన్లలో పనిగంటలు, న్యాయమైన వేతనం, బోనస్, ఉద్యోగగ్యారంటీ, మంచి పనిపరిస్థితుల కోసం పోరాటాలు చేస్తుంటాం. కాబట్టి అవే పద్ధతులు మనపార్టీలోనూ ప్రవేశపెట్టాలని ఎవరైనా కోరితే ఎలా ఉంటుంది? కార్యకర్తలను కూడా సంపాదనాసాధనాలుగా చూసే పార్టీల్లో వలెనే కమ్యూనిస్టుపార్టీలో కూడా కార్యకర్తల చేత గొడ్డు చాకిరీ చేయించుకుంటారని విమర్శలు చేసే వారి పట్ల ఎలా

> **"పార్టీని ఒక పథకం ప్రకారం దెబ్బకొట్టేందుకు నేడు జాతీయస్థాయిలోనే కార్పోరేట్ మీడియా ప్రయత్నిస్తోంది. ఈ మీడియాలో ఏదొచ్చినా నమ్మి అభిప్రాయాలు ఏర్పాటు చేసుకోవడం తప్పు. వాస్తవసంఘటనలను అర్థం చేసుకోడానికి, శాస్త్రీయమైన విశ్లేషణలకు పార్టీ పత్రికలను విధిగా చదవాలి."**

వ్యవహరించాలి? ఇరవైనాలుగ్గంటలూ ప్రజల కోసమే అంకితమై పనిచేసే హోల్‌టైం కార్యకర్తలకు, బూర్జువాపార్టీల్లో సంపాదనే ధ్యేయంగా పనిచేసే నాయకులకూ తేడా లేదా? బూర్జువా ఆలోచనా విధానం ప్రకారం రాజకీయపార్టీలు కార్పోరేట్ సంస్థలుగా మారిపోతున్నాయి. వారు కమ్యూనిస్టులనూ అదే కోణం నుండి చూస్తున్నారు. పార్టీ కార్యకర్తలకు జీతాలెలా ఉంటాయి, సౌకర్యాలేముంటాయి, సెలవులుంటాయా వగైరా వివరాలు ఆసక్తిగా అడిగేవారూ ఉంటారు. ట్రేడ్ యూనియన్ చైతన్యానికి, సోషలిస్టు విప్లవ చైతన్యానికి మధ్య తేడాను లెనిన్ "ఏం చేయాలి" అనే తన ప్రసిద్ధ గ్రంథంలో వివరించారు. ట్రేడ్‌యూనియన్ చైతన్యం బూర్జువా చైతన్యంలో భాగమని ఆయన చెప్పారు. బూర్జువా చైతన్యంతో పోల్చుకుంటే ఫ్యూడల్ చైతన్యం ఇంకా వెనుకబడింది. కుల, మతాలు ఫ్యూడల్ వ్యవస్థ అవశేషాలన్న విషయం మనకు తెలుసు. అగ్రకుల దురంహకారం దీనికి ప్రతిబింబమే. దీన్ని ఫ్యూడల్ చైతన్యంతోనో, బూర్జువా దృక్పథంతోనో ఎదుర్కోలేం. కుల, మతం, జాతి, ప్రాంతం వంటి సమస్యలను మార్క్సిస్టు దృక్పథంతో అర్థం చేసుకోడానికి బదులుగా మార్క్సిజాన్నే కుల, మతాల చైతన్యంతో కొలవడం ఎక్కడకు దారితీస్తుంది? జాతీయోద్యమంలో ప్రాణాలకు తెగించి పోరాడిన కమ్యూనిస్టులెన్నడూ జాతీయ దురంహకారానికి లోనుకాలేదు. సంకుచితంగానూ వ్యవహరించలేదు. ఎప్పుడూ అంతర్జాతీయతనే ఆలంబనగా చేసుకున్నారు. మావో అన్నట్లుగా "కమ్యూనిస్టుకు విశాలమైన మనస్సు ఉండాలి. అతను దీక్షతోను, చురుగ్గానూ పనిచేసేవాడుగా ఉండాలి." దీన్ని అర్థం చేసుకోవడంలో విఫలమైతే మనమూ అదే గాట్లో పడిపోతాం.

**సంసారపక్షంగా సమస్యలు పరిష్కారం కావు:** కొంతమంది పార్టీని సంసారపక్షంగా నడిపిద్దామనుకుంటారు. తామొక కుటుంబ పెద్దలాగా కష్టాల్లో, సుఖాల్లో చేదోడువాదోడుగా ఉంటారు. అంతవరకు మంచిదే. కాని అదే పెద్ద, తప్పులపట్ల ఉదారంగా ఉంటారు. తండ్రి పిల్లల పట్ల వ్యవహరించినట్లుగా కొన్ని సందర్భాలలో నిరంకుశంగానూ వ్యవహరిస్తారు. సమిష్టి పనివిధానం ఉండదు. అంతర్గత ప్రజాస్వామ్యమూ ఉండదు. అంతా ఇంటి పెద్ద చుట్టూ తిరుగుతుంటుంది. ఇది కేంద్రీకృత ప్రజాస్వామ్య స్ఫూర్తిని దెబ్బతీస్తుంది. కార్యకర్తల చొరవను అడ్డుకుంటుంది. ఒక రాజకీయపార్టీని సంసార పక్షంగా నడపాలనుకోవడం ఫ్యూడల్ దృక్పథం అవుతుంది. అది పార్టీ పెరుగుదలను ఆటంక పరుస్తుంది. ఇలాంటి ధోరణులను దృష్టిలో ఉంచుకొని లీషావ్‌చీ ఇలా అన్నారు. "పార్టీ అనేది సంసారపక్షమూ కాదు వ్యాపార సంస్థ అంతకన్నా కాదు. ఇది ఒక సిద్ధాంతం, రాజకీయ కార్యక్రమంపై ఆధారపడిన విప్లవపార్టీ"

**క్రమశిక్షణ:** ఇది పార్టీకి ఊపిరి. దీన్ని దెబ్బతీయడానికే శత్రువు నిరంతరం కష్టపడుతుంటాడు. పార్టీలో ఒకసారి అరాచకాన్ని ప్రవేశపెట్టగలిగితే మన జీవనాడిని దెబ్బతీసినట్లే. అందుకే వారు క్రమశిక్షణకు నిరంకుశత్వానికి మధ్య గీతను చెరిపేయాలని చూస్తుంటారు. తాము తమ పార్టీల్లో నిరంకుశంగా వ్యవహరిస్తూ కమ్యూనిస్టుపార్టీలో స్వేచ్ఛ ఉండదని ప్రచారం చేస్తుంటారు. నిర్ణయాలు చేసే దశలో, నాయకత్వాన్ని ఎన్నుకునే దశలో ఏ పార్టీలో కన్నా కమ్యూనిస్టుపార్టీలోనే ఎక్కువ స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం ఉంది. కాని ఒకసారి నిర్ణయాలు జరిగాక దాన్ని తూ.చ. తప్పకుండా అమలు చేయడమే కమ్యూనిస్టు క్రమశిక్షణ. దాన్ని ఉల్లంఘించే ఎలాంటి చర్యలనూ పార్టీ సహించదు. ఇది పార్టీలోని అన్ని రకాల శ్రేణులకూ వర్తిస్తుంది. రాజకీయంగా భిన్నాభిప్రాయాలున్నవారు, ఎత్తుగడలతో విభేదించేవారు పార్టీ నిర్ణయాలను మిగతావారందరి కన్నా మరింత గట్టిగా అమలు చేయాలి. అదే క్రమశిక్షణకు గీటురాయి. దీని వల్ల మరో ప్రయోజనం కూడా ఉంది. ఒక నిర్ణయం తప్పో ఒప్పో తేల్చుకోవాలంటే దాన్ని అమలు చేస్తేనే సాధ్యమవుతుంది. అందుకే దాని అమల్లో ఇతరుల కన్నా భిన్నాభిప్రాయలున్నవారికి మరింత ఎక్కువ ఆసక్తి ఉండాలి. దీనికి బదులుగా దాన్ని దెబ్బకొట్టే పద్ధతులు అనుసరిస్తే అది సహించరాని నేరం అవుతుంది.

**ఫ్యాక్షనిజం కేన్సర్ లాంటిది:** పార్టీలోనే కొంతమంది ఒక ముఠాగా వ్యవహరించడాన్నే ఫ్యాక్షనిజం అంటున్నాం. పార్టీకి ప్రాణప్రదమైన క్రమశిక్షణను ఉల్లంఘించడాన్ని పార్టీ ఏమాత్రం అనుమతించదు. వ్యక్తిగా క్రమశిక్షణను ఉల్లంఘించడం వేరు. కొందరు ఒక ముఠాగా ఏర్పడి పార్టీ ఐక్యతను దెబ్బతీయడం వేరు. కమిటీ సమావేశాలతో నిమిత్తం లేకుండా వీరు వేరే మీటింగులు పెట్టుకొని నిర్ణయాలు తీసుకుంటారు. వాటి ప్రకారమే కమిటీ మీటింగుల్లోనూ నడుచుకుంటారు. విడిగా మీటింగులు పెట్టుకోకపోయినా వస్తుగతదృక్పథంతో స్వంత అభిప్రాయాలు చెప్పడం కాకుండా, తమ ముఠా నాయకుణ్ని అనుసరించి కమిటీ సమావేశాల్లో అభిప్రాయాలు చెప్పడం, ఎదుటివారిపై వ్యక్తిగత కక్షతో దాడులు చేయడం, లోపల జరిగిన విషయాలను బయట తమను సమర్థించేవారికి లీకు చేయడం లాంటి ధోరణులు కూడా ఆఖరికి అక్కడకే దారితీస్తాయి.

పార్టీలో బాధ్యతలు, ప్రమోషన్లు వారి వారి కృషిని బట్టి, పార్టీ అభివృద్ధికి వారు దోహదం చేసేతీరును బట్టి వస్తాయి. పార్టీలో ఎవరూ పదవుల్ని కోరుకోరు. కోరుకుంటే అవి వచ్చేవీ కావు. వాటి కోసం తాపత్రయపడటం, ఇతరుల సహాయాన్ని అర్థించడం తప్పు. దీనికోసం ముఠాలు కట్టడం ఇంకా తప్పు.

ఫాక్షనిజం కాన్సర్ కన్నా ప్రమాదకరమైంది. ఈ ధోరణులను ఆదిలోనే అరికట్టాలి. ముదిరే దాకా సహించకూడదు. ఇలాంటి ధోరణుల పట్ల ఉదారంగా వ్యవహరించడమంటే మనం కూర్చున్న కొమ్మను మనమే నరుక్కుంటున్నట్లు.

**మీడియా స్వభావాన్ని అర్థం చేసుకోవాలి:** వర్తమాన సమాజంలో మీడియా ప్రాముఖ్యత పెరిగింది. ముఖ్యంగా ఇరవైనాలుగ్గంటల వార్తా ఛానళ్లు వచ్చాక ఆయా పార్టీల, వ్యక్తుల, సంస్థల

ఆంతరంగిక విషయాలకు ప్రాధాన్యత పెరిగింది. మీడియా మధ్యపోటీ సెన్సేషనల్ వార్తలకు దారితీస్తుంది. పనిగట్టుకొని ఉన్నవీలేనివీ కల్పించి ఏం జరగబోతుందో అన్న మీమాంసను సృష్టిస్తుంటారు. దీనికి మనపార్టీని కూడా వాడుకోవాలని చూస్తుంటారు. మనం క్యాజువల్‌గా మాట్లాడుకునే విషయాలు కూడా వార్తలవుతుంటాయి. లోపల ఇలా జరిగిందంటూ గాలి వార్తలు పోగేస్తుంటారు. పార్టీ ఆంతరంగిక సమస్యలను పరిష్కరించుకోడానికి కొందరు మీడియాను ఆశ్రయిస్తుంటారు. మరికొందరు లోపల విషయాలను ఉద్దేశపూర్వకంగానే లీకు చేస్తుంటారు. ఇవి పార్టీకి హాని చేసే చర్యలు. వీటిని పార్టీ సహించదు. కొంతమంది మీడియాలో కనిపించేందుకు తెగ తాపత్రయపడుతుంటారు. అది కొన్ని సందర్భాలలో అనర్థాలకు దారితీస్తుంది. మీడియాను పార్టీ, ప్రజా ఉద్యమాలకు ఉపయోగించుకోవడం వేరు. స్వంత ప్రచారంపై మోజుతో మీడియా ట్రాప్‌లో పడటం వేరు. మీడియాను పార్టీ ప్రచారానికి ఉపయోగించుకోవడంతో పాటు దాని వర్గ స్వభావాన్ని కూడా మనం అర్థం చేసుకోవాలి. వాస్తవసంఘటనలను అర్థం చేసుకోడానికి, శాస్త్రీయమైన విశ్లేషణలకు పార్టీ పత్రికలను విధిగా చదవాలి.

**ఐక్యత కోసమే అంతర్గత పోరాటం:** వర్గపోరాటాల ద్వారా సమాజం మారుతుందన్నది శాస్త్రం. నొప్పులు పడకుండా తల్లి కూడా బిడ్డను కనలేదు. అలాంటప్పుడు పార్టీలోనూ మంచి మార్పు రావాలంటే దానికోసం పోరాటం సాగాలి. అయితే శత్రువుపై పోరాడినట్లుగా వర్గద్వేషంతో ఉండదు. సైద్ధాంతిక, రాజకీయ పోరాటాల రూపంలో ఉంటుంది. చర్చలు, సంప్రదింపులు, నిర్ణయాలు, అమలు, సమీక్ష- దీనికి అనుసరించే పద్ధతులు. ఒక్క మాటలో చెప్పాలంటే పార్టీలో ఐక్యతను పెంపొందించే సాధనమే అంతరంగిక పోరాటం. సరైన పద్ధతుల్లో పార్టీలో అంతర్గత పోరాటం నిర్వహించాలని లీషావ్‌చీ చెప్పారు. దానికోసం ఆయన మరో పుస్తకాన్ని రాశారు.(అందులోని కొన్ని అంశాలను ఇదే సంచికలో విడిగా ఇచ్చారు) పార్టీలో అంతర్గత పోరాటం ఎలా నిర్వహించాలో సిపియం నిబంధనావళిలో స్పష్టమైన ఆదేశాలున్నాయి. సూత్రబద్ధమైన విషయాలు అంటే సైద్ధాంతిక, రాజకీయ, నిర్మాణ సమస్యలను కమిటీ సమావేశాల్లో చర్చించాలి. అంతేకాని ఆ సమయాన్ని వ్యక్తిగత ఆరోపణలు చేయడానికి, కక్షలు తీర్చుకోడానికి, స్వంత సమస్యలు చెప్పుకోడానికి దుర్వినియోగం చేయరాదు. దాన్ని పార్టీ అనుమతించదు.

అనుమానాలు, అపోహలపై ఆధారపడి ఏ నిర్ణయానికీ రాకూడదన్నది ప్రాథమిక సూత్రం. ముందు మనకు తెలిసిన సమాచారాన్ని పార్టీ బాధ్యుల దృష్టికి తీసుకుపోవాలి. వారు దానిపై శ్రద్ధ తీసుకోకపోతే పై కమిటీ దృష్టికి తీసుకుపోవాలి. వారు ప్రాథమికంగా విచారించి అనుమానాలకు ప్రాతిపదిక ఉందని భావిస్తే సమగ్ర విచారణకు ఆదేశిస్తారు. దానిలో నిగ్గుతేలితే తప్పు స్వభావాన్ని బట్టి చర్యలుంటాయి. కొంతమంది పార్టీకి ఫిర్యాదు చేయకుండా మీడియాకు లీకు చేయడం, బజారులో బహిరంగంగా వ్యాఖ్యానాలు చేయడం వంటి తప్పుడు పద్ధతులకు పాల్పడుతుంటారు. వారు పార్టీని బాగుపరిచే కన్నా హాని చేస్తున్నామన్న విషయాన్ని మరచిపోతుంటారు. వ్యక్తులపై కక్ష తీర్చుకోడానికిచ్చే ప్రాధాన్యతను పార్టీ ప్రయోజనాలకు ఇవ్వరు.

కొంతమంది తప్పులపై పరస్పర రాజీ వైఖరి ప్రదర్శిస్తుంటారు. ఇది ఒక రకంగా మూజీవాణీ ఒప్పందంలాగా అమలవుతుంది. దీన్ని ఉల్లంఘించి ఎవరైనా తమ తప్పుల్ని ఎత్తిచూపితే అప్పుడు ఎదుటివారి గతాన్ని తవ్వడం ప్రారంభిస్తారు. స్వంత అజెండా ప్రాతిపదికగా ఈ పోరాటం సాగుతుంది.

తప్పుల్ని గుర్తించడమే కాదు వాటికి వ్యతిరేకంగా పోరాడే పద్ధతులను గురించి కూడా నేర్చుకోవాలి. కొంతమంది పార్టీలో జరిగే తప్పులకు, శత్రువుకీ మధ్య తేడా గుర్తించరు. పార్టీలోని తప్పుల పట్ల శత్రువైఖరి తీసుకుంటారు. మరో పక్క పార్టీలోని మిత్రులతో తేల్చుకోవాల్సిన విషయాలకు శత్రువుల తోడ్పాటు తీసుకుంటారు. శత్రువులకు సహకరిస్తుంటారు. ఇది మరింత ప్రమాదకరం. ఇలాంటి విద్రోహచర్యల్ని పార్టీ సహించదు.

మరికొంతమంది ఎదురుగా తప్పులు జరుగుతున్నా పట్టీపట్టనట్లుగా మాకెందుకులే అన్నట్లుగా నిర్లిప్తంగా వ్యవహరిస్తుంటారు. వివాదాల్లో ఇరుక్కుంటే దెబ్బతింటామని భయపడుతుంటారు. ఇది కూడా ఒక రకమైన అవకాశవాదమే.

పార్టీలో కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని పటిష్టంగా అమలు చేయడం, సమిష్టి నాయకత్వాన్ని, పనిపద్ధతుల్ని అభివృద్ధి చేయడం ద్వారా ఇలాంటి అనేక పెడధోరణులను ఎదుర్కోవచ్చని పార్టీ పలు నిర్మాణ నివేదికల్లో స్పష్టం చేసింది. పంట ఏపుగా పెరగాలంటే కలుపు మొక్కల్ని నిర్మూలించాలి. అలాగే పార్టీ ఆరోగ్యంగా ఎదగాలంటే తప్పుడుధోరణులను వదిలించుకోవాలి. ఆంతరంగిక పోరాటం ద్వారా వాటిని సరిదిద్దుకోలేకపోతే దానికి మూలమైన వ్యక్తులపైనే చర్యలు తీసుకోవాల్సి ఉంటుంది. లోపల తీసుకునే చర్యల ద్వారా సరిదిద్దుకోకపోతే బయటకు పంపడమే పరిష్కారమవుతుంది. తద్వారానే పార్టీ రక్షించబడుతుంది.

పార్టీలో అనేక రకాల లోపాల గురించి చర్చించుకుంటున్నామంటే పార్టీ అంతా లోపాలమయం అని ఎవరైనా అపార్థం చేసుకుంటే అంతకన్నా తప్పు మరోటి ఉండదు. లోపాలు ఏ స్థాయిలో ఉన్నా, ఎంత స్వల్పస్థాయిలో ఉన్నా సరిదిద్దుకోవడం ద్వారానే పార్టీ నిర్మాణాన్ని విస్తరింపచేసుకోగలం. పార్టీ నిర్మాణానికి పదునుపెట్టుకోవడం తద్వారా ప్రజా పునాదిని విస్తరించుకోవడమే మన నిర్మాణ చర్చల సారం. అందులో భాగంగానే తప్పొప్పులను సమీక్షించుకుంటాం.

**స్వయంకృషితో దిద్దుబాటు:** మన లోపాలను మనంతట మనంగా అధిగమించాలంటే దానికి స్వయంసాధన అవసరమని లీషావ్‌చీ నొక్కి చెప్పారు. మన లోపాలను మనంతట మనమ అధిగమించలేకపోతే దానికి పై నాయకత్వం లేదా తన శాఖ లేదా కమిటీ సహకారం తీసుకోవాలి. లోపాలు ఒప్పుకుంటే పలచన అవుతామన్న భావం అనేకమందిలో ఉంది. ఇది తప్పు. నిప్పును జేబులో పెట్టుకొని తిరగలేం. అలాగే తప్పుల్ని కనపడకుండా దాచుకుంటామనుకోవడం కూడా భ్రమే. పిల్లి పాలు తాగుతూ తననెవ్వరూ చూడలేదనుకుందన్నట్లుగానే ఉంటుందిదీను. ఇతరులను విమర్శించడం తేలిక. మనం ఇతరుల తప్పుల్ని విమర్శించాలంటే అందుకు అవసరమైన అర్హత కూడా సాధించాలి. తప్పులకు గురికాకుండా చూసుకోవడం, పొరపాట్లు చేస్తే ఆత్మవిమర్శ చేసుకొని సరిదిద్దుకోవడం ద్వారా ఇతరులకు ఆదర్శంగా ఉంటాం. అప్పుడు దాన్నే ఇతరులు కూడా అనుసరించి తప్పులు చేయకుండా ఉంటారు. ఇది కూడా ఒక రకమైన విమర్శనా పద్ధతే. విమర్శలు చేయడానికన్నా ఆత్మవిమర్శ చేసుకోడానికి ఎక్కువ ధైర్యం, సాహసం కావాలి. తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు అన్నారు పెద్దలు. చేసిన తప్పులు దిద్దుకుంటూ ఉండటమేనా మన పని అని అడిగే వాళ్లూ ఉన్నారు. కమ్యూనిస్టులు ఏం చేస్తున్నారంటే చేసిన తప్పులు దిద్దుకుంటున్నారని వ్యంగంగా విమర్శించే వ్యాఖ్యాతలను చూసి భయపడాల్సిన అవసరం

(తరువాయి 27వ పేజీలో)

# సిద్ధాంత ఆయుధాన్ని నిత్యం సానబట్టాలి!

ఎవరూ మార్క్సిస్టు పండితులైనాకే కమ్యూనిస్టు పార్టీలో చేరతారని భావించలేము. వారు తమ కుటుంబ సామాజిక నేపథ్యపు 'వర్గ వాసనలతో' కూడా వస్తారు. వారు గతంలో ఏదేని రాజకీయ పార్టీలో పనిచేసి వుంటే ఆ పార్టీ 'సంస్కృతి'తోను రావచ్చు. ఇలాంటి వారందరికీ పార్టీ తన సిద్ధాంత శిక్షణ ఇవ్వాలి. మౌలిక సిద్ధాంత సూత్రీకరణలతో పాటు, సమకాలీన పరిణామాలు, సమస్యలు, వాటి పరిష్కార మార్గాలు కూడా బోధించటం అవసరం. పార్టీ సభ్యుల బాధ్యతలు, పాటించ వలసిన విధివిధానాలు, విలువలు కూడా ఈ శిక్షణ ద్వారా చెప్పాల్సి వుంటుంది

డా॥ వై. రాధా కృష్ణమూర్తి

ఈ విశ్వ రహస్యాన్ని అర్థం చేసుకోవడానికి వేల సంవత్సరాల చరిత్రలో అనేక మంది మేధావులూ, తత్వవేత్తలూ ప్రయత్నించారు, వ్యాఖ్యానించారు, సూత్రీకరించారు. డెమోక్రటీస్, సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్ వంటి గ్రీకు తత్వవేత్తల నుండి కాంట్, బెర్క్లీ వంటి యూరోపియన్ పండితులు, టావో, కన్‌ఫ్యూషియస్ లాంటి చైనా తత్వవేత్తలవరకు అనేక రకాల భాష్యాలు చెప్పారు. భారతదేశంలోనూ ఆ ప్రయత్నాలు తక్కువేం జరగలేదు. ఉపనిషద్ ఋషులు, చార్వాకులు, బౌద్ధులు, జైనులు, న్యాయ వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వ, ఉత్తర మీమాంసలుగా చెప్పబడే షడ్‌దర్శనకారులూ ఆసక్తికరమైన ప్రతిపాదనలు చేశారు. ప్రస్థాన త్రయమైన ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీతకు ఆదిశంకరులు, రామానుజుడు, మధ్వాచార్యులు భిన్నమైన వ్యాఖ్యల ద్వారా, భాష్యాల ద్వారా చేసిన అసామాన్యమైన పండిత ప్రతిపాదనలూ వున్నాయి. ఇందులో నిరీశ్వర వాదనలు కొన్ని, సేశ్వరం మరికొన్ని, అంటే కొన్ని భౌతిక వాదనలు మరికొన్ని భావ వాదనలు – కొన్ని కలగలుపుగాను – వున్నాయి.

ఇంతవరకు తత్వవేత్తలందరూ, ప్రకృతికీ, సమాజానికీ భాష్యం చెప్పడానికి ప్రయత్నించారు. మార్క్స్, ఏంగెల్స్‌లు మాత్రం సమాజాన్ని మార్చడానికి మార్గం అన్వేషించారు.

అందుకుగాను మార్క్స్ ఒక సుదీర్ఘమైన తపస్సులాంటి అధ్యయనం చేశారు. 18 సంవత్సరాలు బ్రిటిష్ లైబ్రరీని అహోరాత్రులూ మథించారు. మన పురాణాల్లోని అగస్త్యుడు సప్త సముద్రాలను ఔపాసన పట్టినట్లు – అప్పటి వరకు వచ్చిన అన్ని శాఖల సాహిత్యం చదివి విశ్లేషించారు. ఆయనకు ఫ్రెడరిక్ ఏంగిల్స్ తోడు దొరికాడు. వీరిద్దరు అపూర్వ మిత్రులు. అసమాన మేధావులు. ఏంగిల్స్ వినయంగా తాను మార్క్స్‌కు సెకండ్ ఫిడిల్ (వంత పాటగాని) గా చెప్పుకున్నా ఆయన సొంత కృషి తక్కువేం కాదు. మార్క్సిజంగా చెప్పబడుతున్నది వారిద్దరి సమిష్టి కృషి, ఆలోచనల ఫలితం.

వారికి సమకాలీనుడు చార్లెస్ డార్విన్. ఆయన జీవ పరిణామాన్ని విశ్లేషిస్తూ రాసిన మహత్తర సిద్ధాంతం "అరిజన్ ఆఫ్ ది స్పీసీస్" మార్క్స్–ఏంగెల్స్‌లకు పనికి వచ్చింది. ఆర్థిక శాస్త్రవేత్తలకు ఇంగ్లాండ్ ప్రసిద్ధి. "వెల్త్ ఆఫ్ నేషన్స్" గ్రంథం రాసిన ఆడమ్ స్మిత్‌ను ఆద్యుడుగా చెబుతారు. అలాగే రికార్డో వగైరా. అనేక ప్రసిద్ధ తత్వవేత్తలకు జర్మనీ జన్మస్థానం. వారిలో హెగెల్ ప్రతిపాదిత డయలెక్టిక్స్ యువ మార్క్స్‌కు ప్రేరణ ఇచ్చింది. సామ్యవాద భావనలకు (1776 ఫ్రెంచ్ విప్లవం నుండి) ఫ్రాన్స్ కేంద్రం. వీటన్నింటినీ కాసి వడపోశారు మార్క్స్–ఏంగెల్స్. అప్పటికి వారు 30 సంవత్సరాలకు కాస్త అటూ ఇటూ వయస్సులో వున్నారు. అయితేనేం. యావత్ ప్రపంచాన్నే దిగ్భ్రాంతి కలిగించిన – ఒక కుదుపు కుదిపిన – 'కమ్యూనిస్టు మానిఫెస్టో' 1848లో ప్రకటించారు. అదొక ప్రణాళిక. ఒక సమరభేరి – అపూర్వ విప్లవ కావ్యం. వెంటనే సమకాలీన పాశ్చాత్య దేశాలలోని పెట్టుబడిదారీ విధానాన్ని శల్య పరీక్ష చేశారు. దాని సారాన్ని, క్రౌర్యాన్ని, దుర్మార్గాన్ని, దోపిడీని నిశితంగా విశ్లేషిస్తూ, ఎండగడుతూ 1861లో 'పెట్టుబడి' (కాపిటల్) గ్రంథంగా అందించారు.

ఇవీ, వారి ఇతర గ్రంథాలూ కలిసి ప్రకృతికీ, సమాజానికీ, వాటి గమనానికి నూతన భాష్యం చెప్పాయి. రేఖామాత్రంగానైనా భవిష్యత్ దర్శనం చేశాయి. శ్రామిక జనావళికి వేగుచుక్కలయ్యాయి. మార్గదర్శకాలయ్యాయి. సైద్ధాంతిక ఆయుధాలయ్యాయి.

ఈ విశ్వానికి మూలం పదార్థం. ఇది జడం కాదు. నిత్య చలన శీలం. పరిణామ శీలం. అంతర్ బాహిర్ చలనం దాని స్వభావం. ఈ చలనానికి కొన్ని సాధారణ సూత్రాలు



రచయిత భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) రాష్ట్ర కమిటీ సభ్యులు

> "మార్క్సిజం యొక్క సర్వోత్కృష్టమైన శాస్త్రీయతను విస్మరించి దాని విప్లవకర లక్ష ణాన్ని మాత్రమే నొక్కి చెప్పడం వామపక్ష దుస్సాహసానికి జారిపోయేదానికి దారితీస్తుంది. దానికి భిన్నంగా మార్క్సిజంయొక్క శాస్త్రీయతను నొక్కి చెప్పి దాని విప్లవసారాన్ని విస్మరించడం సంస్మరణవాద ఊబిలోనికి దిగజారడానికి దారితీస్తుంది" అని చెబుతూ ఎడా, పెడ ధోరణు లు ఎట్లా మనలను విప్లవ పంథా నుండి ప్రక్కదారులు పట్టిస్తాయో లెనిన్ వివరిస్తారు.

వర్తిస్తాయి. ఇది ఆది మధ్యాంత రహితం - అనంతం - శాశ్వతం - అతీతమైన శక్తి ఏదీ దీనిని సృజించలేదు. నడిపించడమూ లేదు. ఇది స్వయం సిద్ధం.

నిర్జీవ పదార్థం నుండే 'జీవం' పరిణామం చెందింది. ఏకకణ ప్రాథమిక జీవరూపం నుండి వందల వేల సంవత్సరాల కాలగమనంలో ప్రకృతి శక్తుల ప్రభావంతో - జీవ పరిణామ క్రమం కొనసాగింది. అనేక దశలు దాటి ఆధునిక మానవుడి వరకు వచ్చింది. మిగతా జంతు జాలం నుండి మాన వుడిని ఉన్నతంగా తీర్చిదిద్దేది అతని మెదడు (బ్రెయిన్). భౌతిక జీవనావసరాల కోసం మనిషి ప్రకృతితో పోరాటం చేస్తూ వస్తున్నాడు. శరీర శ్రమకు మెదడు తోడ్పడుతుంది. తన శ్రమను తేలికపర్చుకోవడానికి క్రమేపి అనేక పనిముట్లు (ఇన్‌స్ట్రుమెంట్స్) తయారు చేసుకుంటూ వచ్చాడు. అవి తన ఆహార, ఇతర అవసరాలకు 'ఉత్పత్తి'కి తోడ్పడ్డాయి.

మానవులు సంఘజీవులు. వారు సమాజంలో అంతర్భాగాలు. శ్రమ, పోరాటాల ఫలితంగా సమాజం మారుతూ వచ్చింది. అభి వృద్ధి చెందుతూ వచ్చింది. అనేక దశలు - 'వ్యవస్థ'ల రూపంగా గడిచాయి. ప్రస్తుతం వున్నది పెట్టుబడిదారీ సమాజం - వ్యవస్థ.

ఈ సమాజంలోని పౌరులందరికీ సమాన అవకాశాలు హక్కులు లేవు. అత్యధిక సంఖ్యాకులు తమ శ్రమతో బ్రతుకులీడుస్తున్నారు. వీరి శ్రమ ఫలితాన్ని అప్పనంగా అనుభవించే అల్ప సంఖ్యాక వర్గం ఉంది. ఇదొక శ్రమ దోపిడీ. దీనివెనుక దాగి వున్న రహస్యం కార్మికు లు చేసే ఉత్పత్తులకున్న అదనపు విలువ (సర్‌ప్లస్ వాల్యూ). అర్థశాస్త్రంలో ఇదొక విలక్షణ అంశం. దాన్ని తన నిశిత పరిశోధనలతో వెలికితీసిన ప్రత్యేకత కారల్ మార్క్సుది.

అణచివేతతోనే దోపిడీ సాధ్యం. అందుకు అవసరమైన సాధనాలన్నీ దోపిడీ వర్గం చేతిలో వుంచుకుంది. తద్వారా ఆ వర్గ ఆధిపత్యం, అధికారం కొనసాగుతాయి. సహ నం ఎల్లకాలం సాధ్యం కాదు. చైతన్యం పెరుగు తోన్న శ్రామిక వర్గం దీన్ని ఎదిరించి పోరాడక తప్పదు. ఇది కేవలం వ్యక్తుల మధ్య ఘర్షణ కాదు. విభిన్న, విరుద్ధ ప్రయోజనాలు గల రెండు వర్గాల మధ్య జరిగే పోరాటం. ఈ పోరాటానికి మార్గదర్శి కార్మిక వర్గ పార్టీ. కమ్యూనిస్టు పార్టీ. ఇది ఆ పార్టీ యొక్క చారిత్రక కర్తవ్యం.

ఈ కర్తవ్య నిర్వహణ ఒక పథకం లేకుండా సాగదు. ఆ పథకమే పార్టీ కార్యక్రమం (పార్టీ ప్రోగ్రాం). దాని సారాంశమే వ్యూహం (స్ట్రాటజీ). ఈ వ్యూహ సాఫల్యం ఒక సుదీర్ఘ పోరాటం ద్వారానే సాధ్యం. ఏ పోరాటానికైనా కొన్ని తాత్కాలిక 'ఎత్తుగడలు' (టాక్టిక్స్) ముఖ్యం. (ఎత్తుగడలకు, అవకాశవాదానికీ తేడా వున్నది) మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా ఎత్తు గడలు మారకపోతే పోరాటం సమర్ధవంతంగా సాగదు. సత్ఫలితాలు రావు.

పోరాటాలన్నీ ఒకే విధంగా వుండ వు. వుండనక్కరలేదు. ఏ యుద్ధానికైనా యుద్ధ తంత్రం వుంటుంది. పార్లమెంటరీ, పార్లమెంటే తర పోరాటాల నుండి సాయుధ పోరాటం వరకు అందులో భాగాలే. ఆయా నిర్దిష్ట పరిస్థి తుల్లో ఇరువర్గాల బలాబలాల అంచనాలను బట్టి ఆ పోరాట రూపాలు ఎంచుకోవాలి, మలచుకోవాలి.

దీని అంతిమ లక్ష్యం శ్రామికవర్గ విముక్తి. అందరికీ సమాన అవకాశాలు, హక్కు లు కల్పించడం. శ్రమ దోపిడికీ, అణచివేతకూ, ఆధిపత్యానికీ అవకాశం లేని సమాజాన్ని, న్యాయబద్ధమైన మానవీయమైన వ్యవస్థను స్థాపించడం. దానినే ప్రాథమిక దశలో సోష లిజం అంటున్నాం. ఆ సామాజిక వ్యవస్థను సాధించడమే కమ్యూనిస్టు పార్టీ లక్ష్యం. ఈ సాధన అంత తేలిక కాదు. సుదీర్ఘ ఘర్షణ, పోరాటం అవసరం అవుతుంది. విభిన్న దశల్లో భిన్న పోరాట మార్గాలు అవలంబించవలసి వస్తుంది. ఏ పోరాటానికైనా 'సైన్యం' అవసరం. సైన్యానికి శిక్షణ అవసరం. పార్టీకి తన సభ్యులు, కార్యకర్తలే సైన్యం. సైన్యానికి 'ఆయుధం' కావాలి. ప్రస్తుతం ఆ ఆయుధం సిద్ధాంతం - సిద్ధాంత అవగాహన.

వివిధ స్థాయిల్లో నిర్వహించే రాజ కీయ తరగతుల ద్వారా ఆ సైద్ధాంతిక శిక్షణ లభ్యమవుతుంది. "సిద్ధాంతం లేని ఆచరణ గుడ్డిది. ఆచరణకు రాని సిద్ధాంతం కుంటిది" అన్నది జగమెరిగిన సూక్తి. ఆచరణలో అనుభ వాలు వస్తాయి. అది సిద్ధాంతాన్ని మెరుగు పరచుకోవడానికి పనికి వస్తాయి. కనుక ఆచరణ, సిద్ధాంతం పరస్పర పూరకం.

మన మహోపాధ్యాయులే చెప్పారు. 'మార్క్సిజం ఒక మూఢనమ్మకం కాదు. కార్యా చరణకు మార్గదర్శి' అని. అందుచేతనే మార్క్సి జం ఒక సైన్స్. పిడుక్కీ బియ్యానికీ ఒకే మంత్రం లాగ వాడకూడదు. దాన్ని నిర్దిష్ట పరిస్థితులకు తగినట్లు అన్వయించుకోవాలి. "కొన్ని విధాన పరమైన విషయాలపై సిపిఐ(ఎం) వైఖరి" అనే తన వ్యాసంగంలో కామ్రేడ్ సీతారాం ఏచూరి చెప్పినట్లు "వున్న వాస్తవాన్ని ఎదుర్కొనే క్రమంలో వర్గ పోరాటం పలచబడుతుందనో లేదా మూగ బోతుందనో భయపడేవారు కేవలం విప్లవాగ్ని, వర్గద్వేషం మాత్రమే విప్లవాన్ని విజయవంతం చేయజాలవు-అనే విషయాన్ని స్మరణకు తెచ్చుకోవాలి".

"మార్క్సిజం యొక్క సర్వోత్కృష్టమైన శాస్త్రీయతను విస్మరించి దాని విప్లవకర లక్ష ణాన్ని మాత్రమే నొక్కి చెప్పడం వామపక్ష దుస్సాహసానికి జారిపోయేదానికి దారితీస్తుంది. దానికి భిన్నంగా మార్క్సిజంయొక్క శాస్త్రీయతను నొక్కి చెప్పి దాని విప్లవసారాన్ని విస్మరించడం సంస్మరణవాద ఊబిలోనికి దిగజారడానికి దారితీస్తుంది" అని చెబుతూ ఎడా, పెడ ధోరణు లు ఎట్లా మనలను విప్లవ పంథా నుండి పక్కదారులు పట్టిస్తాయో లెనిన్ వివరిస్తారు.

మార్క్సిజాన్ని వారి వారి దేశ కాల మాన పరిస్థితులకు అనుగుణంగా లెనిన్, స్టాలిన్ రష్యాకూ, మావో, డెంగ్‌లు చైనాకూ అన్వ యించుకుని జయప్రదం అయ్యారు. అదేవిధంగా హోచిమన్ వియత్నాంకూ, ఫైడల్ కాస్ట్రో క్యూబాకూ అన్వయించుకున్నారు. అవసరమై నప్పుడు అనుభవాలను బట్టి సరి (కోర్స్

> **" పెట్టుబడిదారీ విధానానికి ఇదొక సంక్షుభిత దశ. ఇందుకు మార్క్సిజాన్ని మించిన పరిష్కారం లేదు. అయితే అనేక ఒడిదుడుకుల్ని ఎదుర్కొనవలసి వుంటుంది. చారిత్రక ఆశావాద దృక్పథం అవసరం. ముందుకు సాగడం అనివార్యం. వర్గ చైతన్యం, సమరశీలత, చిత్తస్థైర్యం కావాలి. అందుకు సిద్ధాంత బలం సమకూర్చుకోవాలి. ఈ శిక్షణ దానికి తోడ్పడుతుంది. "**

కరెక్షన్‌లు) చేసుకున్నారు.

ఇరవయ్యవ శతాబ్దం మార్క్సిజానికి ఒక ప్రయోగశాల అయింది.

పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాద దశకు చేరుకుందని, 'దాని అత్యున్నత రూపమే ఈ దశ' అని లెనిన్ నిర్ధారించాడు. మార్కెట్‌ల కోసం సామ్రాజ్యవాద దేశాల మధ్య రెండు ప్రపంచ యుద్ధాలు (1914 నుండి 1918 వరకు తిరిగి 1933 నుండి 1945 వరకు) జరిగాయి. ఫలితంగా అశేష జన నష్టం, అపారమైన ఆస్తి నష్టం జరిగింది. ఆ దేశ ప్రభుత్వాలు బలహీనపడ్డాయి. ఆ దేశాలలో వర్గ పోరాటాలు ఉధృతమయ్యాయి. ఈ పోరాటాలు ఆ దేశాల గొలుసులోని బలహీనమైన లింకుల్ని ఛేదించాయి. 1917లో రష్యాలో కార్మికవర్గ సాయుధ విప్లవం విజయవంతం కావడంతో విజయ పరంపరకు ఆరంభం పలికినట్లయింది. విశాలమైన బలమైన, యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్ ఏర్పడింది. 1924లో మంగోలియాలో, 1945లో ఎనిమిది తూర్పు యూరప్ దేశాలలో, 1949లో చైనాలో, 1953లో ఉత్తర కొరియాలో, 1959లో క్యూబాలో, డెబ్బయ్యవ దశకంలో వియత్నాం, కాంబోడియా, లావోస్ దేశాలలో కమ్యూనిస్టు ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. ఒక సోషలిస్టు శిబిరం ఏర్పడింది. ప్రపంచ జనాభాలో మూడవ వంతు కమ్యూనిస్టు పార్టీల పాలనలోకి వచ్చారు.

అనేక దేశాలలో విప్లవోద్యమాలు, జాతీయ విముక్తి ఉద్యమాలు బలపడ్డాయి. మిగతా అనుకూల అంశాలతో పాటు సోషలిస్టు శిబిరం నుండి పొందిన నైతిక, సైద్ధాంతిక, పదార్థిక సహాయంతో వందకు పైగా వలస దేశాలు విముక్తి సాధించుకున్నాయి. ఇవి 'అలీన దేశాల కూటమి'గా ఏర్పడి, సోషలిస్టు శిబిరానికి అండగా నిలిచాయి.

సామ్రాజ్యవాదం వేయిపడగల విష సర్పం. కొన్ని తలలు నేలకొరిగాయి. మిగిలిన వాటితో ఆ శిబిరం నిలిచే వుంది. బలంగాను వుంది. మాస్కో నగరంలో 1961లో జరిగిన 81 కమ్యూనిస్టు పార్టీల సదస్సు దాని బలాన్ని తక్కువగా అంచనా వేసింది.

ఈ రెండు వైరి శిబిరాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం దీర్ఘకాలం కొనసాగింది. ఆయుధ పోటీ పెరిగింది. ప్రచార యుద్ధమూ సాగింది. సోవియట్ యూనియన్‌లో ఆయుధాలపై పెద్దగా ఖర్చు పెట్టవలసి వచ్చింది. ప్రజలలో పెరుగుతున్న దైనందిన కోరికలను తీర్చడానికి అది ఆటంకంగా తయారయ్యింది. పాశ్చాత్య ప్రచార సాధనాల దుష్ప్రభావం పెరిగింది.

ఈ క్రమంలో సోవియట్ యూనియన్, తూర్పు యూరప్ దేశాల నాయకత్వంలో కొన్ని సైద్ధాంతిక ఆచరణాత్మక బలహీనతలు ప్రవేశించాయి. (వీటినే రివిజనిస్టు ధోరణులు అంటున్నాం) పరిపాలనలో పొరపాట్లు దొర్లాయి. 1989-91 మధ్య కాలంలో సోవియట్ యూనియన్‌లో తూర్పు యూరప్ దేశాలలో కమ్యూనిస్టు ప్రభుత్వాలు కూలిపోయాయి. ఆ దేశాలలోని ప్రజానీకంలో, కార్యకర్తలలో చురుకైన కమ్యూనిస్టు చైతన్యం కలిగించడంలో వైఫల్యం కూడా దీనికి దోహదం చేసింది. సోషలిస్టు శిబిరం బలహీనపడింది. అమెరికన్ సామ్రాజ్యవాదానికి ఏకచ్ఛత్రాధిపత్యం అయింది.

ఈ పరిణామాలతో, బూర్జువా వర్గ మేధావులకూ, ఆర్థిక శాస్త్రవేత్తలకూ మంచి అవకాశం దొరికింది. వారిక విజృంభించారు. పుంఖానుపుంఖాలుగా రచనలు, సిద్ధాంతీకరణలు చేయడం ప్రారంభించారు. వాటి సారాంశం: సిద్ధాంతంగా మార్క్సిజంకు, వ్యవస్థగా సోషలిజంకు కాలం చెల్లిందని: సామ్రాజ్యవాద ప్రపంచీకరణ నయా ఉదారవాద ఆర్థిక విధానాలదే భవిష్యత్ అని. మరో ప్రత్యామ్నాయం లేదని.

ఈ 'సంబరం' ఎక్కువ కాలం నిలవ లేదు. అనతి కాలంలోనే, సామ్రాజ్యవాదానికి, ప్రపంచీకరణకు వ్యతిరేకంగా ప్రపంచవ్యాప్తంగా ఉద్యమాలు ప్రారంభం అయ్యాయి. చాలా దేశాలలో అనేక రూపాల్లో వ్యక్తుల నుండి, శక్తుల నుండి, సంస్థల నుండి ప్రతిఘటన మొదలైంది. ఈ ఉద్యమాలలో కొన్ని సంఘటితం, మరికొన్ని అసంఘటితం. వరల్డ్ సోషల్ ఫోరమ్ దానికి ఒకానొక విస్తృత రూపం. దాని నినాదాలు మారుమ్రోగుతున్నాయి:

ప్రపంచీకరణ సామ్రాజ్యవాదానికి మరో రూపం. ప్రత్యామ్నాయం లేదనడం అవాస్తవం! ప్రత్యామ్నాయం ఉంది. మరో ప్రపంచం సాధ్యం - అనివార్యం. సోషలిజమే ప్రత్యామ్నాయం!

దీనికి తోడుగా అనూహ్యంగా నిన్న మొన్నటి వరకు అమెరికా సైనిక తొత్తుల పాలనలో మగ్గుతూ వచ్చిన అనేక దక్షిణ అమెరికా దేశాలలో వర్గ పోరాటాలు ఊపు అందుకుంటున్నాయి. ఈ దశాబ్దంలోనే ఒక అరడజను దేశాలలో వామపక్ష ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. మరికొన్ని ఆ దారిలో ఉన్నాయి. వారందరికి ఫైడల్ కాస్ట్రో ఆరాధ్య దైవమయ్యారు. సామ్రాజ్యవాద వ్యతిరేక కూటమికి కేంద్రబిందువయ్యారు. మరోవైపు మధ్య, పశ్చిమ ఆసియా దేశాలలో అమెరికా వ్యతిరేక ఉద్యమాలు - వాటి స్వభావం వేరైనా - రూపుదిద్దుకుంటున్నాయి. మరోవైపు చాలా సంపన్న దేశాలుగా పెట్టుబడిదారీ విధానానికి పట్టుకొమ్మలుగా వుంటున్న అమెరికా, జపాన్ లతో పాటు పాతిక యూరోపియన్ యూనియన్ దేశాలు ఆర్థిక సంక్షోభంలో చిక్కుకున్నాయి. అంతర్గత వైరుధ్యాలు ముదురుతున్నాయి.

ఇక బూర్జువా మేధావులు, సిద్ధాంతకర్తలూ ఆత్మరక్షణలో పడవలసి వస్తున్నది. తిరిగి మార్క్సిజం లెనినిజాన్ని పునర్ మూల్యాంకనం చేస్తున్నారు.

పెట్టుబడిదారీ విధానానికి ఇదొక సంక్షుభిత దశ. ఇందుకు మార్క్సిజాన్ని మించిన పరిష్కారం లేదు. అయితే అనేక ఒడిదుడుకుల్ని ఎదుర్కొనవలసి వుంటుంది. చారిత్రక ఆశావాద దృక్పథం అవసరం. ముందుకు సాగడం అనివార్యం. వర్గ చైతన్యం, సమరశీలత, చిత్తస్థైర్యం కావాలి. అందుకు సిద్ధాంత బలం సమకూర్చు

కోవాలి. ఈ శిక్షణ దానికి తోడ్పడుతుంది.

పార్టీ ఒక సజీవమైన సంస్థ. నిత్యం కొత్త సభ్యులు చేరుతూ వుంటారు. సందర్భాన్ని బట్టి ఈ ప్రవేశం నెమ్మదిగానో వేగంగానే జరుగుతూ వుండవచ్చు. పార్టీ తీసుకునే కార్యక్రమాలకు ఆకర్షితులై ఉత్సాహంతో కొత్త సభ్యులు వస్తారు. ఎవరూ మార్క్సిస్టు పండితులైనాకే చేరతారని భావించలేము. వారు తమ కుటుంబ సామాజిక నేపథ్యం యొక్క 'వర్గ వాసనలతో' కూడా వస్తారు. వారు గతంలో ఏదేని రాజకీయ పార్టీలో పనిచేసి వుంటే ఆ పార్టీ 'సంస్కృతి' తోను రావచ్చు. ఇలాంటి వారందరికీ పార్టీ తన సిద్ధాంత శిక్షణ ఇవ్వాలి. మౌలిక సిద్ధాంత సూత్రీకరణలతో పాటు, సమకాలీన పరిణామాలు, సమస్యలు వాటి పరిష్కార మార్గాలు కూడా బోధించటం అవసరం. పార్టీ సభ్యుల బాధ్యతలు, పాటించవలసిన విధి విధానాలు, విలువలు కూడా ఈ శిక్షణ ద్వారా చెప్పాల్సి వుంటుంది.

> "రాజకీయ తరగతుల్లో బోధన సైద్ధాంతిక శిక్షణలో ఒక ముఖ్యమైన భాగం. కాని అదే సంపూర్ణం కాదు. సరిపోదు. ఈ అంశాలపై మరింత లోతైన విశాలమైన అవగాహన కోసం తగిన రిఫరెన్స్ గ్రంథాలు అధ్యయనం చేయాలి. పార్టీ ప్రచురించే పత్రికలు, ప్రచురణలు విధిగా రెగ్యులర్‌గా చదవడం అలవర్చుకోవాలి."

రాజకీయ తరగతుల్లో బోధన సైద్ధాంతిక శిక్షణలో ఒక ముఖ్యమైన భాగం. కాని అదే సంపూర్ణం కాదు. సరిపోదు. ఈ అంశాలపై మరింత లోతైన విశాలమైన అవగాహన కోసం తగిన రిఫరెన్స్ గ్రంథాలు అధ్యయనం చేయాలి. పార్టీ ప్రచురించే పత్రికలు, ప్రచురణలు విధిగా రెగ్యులర్‌గా చదవడం అలవర్చుకోవాలి.

రాష్ట్ర, జిల్లా స్థాయిలో నిర్వహించే సెమినార్లు చర్చాగోష్ఠులు అధ్యయన పరిధిని పెంచుతాయి. విజ్ఞానకేంద్రం, చైతన్య వేదికలు, సాహితీ స్రవంతులు నిర్వహించే కార్యక్రమాలు కూడా ఒక విధంగా రాజకీయ తరగతులే. పార్టీ సభ్యులు, ప్రజా సంఘాల కార్యకర్తలు, ఎవరికి వారు ఇవి తమకు సంబంధించినవి కానట్లు భావించి పట్టించుకోకపోవడం సబబు కాదు. వీటిలో వెలువడే విభిన్న అభిప్రాయాలు, చర్చకు అవగాహనకు తోడ్పడతాయి. వాటిలో పాల్గొనేవారు కొందరు మంచి పండితులూ, ప్రసిద్ధ ఉపన్యాసకులూ వుంటారు. వీరి నుండి నేర్చుకోదగిన విషయాలతో పాటు, పాటించదగిన ఉపన్యాస ధోరణులు కూడా వుండవచ్చు. కార్యకర్తలకు అవి కూడా పారాలే. అలాగే పార్టీ యూనిట్లు అన్ని స్థాయిల్లో స్టడీ సర్కిల్స్ ఏర్పాటు చేసుకోవడం అవసరం. ఒక సీనియర్ కార్యకర్త ఆధ్వర్యంలో అవి నడవాలి. సైద్ధాంతిక అంశాలతో పాటు, సమకాలీన సమస్యలపై పార్టీ వైఖరి సమగ్రంగా, సాధికారికంగా తెలుసుకొనేందుకు ఇవి సాయపడతాయి. ప్రతి కార్యకర్తా తన సిద్ధాంత ఆయుధానికి నిత్యం పదును పెట్టుకోవాలి.



# దిద్దుబాటు ఉద్యమం నిరంతర ప్రక్రియ

(23వ పేజీ తరువాయి)

లేదు. మనం తప్పులు దిద్దుకుంటే అభివృద్ధి అవుతామని వారి భయం. ట్రయల్ అండ్ ఎర్రర్ అనేది చారిత్రక సూత్రం. శాస్త్రం అలాగే అభివృద్ధి అయింది. నిన్నటి కంప్యూటర్ నేడు పనికి రావడం లేదు. దాన్ని నిరంతరం అభివృద్ధి చేస్తూనే ఉంటున్నారు. అంటే దానర్థం నిన్నటి కంప్యూటర్ శాస్త్రం తప్పని కాదుగా. నిన్నటి కంప్యూటర్ నుండే నేటి కంప్యూటర్, నేటి కంప్యూటర్ నుండి రేపటి కంప్యూటర్ పుట్టుకొస్తున్నాయి. అలాగే తప్పులు సరిదిద్దుకోవడం అంటే మరింత సమర్థవంతమైన పార్టీని, శక్తివంతమైన పార్టీని, శత్రుబలగాలను ఢీకొట్టే పార్టీని నిర్మించుకోవడం. ఈ స్ఫూర్తితో పార్టీ నిర్మాణాన్ని చక్కదిద్దుకోవాలి. సమాజమార్పుకు దోహదపడే పార్టీని నిర్మించుకోవాలి. దానికి మనం సాధనంగా మారాలి.

**కమ్యూనిస్టు ఉద్యమ విశిష్ట వారసత్వం:** మనదేశ, రాష్ట్ర కమ్యూనిస్టు ఉద్యమానికి గర్వించదగిన చరిత్ర ఉంది. ప్రజల కోసం వీర తెలంగాణా లాంటి సమరశీల పోరాటాలు సాగించిన ఘనత కమ్యూనిస్టు ఉద్యమానిదే. త్యాగాలతో పునీతమైన పార్టీ మనది. ప్రజల్లో గౌరవ,ప్రతిష్టలు పుష్కలంగా ఉన్న పార్టీ మనది. ఇదంతా తరగని ఓగని. దాన్ని కాపాడుకుంటూ మరింత ముందుకుపోవాలంటే మారుతున్న పరిస్థితులకనుగుణంగా మనం కూడా నిరంతరం మన పని పద్ధతుల్ని మార్చుకుంటుండాలి. శాస్త్రీయపద్ధతిలో పనిచేసుకుంటూ పోతుంటే చక్కటి ఫలితాలు కూడా వస్తాయి. ఫలితాలు సాధించలేని ఏ పనైనా వృథా. అందుకు అడ్డంకిగా ఉండే మనలోని లోపాలపై మనమే పోరాడుకోవాలి. కామ్రేడ్ హోచిమిన్ చెప్పినట్లుగా "పాత సమాజపు దుర్లక్షణాల జాఢ్యాన్ని వదిలించుకోడానికి, విప్లవ సౌశీల్యాన్ని పెంపొందించుకోడానికి మనం బాగా అధ్యయనం చేయాలి. నిరంతరం పురోగమనం కోసం మనల్ని మనం సంస్కరించుకోవాలి. మెరుగుపరచుకోవాలి. విప్లవ సౌశీల్యాన్ని పుణికిపుచ్చుకున్నవారు కష్టాలకు, కడగండ్లకు, వైఫల్యాలకు వెరవరు. తమ దీక్ష నుండి వైదొలగరు. వెనుకంజవేయరు. పార్టీ, విప్లవం, వర్గం, దేశం, తోటి మానవుల ప్రయోజనాల కోసం స్వంత ప్రయోజనాలను త్యాగం చేయడానికి కూడా తటపటాయించరు. అవసరమైతే తమ ప్రాణాలను కూడా తృణప్రాయంగా త్యజిస్తారు. ఇవన్నీ విప్లవ నైతికతను ప్రతిబింబిస్తాయి." ఇంత కన్నా మన జీవితాలకు కావలసిన సందేశం ఏముంటుంది?



# కమ్యూనిస్టు సాధన

లీ షావ్‌చీ



**ఆలోచనలోనూ, ఆచరణలోనూ కమ్యూనిస్టు ఒక ప్రత్యేకమైన మూసలో పోసినట్లుండాలని స్టాలిన్ చెబుతాడు. కమ్యూనిస్టుగా ఎదిగి ఎవరూ పార్టీలోకి రారు. పార్టీలోకి వచ్చాక కమ్యూనిస్టుగా మారుతారు. ఆ మార్పు నిరంతరాయంగా, జీవితాంతం వరకూ జరుగుతూనే ఉంటుంది. ఎటువంటి లక్షణాలను వదులుకోవడం ద్వారా, ఎటువంటి లక్షణాలను అలవరచుకోవడం ద్వారా కమ్యూనిస్టు ఉత్తమమైన కమ్యూనిస్టుగా ఎదుగుతాడో లీషావ్ చీ అనేక సందర్భాల్లో చెప్పాడు. ఆయన చెప్పిన విషయాల సంగ్రహ రూపమే ఈ వ్యాసం. ప్రతి కమ్యూనిస్టూ అర్థం చేసుకుని, ఆచరించాల్సిన సూత్రాలిందులో ఉన్నాయి.**

## I

### అధ్యయనం

పార్టీ కార్యక్రమాన్నీ, నిబంధనావళినీ ఆమోదించి, సభ్యత్వ రుసుం చెల్లించి, పార్టీకి చెందిన ఏదో ఒక సంఘంలో పనిచేస్తున్న ఏ వ్యక్తికైనా సభ్యత్వాన్ని ఇవ్వాలని మన పార్టీ నిబంధనావళి చెప్తున్నది. ఈ అర్హతలు లేకుంటే ఏ ఒక్కరూ పార్టీ సభ్యులు కాజాలరు. అయితే పార్టీ నిబంధనావళిలో పేర్కొన్న కనీస అర్హతలుండి పార్టీ సభ్యుడైనంత మాత్రాన ఏ కమ్యూనిస్టూ సంతృప్తిపడి ఊరుకోరాదు. మరింత అభివృద్ధి చెందేందుకు అధ్యయనం చేయాలి. మనల్ని మనం తీర్చిదిద్దుకునే క్రమంలో మార్క్సిజం-లెనినిజాన్ని అధ్యయనం చేయాలి. మార్క్సిజం-లెనినిజం సిద్ధాంత స్థాపకుల మాటలనూ, ఆచరణనూ గుణగణాలను ఆదర్శంగా తీసుకోవాలి.

మార్క్స్, లెనిన్ రచనలను అధ్యయనం చేసేటప్పుడు మార్క్సిజం-లెనినిజం సారాన్ని గ్రహించకుండా ఏవో నాలుగు పడికట్టు మాటలు మాత్రమే ఒంటబట్టించుకునేవారు కొందరుంటారు. వాళ్లు సాహిత్యాన్ని అధ్యయనం చేసినప్పటికీ వాటిలోని సూత్రాలనూ, నిర్ధారణలనూ తమ కార్యాచరణకు మార్గదర్శకంగా వినియోగించలేరు. అలాగే యధార్థ జీవితంలోని నిర్దిష్టమైన సమస్యలకు వాటిని అన్వయించలేరు. ఏవో కొన్ని సూత్రాలనూ, నిర్ధారణలనూ కంఠస్థం చేయడంతోనే సంతృప్తిపడతారు. తమను తాము 'అసలైన' మార్క్సిస్టు-లెనినిస్టులుగా ప్రకటించుకుంటారు. నిజానికి వారు అసలైన మార్క్సిస్టు-లెనినిస్టులు ఎంతమాత్రం కాదు. వారి ఆచరణ, విధానాలు మార్క్సిజం-లెనినిజానికి పూర్తి విరుద్ధంగా ఉంటాయి.

పై తరహా వారికి పూర్తిగా భిన్నమైన వారు కూడా ఉన్నారు. వీరు మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాన్నీ, పద్ధతినీ మనస్పూర్వకంగా అధ్యయనం చేస్తారు. దానిలోని సారాంశాన్నీ, స్ఫూర్తినీ ఆకళింపు చేసుకోవడానికి ప్రయత్నిస్తారు. మార్క్సిస్టు మహోపాధ్యాయుల మహోదాత్త స్వభావాన్నీ, కార్మికవర్గ విప్లవతత్వాన్నీ ఆదర్శంగా తీసుకుంటారు. విప్లవ పోరాట క్రమంలోనే వారు స్వయం సాధనకు మనస్ఫూర్తిగా పూనుకొంటారు. తాము చేపట్టే కార్యక్రమాలు, ప్రజలతో సంబంధాలు, తమ నడత, మార్క్సిజం-లెనినిజానికి అనుగుణంగా ఉన్నాయో లేవో ఎప్పటికప్పుడు పరీక్షించుకుంటారు. వీరు మార్క్సిజం-లెనినిజాన్ని బాగా చదువుకుంటారు. అదే సమయంలో సమకాలీన వాస్తవికతను గుర్తించి విశ్లేషించేందుకు ప్రత్యేక ప్రయత్నం చేస్తారు. తమ కాలానికి చెందిన అన్ని లక్ష

**లీ షావ్‌చీ చైనా విప్లవానికి నాయకత్వం వహించిన అగ్రనేతల్లో ఒకరు. కొమింటాంగ్ దళాలకూ, జపాన్ సామ్రాజ్యవాద దళాలకూ వ్యతిరేకంగా పోరాడారు. పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా చైర్మన్‌గా బాధ్యతలు నిర్వహించారు**

ణాలనూ, దేశంలోని కార్మికవర్గం ఎదుర్కొంటున్న పరిస్థితిలోని అన్ని కోణాలనూ అవగాహన చేసుకోవడానికి ప్రయత్నం చేస్తారు. సార్వజనీన సత్యమైన మార్క్సిజం-లెనినిజాన్నీ, దేశంలోని నిర్మాణాత్మకమైన విప్లవ కార్యాచరణతో అన్వయం చేస్తారు. మార్క్సిస్టు-లెనినిస్టు వైఖరికి దృఢంగా కట్టుబడి ఉంటూ, మార్క్సిస్టు-లెనినిస్టు పద్ధతిని అధ్యయనం చేసి, తదనుగుణంగా నడుచుకొంటూ, ప్రతి విప్లవ పోరాటంలోనూ స్ఫూర్తిదాయకమైన మార్గదర్శకత్వాన్ని ఇస్తూ ఆ రకంగా వాస్తవ పరిస్థితిలో మార్పుతెస్తారు. అదే సమయంలో తమను తాము కూడా మార్చుకొంటారు. వారు చేపట్టే చర్యలలో ప్రతి ఒక్కటీ ఏమాత్రం మినహాయింపు లేకుండా మార్క్సిజం-లెనినిజం సాధారణ సూత్రాల కనుగుణంగా ఉంటుంది. కార్మికవర్గ గెలుపుకూ, దేశానికీ అదే విధంగా మొత్తం మానవజాతి విముక్తికీ, కమ్యూనిజం విజయానికీ ఈ చర్యలు కట్టుబడి ఉంటాయి.

ఇలాంటి వారి వైఖరే సరైనది. మార్క్సిజం-లెనినిజాన్ని అధ్యయనం చేసే సరైన వైఖరి ఇదే. మార్క్సిస్టు మహోపాధ్యాయుల గుణగణాల నుండి నేర్చుకునే పద్ధతి కూడా ఇదే. ఇలా చేసిన వారికి మార్క్స్, లెనిన్ తరహా కమ్యూనిస్టు కార్మిక విప్లవకారులుగా రూపొందే శక్తి సమకూరుతుంది.

## II
## స్వయం సాధన

ఉత్తమ కమ్యూనిస్టులుగా తయారు కావాలంటే కార్మికులూ, ప్రజలూ సాగించే సుదీర్ఘమైన విప్లవ పోరాటాల క్రమంలో మనం స్వయం సాధనను బహుముఖాలుగా పెంచుకోవాలసి ఉంది. అధ్యయనంలో స్వయం సాధన ఉండాలి. సమస్యల పరిష్కారానికి సంబంధించి మార్క్సిస్టు-లెనినిస్టు వైఖరినీ, పద్ధతినీ అన్వయింపచేయడంలో స్వయంసాధన ఉండాలి. కార్మికవర్గ విప్లవ వ్యూహమూ, ఎత్తుగడల విషయంలో స్వయంసాధన ఉండాలి. కార్మిక వర్గ సిద్ధాంతం, నైతిక విలువల విషయంలోనూ, పార్టీలో ఐక్యత నిలబెట్టడంలోనూ, అమలు చేయడంలోనూ, విమర్శ, ఆత్మవిమర్శ, క్రమశిక్షణ పాటింపులోనూ స్వయంసాధన ఉండాలి. నిరంతర శ్రమ, పట్టుదలతో కూడిన పోరాటాల పద్ధతిని అభివృద్ధి చేయడంలోనూ స్వయం సాధన అవసరం. ప్రజలతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకోవడంలో స్వయంసాధన ఉండాలి. శాస్త్రీయ, విజ్ఞానాన్ని అలవరుచుకోవడంలో కూడా స్వీయసాధన ఉండాలి.

**“ ఉత్తమ కమ్యూనిస్టులుగా తయారు కావాలంటే కార్మికులూ, ప్రజలూ సాగించే సుదీర్ఘమైన విప్లవ పోరాటాల క్రమంలో మనం స్వయం సాధనను బహుముఖాలుగా పెంచుకోవాలసి ఉంది. అధ్యయనంలో స్వయం సాధన ఉండాలి. సమస్యల పరిష్కారానికి సంబంధించి మార్క్సిస్టు-లెనినిస్టు వైఖరినీ, పద్ధతినీ అన్వయింపచేయడంలో స్వయంసాధన ఉండా లి. కార్మికవర్గ విప్లవ వ్యూహమూ, ఎత్తుగడల విషయంలో స్వయంసాధన ఉండాలి. ”**

మనందరం కమ్యూనిస్టు పార్టీ సభ్యులం. కనుక ఎలాంటి మినహాయింపులు లేకుండా వీటన్నింటిలో స్వాయంసాధన కలిగి ఉండాలి. ఇక ఒక కమ్యూనిస్టుకు అత్యంత ప్రధానమైనదేమిటంటే సమకాలీన ప్రజా పోరాటాల నుండి అతను తనను తాను ఎన్నడూ దూరం చేసుకోకూడదు. అంటే విప్లవ కార్యాచరణలో మనల్ని మనం మెరుగుపర్చుకొని, సానపట్టుకోవాలి. ఈ స్వయంసాధన, సానపట్టడం అనేవి పూర్తిగా ప్రజలకోసం, విప్లవ కార్యాచరణ కోసం అని గుర్తించాలి. సిద్ధాంతానికి విరుద్ధమైన భావాలను నిరంతరం సరిదిద్దుకోవటమో లేక తొలగించుకోవటమో చేయాలి. మనదైన కార్మిక సామ్యవాద భావజాలాన్నీ, స్వభావాన్నీ పటిష్టం చేసుకోవాలి. అంటే మన పార్టీ కామ్రేడ్స్‌గానీ, ప్రజలుగానీ వెలిబుచ్చే అభిప్రాయాలనూ, చేసే విమర్శలనూ వినమ్రులమై వినాలి. మన జీవితంలోనూ, పనిలోనూ ఎదురయ్యే సమస్యలను జాగ్రత్తగా తరచి చూడాలి. ఇలా చేసినట్లయితే మార్క్సిజం-లెనినిజం గురించిన మన అవగాహన, మార్క్సిస్టు-లెనినిస్టు పద్ధతిని మనం ఉపయోగించే తీరు సరైనదో కాదో తెలుసుకోగలం. మన పని విధానంలోని అరకొరలనూ, పొరపాట్లనూ తొలగించి మెరుగుపరుచుకోగలం. క్లుప్తంగా చెప్పాలంటే సర్వతోముఖ సత్యమైన మార్క్సిజం - లెనినిజాన్ని నిర్దిష్టమైన విప్లవాచరణకు జోడించవలసి ఉంది. కమ్యూనిస్టులకు వర్తించే స్వయం సాధన పద్ధతి ఇదే. ప్రజల విప్లవ కార్యాచరణతో సంబంధం లేని, స్వీయమానసిక మయిన సాధనా విధానానికీ ఇది పూర్తిగా విరుద్ధమైనది.

## III
## కార్మికవర్గ దృక్పథం

కమ్యూనిస్టులమైన మనం కార్మికవర్గ భావజాలాన్ని నిగ్గుదేల్చుకోవాలి. ఇది కేవలం విప్లవ కార్యాచరణలోనే కాక మార్క్సిజం-లెనినిజం అధ్యయనంలో కూడా ఉండాలి.

కార్మికవర్గ విప్లవానికి సంబంధించిన శాస్త్రమే మార్క్సిజం-లెనినిజం. దీనిద్వారానే కార్మికవర్గం సోషలిజాన్ని, కమ్యూనిజాన్ని సాధిస్తుంది. ఎవరైతే కార్మికవర్గ వైఖరిని నికరంగా చేపడతారో, కార్మికుల ఆశయాలను తమవిగా చేసుకొంటారో వారు మాత్రమే ఈ శాస్త్రాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకొని దానిని ఆపోసన పట్టగలరు. నికరమైన కార్మికవర్గ వైఖరి, అసలుసిసలైన కార్మికవర్గ ఆశయాలు లేకుండా మార్క్సిస్టు-లెనినిస్టు శాస్త్రాన్ని అవగాహన చేసుకోవడంగానీ, ఆపోసన పట్టడంగానీ సాధ్యంకాదు. ఎవరైతే నిజమైన విప్లవకారులు కారో, మనస్ఫూర్తిగా కార్మికవర్గ విప్లవకారులు కాలేరో, ఎవరైతే ప్రపంచవ్యాప్తంగా సోషలిజం, కమ్యూనిజాన్ని స్థాపించి మొత్తం మానవజాతిని విముక్తి చేయాలని భావించరో, ఎవరైతే విప్లవాన్ని కోరుకోరో లేదా దానిని తుదకంటూ తీసుకెళ్లడానికి అయిష్టంగా ఉంటారో లేక మధ్యలోనే ఆపివేయాలని కోరుకుంటారో అలాంటి వారికి మార్క్సిస్టు-లెనినిస్టు శాస్త్రం నామమాత్రంగానే ఉపయోగపడుతుంది. లేదా ఏ రకంగానూ ఉపయోగపడదు.

మార్క్సిజం-లెనినిజం అధ్యయనాన్ని కొంతమంది ఆలోచనాత్మకమైన స్వయం సాధనకు చక్కగా జోడిస్తారు. తమ ఆలోచనా విధానంలోని లొసుగులను తొలగించడానికి మార్క్సిజం-లెనినిజం సూత్రాలను వినియోగించుకుంటారు. ఈ రకంగా వారు మరింత యథార్థమైన కార్మికవర్గ వైఖరినీ, మరింత స్పష్టమైన కార్మికవర్గ ఆలోచనా విధానాన్నీ సంతరించుకోవడమేకాక కార్యాచరణలో ఎదురయ్యే సమస్యల పరిష్కారానికి మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలను ఎలా అన్వయించాలో నేర్చు

**“ మార్క్సిజం-లెనినిజం అనే ఆయుధాన్ని ఉపయోగించటంలో ప్రావీణ్యం సంపాదించకుండా, త్వరితగతిన సంభవించే మార్పుల మధ్య మన గమనాన్ని మార్చుకోవలసిన అవసరం ఏర్పడినప్పుడు విప్లవ పోరాటంలో ప్రతి ప్రధానమైన సమస్యపైనా సుదృఢమూ, కచ్చితమూ అయిన కార్మికవర్గ వైఖరిని నిలబెట్టుకోవడంగానీ లేదా కార్మికవర్గ విప్లవానికి అత్యంత అనుకూల మైన విధానాన్ని రూపొందించటం గానీసాధ్యం కాదు. ”**

కుంటారు. అలాంటి పార్టీ సభ్యులు మనలో అనేకులున్నారు. ఇతరులు దానికి విరుద్ధమైన మార్గంలో నడుస్తుంటారు. ఇలాంటివారు పనికిమాలిన చెత్తనంతా బుర్రకెక్కించుకుంటారు. అనేకమైన మూర్ఖపు అలవాట్లూ, దురభిమా నాలూ, స్వార్థవాంఛితాలూ కలిగివుంటారు. తమని తాము మార్చుకోవాలన్న కృతనిశ్చయం మాత్రం ఉండదు. మార్క్సిజం-లెనినిజాన్ని అధ్యయనం చేసే సందర్భంలో వీరు తమ స్వీయ ఆలోచనా విధానంలోని లొసుగులను విమర్శించుకోవటానికీ, సరిదిద్దుకోవడానికీ ఆ సూత్రాలను వినియోగించకపోగా స్వీయ ప్రయోజనాలకు సాధనంగా మలచుకుంటారు. పాత దురభిమానాలతో మార్క్సిజం-లెనినిజం సూత్రాలను సరిగ్గా అర్థం చేసుకోవడంగానీ, వాటి స్ఫూర్తిని, సారాంశాన్ని గ్రహించటంగానీ చేయలేరు. విప్లవ పోరాటక్రమంలో ఎదురయ్యే సమస్యలను పరిష్కరించవలసి వచ్చినప్పుడు వీరు పాత సమాజం నుంచి తమతోపాటు తీసుకువచ్చిన అలవాట్లనూ, దురవగాహన లనూ, తమ వ్యక్తిగత అంచనాలనూ కలగలిపి వ్యక్తిగత లాభనష్టాలను బేరీజు వేసుకుని ఆలోచిస్తారు. స్వేచ్ఛగా, నిరాటంకంగా వ్యవహా రాన్ని నడపలేని ఊగిసలాటలోనూ, అసమర్థత లోనూ పడిపోతారు. లేదా ధైర్యంగా సత్యాన్ని చూడలేకపోతారు. ఉద్దేశ్యపూర్వకంగానో, అనుద్దేశపూర్వకంగానో సత్యాన్ని మరుగునపరచ టమో లేక వక్రీకరించటమో చేస్తారు. మార్క్సి జం-లెనినిజం సూత్రాల వెలుగులో తమ జీవి తాలను నడపటంలో వీరు పూర్తిగా అశక్తులవు తారు. ఫలితంగా ఈ సూత్రాలనుసరించి ఖచ్చి తంగా, వాస్తవికంగా సమస్యలను పరిష్కరించ లేని అసమర్థతలో పడతారు. ఒకవేళ ఈ సూత్రాలకు అనుగుణంగా సమస్యలను కచ్చితమైన రీతిలో పార్టీ పరిష్కరించినప్పుడు వీరు ప్రతికూల వైఖరిని కూడా చేపడతారు. ఇలాంటి ఘటనలు పార్టీలో అసాధారణంగానో, అరుదుగానో జరిగేవి కావు. సర్వసాధారణం గానే కనిపిస్తుంటాయి.

విప్లవ దృఢత్వం, పోరాటంలో ధై ర్యంగా పాల్గొనటం అనేవి ప్రతి కమ్యూనిస్టుకూ తప్పనిసరిగా ఉండవలసిన అమూల్యమైన గుణాలు. ఈ గుణాలతోపాటు, విభిన్నమైన చారి త్రక దశలలో, విభిన్న పోరాట పరిస్థితులలో విప్లవాన్ని నడపటానికి, పోరాటాన్ని కొనసా గించటానికి, ఒకవేళ విప్లవం విజయం పొందితే మహోన్నతమైన కమ్యూనిస్టు ఆదర్శాన్ని యథార్థం చేయటానికి సరియైన మార్గాన్ని కనుగొనే శక్తిని కూడా కమ్యూనిస్టులు సంతరించు కోవలసి ఉంది. మనం ఎవరిపైన ఆధార పడాలి? ఎవ రిని కలుపుకోవాలి? ఎవరిని కూల దోయాలి? మనకున్న ప్రత్యక్ష మిత్రులెవరు? మారిన పరి స్థితులకనుగుణంగా వ్యూహమూ- ఎత్తుగడలలో మార్పులను సకాలంలో చేయడం ఎలా?

మార్క్సిజం-లెనినిజాన్ని అన్వ యించటం ద్వారా మాత్రమే ఇలాంటి ప్రశ్నలకు సరియైన సమాధానాన్ని ఇవ్వగలం. మార్క్సిజం -లెనినిజం అనే ఆయుధాన్ని ఉపయోగించ టంలో ప్రావీణ్యాన్ని సంపాదించకుండా, మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతంలో మహోన్నత మైన స్వయంసాధన లేకుండా క్లిష్టపరిస్థితులలో, త్వరితగతిన సంభవించే మార్పుల మధ్య మన గమనాన్ని మార్చుకోవలసిన అవసరం ఏర్పడినప్పుడు విప్లవ పోరాటంలో ప్రతి ప్రధాన మైన సమస్యపైనా సుదృఢమూ, కచ్చితమూ అయిన కార్మికవర్గ వైఖరిని నిలబెట్టుకోవడంగానీ లేదా కార్మికవర్గ విప్లవానికి అత్యంత అనుకూల మైన విధానాన్ని రూపొందించటం గానీ లేదా కార్మిక విప్లవ పోరాట దీర్ఘకాలిక ప్రయోజనా లను నిలపటంగానీ సాధ్యంకాదు.

## V

### ఆదర్శం-ఆచరణ

భావజాలానికి సంబంధించిన స్వయంసాధన గురించి మనమిప్పుడు చర్చించు దాము.

భావజాలానికి సంబంధించిన స్వయంసాధన అంటే అర్థమేమిటి? ఒక కమ్యూనిస్టు తనకున్న కార్మికేతర భావజాలంతో పోరాడటానికి కార్మికవర్గ భావజాలాన్ని వినియో గించటం, తనకున్న కమ్యూనిస్టేతర ప్రాపంచిక దృక్పథంతో పోరాడటానికి కమ్యూనిస్టు ప్రాపంచిక దృక్పథాన్ని వినియోగించడం, తన కున్న వ్యక్తిగతవాదంతో పోరాడటానికి కార్మిక వర్గం యొక్క ప్రజల యొక్క పార్టీ యొక్క ప్రయోజనాల ప్రాధాన్యతా సూత్రాలను వినియో గించటం...ఇదే భావజాలానికి సంబంధించిన స్వయంసాధన.

కమ్యూనిస్టు పార్టీ సభ్యులమైన మనం, పార్టీలోపలా, వెలుపలా సాగే అన్నిరకా లైన పోరాటాలలో భావజాలానికి సంబంధించి మనలను మనం సానబట్టుకుంటాము. విప్లవ పోరాటంలో సంపాదించిన అనుభవాన్ని నిరంతరం సమీక్షించుకుంటూ అధ్యయనం చేస్తాము. మార్క్సిజం-లెనినిజానికీ, కార్మికవర్గ పోరాట ప్రయోజనాలకూ మన స్వీయభావాలు పూర్తిగా సరిపడుతున్నాయా లేదా అని పరీక్షించు కుంటాము. ఈ రకమైన అధ్యయనం, ఆలోచన, స్వీయపరీక్ష ద్వారా అహేతుక భావాల అవశేషా లన్నింటినీ మనం తుడిచిపెడతాము. కమ్యూ నిజం ప్రయోజనాలకు విరుద్ధమైన ఏ భావా లనైనా మొగ్గలోనే తుంచివేస్తాము.

పార్టీ సభ్యులు సాహసోపేతమైన దృక్పథం, విప్లవ సంకల్పం కలిగి ఉండాలి. మానవ చరిత్రలోనే మహత్తరమైన, అత్యంత కఠినతరమైన కర్తవ్యాన్ని... అంటే కమ్యూనిజాన్ని స్థాపించడం అనే కర్తవ్యాన్ని నెరవేర్చడంలో ప్రతిపార్టీ సభ్యుడూ/సభ్యురాలూ ఉత్సాహం తోనూ, పవిత్ర భావంతోనూ భుజం భుజం కలిపి పనిచేయాలి. కమ్యూనిజానికి వాస్తవరూపం కల్పించే క్రమంలో ఎదురయ్యే ఇబ్బందులేమిటో మనం స్పష్టంగా చూశాము. అయితే విప్లవ కార్యాచరణకు లక్షలాది ప్రజలను పురికొల్పడం ద్వారా వీటిని నిస్సంశయంగా అధిగమించ గలమని కూడా మనం చాలా స్పష్టంగా అర్థం చేసుకున్నాము.

మన పోరాటంలో మనం మహో న్నత లక్ష్యాలనూ, ఉన్నత ఆదర్శాలనూ కలిగి

ఉండాలి. అదే సమయంలో ఆచరణాత్మక స్ఫూర్తిని కూడా కలిగి కార్యాచరణకు పూను కోవాలి. కమ్యూనిస్టులుగా మనలను ప్రత్యేకంగా చూపే లక్షణాలు ఇవే. మంచి ఆదర్శాలు ఉన్నప్పటికీ ఆచరణాత్మక స్ఫూర్తి లోపించటమో లేక కార్యాచరణకు పూనుకోకపోవడమో జరిగితే వారు మంచి పార్టీ సభ్యులు కాలేరు. కేవలం స్వాప్నికులుగానో, చిలుకపలుకులు వల్లించేవారు గానో లేక పుస్తకాల పురుగులుగా మాత్రమే మిగిలిపోతారు. అలాకాక కేవలం ఆచరణకే ప్రాధాన్యతనిచ్చి కమ్యూనిస్టు ఆదర్శాలు లోపిస్తే వారు కూడా మంచి కమ్యూనిస్టులు కాలేరు. కేవలం గానుగెద్దులాగా మిగిలిపోతారు. మహత్తరమైన కమ్యూనిస్టు ఆదర్శాలను ఆచరణతో జోడించినప్పుడే మంచి కమ్యూనిస్టు కాగలడు.

కమ్యూనిజం కోసం కృషి చేయటం మన జీవితాశయం. మన యావజ్జీవితమూ, మన రోజువారీ కార్యకలాపాలూ ప్రత్యేకించి దీనికే అంకితం కావాలి. మరొకదానికి అంకితం కారాదు.

## V

### అంకితభావం

కమ్యూనిస్టుకు సంబంధించి సొంత ప్రయోజనాలు పార్టీ ప్రయోజనాలకు లోబడి ఉండాలి. అలాగే స్థానిక పార్టీ శాఖ ప్రయోజనాలు మొత్తం పార్టీ ప్రయోజనాలకూ, పాక్షిక ప్రయోజనాలు అఖండ ప్రయోజనాలకూ, తాత్కాలికమైనవి దీర్ఘకాల ప్రయోజనాలకూ లోబడి ఉండాలి. ప్రతి కమ్యూనిస్టూ అల వరచుకోవలసిన మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రమిది.

వ్యక్తిగత ప్రయోజనాలకూ, పార్టీ ప్రయోజనాలకూ మధ్య ఉండే కచ్చితమైన సంబంధాల పట్ల ప్రతి కమ్యూనిస్టు స్పష్టమైన అవగాహన కలిగి ఉండాలి.

కమ్యూనిస్టుపార్టీ అనేది కార్మికవర్గ రాజకీయపార్టీ. కార్మికవర్గ విముక్తికి మించి తనకంటూ స్వంత ప్రయోజనాలు ఏమీ దానికి లేవు. కార్మికవర్గ అంతిమ విముక్తి అనివార్యంగా మొత్తం మానవజాతి అంతిమ విముక్తిగా కూడా ఉండాలి. మొత్తం శ్రామిక ప్రజలనూ, మొత్తం దేశాలనూ విముక్తి చేయకుండా (మొత్తంమీద మానవజాతిని విముక్తి చేయకుండా) కార్మికవర్గం తనను తాను పూర్తిగా విముక్తి చేసుకోలేదు. కనుక కమ్యూనిస్టుపార్టీ పని కార్మికవర్గాన్నీ, మొత్తం మానవజాతినీ విముక్తి చేయటమే. కమ్యూనిస్టు

> **"పార్టీపట్ల, విప్లవం పట్ల, కమ్యూనిస్టు ఆశయంపట్ల పార్టీ సభ్యుని విధేయతను పరీక్షించాలంటే, ఏ పరిస్థితుల లోనైనా అతడు తన సొంత ప్రయోజనాలను పార్టీ ప్రయోజ నాలకు సంపూర్ణంగా, బేషరతుగా లోబడేటట్లు చేస్తున్నాడా లేదా అని చూడవలసిందే."**

పార్టీ సభ్యుని వ్యక్తిగత ప్రయోజనాలు, పార్టీ ప్రయోజనాలకు లోబడి ఉండడం అంటే అవి వర్గ, దేశ విముక్తి ప్రయోజనాలకు లోబడి ఉండటమే, కమ్యూనిజం సాధనకూ సామాజిక ప్రగతిసాధనకూ లోబడి ఉండటమే అవుతుంది.

పార్టీపట్ల, విప్లవం పట్ల, కమ్యూనిస్టు ఆశయంపట్ల పార్టీ సభ్యుని విధేయతను పరీక్షించాలంటే, ఏ పరిస్థితుల లోనైనా అతడు తన సొంత ప్రయోజనాలను పార్టీ ప్రయోజ నాలకు సంపూర్ణంగా, బేషరతుగా లోబడేటట్లు చేస్తున్నాడా లేదా అని చూడవలసిందే.

అన్నివేళల్లోనూ, అన్ని విషయాల్లోనూ పార్టీ సభ్యులు ముందుగా పార్టీ ప్రయోజ నాలకు ప్రథమ స్థానాన్ని ఇవ్వాలి. వ్యక్తిగత విషయాలకు, ప్రయోజనాలకు ద్వితీయ స్థానాన్ని ఇవ్వాలి. పార్టీ ప్రయోజనాల ప్రాధాన్యమే మన పార్టీ సభ్యుల ఆలోచనలనూ, ఆచరణనూ నడిపించే ముఖ్యసూత్రంగా ఉండాలి. ఈ సూత్రాన్ననుసరించి ప్రతిపార్టీ సభ్యుడూ/ సభ్యురాలూ ఆలోచనలోనూ, ఆచరణలోనూ సొంత ప్రయోజనాలను పార్టీ ప్రయోజనాలతో పూర్తిగా మమేకం చేయాలి. అలా చేయటం వల్ల పార్టీ ప్రయోజనాలకూ, సొంత ప్రయోజ నాలకూ ఘర్షణ ఏర్పడినప్పుడు ఏ రకమైన ఊగిసలాటా, అయిష్టతా లేకుండా పార్టీ ప్రయోజనాలవైపు మొగ్గు చూపుతారు. సొంత ప్రయోజనాలను వదులుకుంటారు. పార్టీకోసం, కార్మికవర్గం కోసం దేశ విముక్తికోసం, మొత్తం మానవజాతి విముక్తికోసం సొంత ప్రయోజనాలనూ, చివరకు ప్రాణాన్ని సైతం త్యాగం చేయడానికి సంసిద్ధంగా ఉంటే దాన్నే "పార్టీ చైతన్యం", "పార్టీ స్పృహ" లేదా "నిర్మాణ స్పృహ అని వర్ణిస్తారు. ఇది కమ్యూనిస్టు నైతికతకూ, కార్మికవర్గ పార్టీకున్న సూత్రబద్ధ స్వభావానికీ, అకళంకమైన కార్మికవర్గ చైతన్యానికీ అత్యున్నత వ్యక్తీకరణ.

పార్టీ ప్రయోజనాలతో నిమిత్తం లేని సొంత లక్ష్యాలు మన పార్టీ సభ్యులకు ఉండరాదు. వారి వ్యక్తిగత ప్రయోజనాలు పార్టీ ప్రయోజనాలతో కలిసిపోవాలి. మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాన్ని అధ్యయనం చేయటం, పని సామర్థ్యాన్ని పెంచుకోవడం, విప్లవ సంస్థలను స్థాపించటం, విప్లవ పోరాటాలలో ప్రజలకు జయప్రదంగా నాయకత్వం వహించటం అనేవి తమ లక్ష్యాలుగా వారు నిర్ణయించుకున్నట్లయితే (పార్టీకోసం మరింతగా పనిచేయటమే వారి లక్ష్యమైనట్లయితే) అప్పుడు వారి వ్యక్తిగత లక్ష్యాలు పార్టీ ప్రయోజనాలతో మిళితమవుతాయి. ఈ తరహాకు చెందిన సభ్యులూ, కార్యకర్తలూ పార్టీకి ఎంతైనా అవసరం. ఈ లక్ష్యాలతోపాటే పార్టీ సభ్యులకు వ్యక్తిగత ఆకాంక్షలు కూడా ఉండరాదు. అంటే పదవులను లేదా హోదాలను పొందాలను కోవటం, ఏకైక కథానాయకుడిగా వ్యవహరించ టం వంటివి ఉండరాదు. ఇవి ఉంటే పార్టీ ప్రయోజనాలకు దూరమవటమేకాక పార్టీలో అవకాశవాదిగా మారే అవకాశం కూడా ఉంది.

కమ్యూనిస్టుపార్టీ సభ్యులు అత్యుత్త మమైన మానవ విలువలు కలిగి సష్టమైన, దృఢమైన పార్టీ వైఖరినీ, కార్మికవైఖరినీ (అంటే పార్టీ చైతన్యాన్నీ, వర్గ చైతన్యాన్నీ) కలిగి ఉంటారు. మనది అత్యుత్తమమైన నీతి. ఎందుకంటే అది కార్మికవర్గానికి చెందిన, కమ్యూనిజానికి చెందిన నీతి గనుక. కొంత మంది వ్యక్తుల కోసమో, లేదా బహుకొద్దిమంది దోపిడీదారుల ప్రయోజనాల పరిరక్షణ కోసమో ఈ నీతి పనిచేయడం లేదు. కార్మికుల ప్రయోజనాలకోసం, అసంఖ్యాక శ్రామిక ప్రజల ప్రయోజనాలకోసం మొత్తం మానవజాతికి అంతిమ విమోచన కల్పించడం కోసం,

> **" వర్గ సమాజంలో అత్యుత్తమమైన కమ్యూనిస్టు నీతితో సాటివచ్చే నీతి మరొకటి లేదు. వర్గాతీతమైనదిగా చెప్పే సార్వత్రిక నీతి కపటమైనది, కొద్దిమందిగా ఉన్న దోపిడీదారుల ప్రయోజనాలు కాపాడటానికి రూపుదిద్దుకున్న నీతి అది. కాని కమ్యూనిస్టు నీతి అటువంటిది గాదు. మొత్తం మానవజాతికి విముక్తి కల్పించే పోరాటంలో కార్మికవర్గ ప్రయో జనాల పరిరక్షణే కమ్యూనిస్టు నీతి యొక్క ధ్యేయం. "**

పెట్టుబడిదారీ విపత్తుల నుండి యావత్ప్రపంచానికి స్వేచ్ఛ కల్పించడం కోసం సుందరమైన, సంతోషదాయకమైన కమ్యూనిస్టు ప్రపంచ ఆవిర్భావం కోసం ఈ నీతి పనిచేస్తోంది. శాస్త్రీయ కమ్యూనిజాన్ని బోధించే మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలపై ఈ నీతి ఆధారపడి ఉంది. ఒక వ్యక్తి కోసమో లేదా కొద్దిమంది కోసమో తనని తాను త్యాగం చేసుకోవటం కన్నా నిష్ఫలమైన, అసమంజమైన పని మరొకటి లేదని కమ్యూనిస్టులమైన మనకు తెలుసు. అయితే పార్టీ కోసం, కార్మికవర్గం కోసం, దేశ విముక్తికోసం, మానవ జాతి స్వేచ్ఛకోసం, సాంఘిక ప్రగతికోసం, అసంఖ్యాకమైన ప్రజల అత్యున్నత ప్రయోజనాల కోసం తనను తాను బలిదానం గావించుకోవడంకన్నా ప్రపంచంలో అమూల్యమైనదీ, న్యాయసమ్మతమైనదీ మరొకటి లేదు. నిజానికి కమ్యూనిస్టుపార్టీ సభ్యులలో అనేకులు ప్రశాంత చిత్తులై మృత్యువును ఆహ్వానించగలరు. అణుమాత్రమైనా సంశయం లేకుండా ప్రాణ త్యాగానికి సంసిద్ధులు కాగలరు. అవసరమనుకున్న పక్షంలో ఆశయం కోసం ప్రాణాలర్పించటం, న్యాయంకోసం జీవఫలాన్ని త్యాగం చేయటం సర్వసాధారణ విషయమని అనేక మంది కమ్యూనిస్టులు భావిస్తారు. అయితే ఈ త్యాగ దృక్పథం విప్లవ భ్రమల నుండో, కీర్తి ఖండూతి నుండో పుట్టుకువచ్చింది కాదు. సామాజికాభివృద్ధికి చెందిన శాస్త్రీయ అవగాహననుండీ, ప్రగాఢమైన రాజకీయ చైతన్యం నుండీ ఆవిర్భవించింది. వర్గ సమాజంలో అత్యుత్తమమైన కమ్యూనిస్టు నీతితో సాటివచ్చే నీతి మరొకటి లేదు. వర్గాతీతమైనదిగా చెప్పే సార్వత్రిక నీతి కపటమైనది, అర్థరహితమైనది. కొద్దిమందిగా ఉన్న దోపిడీదారుల ప్రయోజనాలు కాపాడటానికి రూపుదిద్దుకున్న నీతి అది. ఈ రకమైన నీతి ఎల్లప్పుడూ అందని పండు మాదిరిగానే ఉంటుంది. కాని కమ్యూనిస్టు నీతి అటువంటిది గాదు. మొత్తం మానవజాతికి విముక్తి కల్పించే పోరాటంలో కార్మికవర్గ ప్రయోజనాల పరిరక్షణే కమ్యూనిస్టు నీతి యొక్క ధ్యేయం.

పార్టీ సభ్యులు తప్పనిసరిగా తన సొంత ప్రయోజనాలను పార్టీ ప్రయోజనాలకు లోబడేటట్లు చేయాలి. అవసరమనుకుంటే పార్టీ ప్రయోజనాలకోసం సొంత ప్రయోజనాలు త్యాగం చేయాలి. అయితే దీనర్థం పార్టీ తన సభ్యుల వ్యక్తిగత ప్రయోజనాలను గుర్తించదనో, లేక త్రోసిపుచ్చుతుందనో అదీకాకపోతే సభ్యుల వ్యక్తిత్వాన్ని హరిస్తుందనో కాదు. పార్టీ సభ్యులకు పరిష్కరించుకోవాల్సిన స్వంత సమస్యలు ఉంటాయి. అంతేకాక వారు తమ అభీష్టాలకూ, స్వభావానికీ అనుగుణంగా తమను తాము అభివృద్ధి చేసుకొనవలసి ఉంది. కనుక పార్టీ ప్రయోజనాలకు వ్యతిరేకంకాని రీతిలో పార్టీ సభ్యుడు తన వ్యక్తిగత కుటుంబ జీవితాన్ని కలిగి ఉంటూ తన సొంత అభిరుచులనూ, మానసిక వికాసాన్నీ అభివృద్ధి చేసుకోవచ్చు. అదే సమయంలో పార్టీ ప్రయోజనాలకు అనుగుణంగా సభ్యులు తమ వ్యక్తిగత అభిప్రాయాలనూ, స్వభావాన్నీ అభివృద్ధిపరచుకోవటానికి అన్నివిధాలుగా పార్టీ సహాయపడుతుంది. వారికి తగిన పనిని, పని పరిస్థితుల్ని కల్పించి ప్రోత్సహిస్తుంది. సాధ్యమైనంత మేరకు పార్టీ తన సభ్యుల అత్యవసర ప్రయోజనాలను సంరక్షిస్తుంది. ఉదాహరణకు విద్యార్జనకూ, అధ్యయనానికీ అవకాశాన్ని కల్పిస్తుంది. ఆరోగ్య, కుటుంబ సమస్యల పరిష్కారానికి తోడ్పడుతుంది. అవసరమనుకుంటే ప్రతిఘటన సమయంలో కామ్రేడ్స్ రక్షణకోసం కొంతమేరకు తన పనిని వదులుకుంటుంది. అయితే దీనికంతటికీ కారణం పార్టీ బహుముఖ ప్రయోజనాలు తప్ప మరొకటి కాదు. పార్టీ కర్తవ్యాలను నెరవేర్చే సభ్యులు సజావుగా బతికేందుకూ, పని చేసేందుకూ, విద్యార్జనకూ వీలైన పరిస్థితులను పార్టీయే కల్పించాలి. అప్పుడు మాత్రమే వారు ఎలాంటి ఆందోళన లేకుండా తమ కర్తవ్యాలను ఉత్సాహంతో నెరవేరుస్తారు.

స్థూలంగా చెప్పాలంటే ప్రతి పార్టీ సభ్యుడూ పార్టీ ప్రయోజనాలకు పూర్తిగా లోబడి ఉండాలి. ప్రజాసేవకు నిస్వార్థంగా అంకితం కావాలి. పార్టీ ప్రయోజనాలతో విభేదించే వ్యక్తిగత లక్ష్యాలనూ, ఆలోచనలనూ విడిచిపెట్టాలి. ప్రతినిత్యమూ తన గురించి తాను ఆలోచించటం గానీ, అంతూ పొంతూ లేని డిమాండ్లను ముందుంచడంగానీ చేయరాదు. లేదా తనకు ఉన్నత హోదాలను కల్పించనందుకో, కితాబు లివ్వనందుకో పార్టీని నిందించరాదు. పరిస్థితులెలా ఉన్నప్పటికీ కష్టపడి అధ్యయనం చేయాలి. తనను తాను మెరుగుపర్చుకోవటానికి ప్రయత్నించాలి. పోరాటంలో ధైర్యంగా నిలవాలి. రాజకీయ చైతన్యస్థాయిని పెంచుకోవటానికీ, మార్క్సిజం-లెనినిజాన్ని అవగాహన చేసుకోవటానికీ అవిశ్రాంతంగా కృషిచేయాలి. అప్పుడు మాత్రమే అతడు పార్టీకీ, విప్లవానికీ మరింత తోడ్పడగలడు. అదేవిధంగా పార్టీ సంస్థలూ, బాధ్యతాయుత స్థానాల్లో ఉన్న కామ్రేడ్సూ పార్టీ సభ్యులతో వ్యవహరించేటప్పుడు సభ్యుల పనివిధానాన్నీ, జీవనశైలినీ, అధ్యయనాన్నీ పరిశీలించవలసి ఉంది. పార్టీకోసం మరింత చక్కగా పనిచేసే శక్తిని వారికి సమకూర్చాలి. కార్మికవర్గ విప్లవ పోరాట క్రమంలో ఎవరైతే నిర్విరామంగా, నిస్వార్థంగా ఉంటారో, ఎవరైతే ప్రజలకు చక్కగా సేవలందిస్తారో అలాంటి కామ్రేడ్స్ పట్ల ప్రత్యేకించి శ్రద్ధను చూపాలి. ఉభయపక్షాల సంయుక్త కృషిద్వారా మాత్రమే పార్టీ ప్రయోజనాలు చక్కగా నెరవేరుతాయి.

## V

### వదులుకోవలసిన దుర్లక్షణాలు

పార్టీ సభ్యులు క్రింది లక్షణాలు స్వయం సాధనతో వదులుకోవాలి.

**1.** మన పార్టీలో చేరుతున్నవారు వర్గరీత్యానూ, ఆయా వర్గాలలో వ్యక్తిగత హోదా రీత్యానూ విభిన్నంగా ఉంటూ, తమతోపాటు రకరకాలైన లక్ష్యాలనూ, అభిప్రాయాలనూ వెంట తీసుకొని వస్తారు. సహజంగానే ఇలాంటివారు క్లిష్టమైన సమయాలలో ఊగిసలాటలకు లోనవడమో లేదా తమ అభిప్రాయాలను మార్చుకోవటమో చేస్తారు. వీరు పార్టీలోకి అనేకరకాలైన

> **కొంతమంది కామ్రేడ్స్ కేవలం పాక్షిక ప్రయోజనాలను మాత్రమే చూస్తారు. అంటే తాము పనిచేసే విభాగం లేదా ప్రాంతం గురించే ఆలోచిస్తూ మొత్తం పార్టీ ప్రయోజనాలనూ ఇతర విభాగాల, ప్రాంతాల పనినీ పట్టించుకోలేరు. దీనినుంచే సంకుచితత్వం పుట్టుకొస్తుంది. సంకుచితత్వం అనే పొరపాటు ధోరణిలో కూకుపోయిన కామ్రేడ్స్ అందరూ వ్యక్తిగతవాదులని అనుకోనవసరం లేదు. సాధారణంగా ఈ సంకుచితత్వానికి వ్యక్తిగత భావజాలం కారణమవుతూ ఉంటుంది.**

భావాలను మోసుకువస్తూ ఉంటారు. కనుక వీరు విద్యావంతులు కావాలి. శిక్షణ పొందాలి. తమను తాము మెరుగుపరచుకోవాలి. లేనిపక్షంలో వారు కార్మికవర్గ విప్లవయోధులుగా రూపొందలేరు.

పార్టీలో చేరిన అనంతరం వారు కష్టపడి అధ్యయనం చేసి రాజకీయంగా చైతన్యవంతులైన కమ్యూనిస్టులుగా మారతారు.

**2**: మన పార్టీలోని కొంతమంది సభ్యులతో ఇప్పటికీ బలమైన వ్యక్తిగత పోకడలు, స్వార్థం కనిపిస్తున్నాయి.

వ్యక్తిగత పోకడలు ఈ దిగువ విధంగా వ్యక్తమవుతూ ఉంటాయి: ఆచరణాత్మక విషయాలకు వచ్చేసరికి కొంతమంది అలవాటు ప్రకారం తమ వ్యక్తిగత ప్రయోజనాలకు పార్టీ ప్రయోజనాలకన్నా ఎక్కువ విలువనిస్తారు. వ్యక్తిగత లాభనష్టాలను బేరీజు వేసుకోవడానికి అలవాటుపడి ప్రతిసారీ సొంత ప్రయోజనాల దృష్ట్యానే ఆలోచనలు చేస్తూ ఉంటారు. ప్రజలను నిందిస్తూ పార్టీ కార్యకలాపాలను ఏదో ఒక రకమైన తమ సొంత లాభాలకు అనుకూలంగా మలచుకుంటారు. తమకు నచ్చని కామ్రేడ్స్‌మీద దాడిచేస్తూ వ్యక్తిగత ప్రతీకారానికి పాల్పడతారు. ఇకపోతే హోదాలూ, భౌతిక సౌకర్యాలూ, దైనందిన జీవితంలో ఎదురయ్యే సమస్యల విషయానికొస్తే ఇతరులకన్నా ఎక్కువ పొందటానికి చూస్తారు. తమకన్నా పై స్థాయిలో ఉన్న వారితో తమను తాము పోల్చుకుని వారితో పాటుగా వ్యక్తిగత సౌకర్యాలను పొందాలని చూస్తారు. మరోవైపు పని విషయంలో మాత్రం అంతగా శక్తిలేనివారితో తమను తాము పోల్చుకుంటారు. కష్టాలెదురైనప్పుడు సహించలేరు. ప్రమాదాలు సంభవిస్తే తప్పించుకుపోవాలని చూస్తారు. సహాయాల విషయానికొస్తే ఎక్కువమందిని అడుగుతారు. తాము ఉండే ఇల్లు బ్రహ్మాండంగా ఉండాలంటారు. పార్టీ ప్రతిష్టలో తమకు బాగం ఉందంటారు. మంచైతే తన ఘనత, చెడైతే ఇతరుల బాధ్యత అన్న ధోరణితో ఉంటారు. ఇలాంటివారి బుర్రలు దోపిడీవర్గాల భావాలతో నిండి వుంటాయి. వారి నమ్మకమేమంటే "ప్రతివాడూ తన కొరకు తాను బ్రతుకుతాడు", "మానవుడు స్వార్థజీవి", ఈ ప్రపంచంలో "నిజమైన నిస్వార్థపరులెవ్వరూ ఉండరు, ఉంటే వాడు ఒట్టి చవటో, తెలివి తక్కువ దద్దమ్మో" అయి ఉంటాడు. తమ స్వార్థాన్నీ, వ్యక్తిగత పోకడలనూ సమర్థించుకునేందుకై పాలకవర్గాలకు చెందిన ఇటువంటి చెత్తనంతా ఏకరువు పెడతారు. మన పార్టీలో ఇలాంటివారు ఉన్నారు.

ఈ తరహా స్వార్థపూరిత వ్యక్తిగత పోకడలు మన పార్టీలో తరచుగా వ్యక్తమవుతూ ఉంటాయి. అకారణ జగడాలూ, ముఠాతగాదాలూ, ఒంటెత్తువాదం, సంకుచితత్వం వంటివన్నీ ఈకోవకే వస్తాయి. పార్టీ క్రమశిక్షణను గౌరవించకుండా ఉద్దేశ్యపూర్వకంగా అతిక్రమించడం కూడా ఈ లక్షణాల్లోకే వస్తుంది. ఎక్కువభాగం పనికిమాలిన తగవులు వ్యక్తిగత ప్రయోజనాలనుండే పుట్టుకువస్తాయి. ముఠా తగాదాల్లో చిక్కుకున్నవారు లేదా ఒంటెత్తు వాదాన్ని ఆశ్రయించినవారు తమ వ్యక్తిగత ప్రయోజనాలకూ లేదా కొద్దిమంది ప్రయోజనాలకూ పార్టీ ప్రయోజనాలకన్నా ఎక్కువ విలువ ఇస్తారు. పనికిమాలిన ముఠా తగాదాల్లో చిక్కుకున్నవారు పార్టీ నిర్మాణాన్నీ, క్రమశిక్షణనూ కావాలనే ఉల్లంఘిస్తారు. అకారణంగా లేదా ఒక పథకం ప్రకారం నిర్దిష్ట వ్యక్తులపై దాడికి దిగుతారు. ఇబ్బందులను తప్పించుకోవడానికీ, ఒకరినొకరు సమర్థించుకోవడానికీ, ఒకరినొకరు కీర్తించుకోవటానికీ ఇంకా ఇలాంటి పనికిమాలిన పనులకోసం సూత్రరహిత స్నేహాలను కలుపుకుంటారు.

కొంతమంది కామ్రేడ్స్ కేవలం పాక్షిక ప్రయోజనాలను మాత్రమే చూస్తారు. అంటే తాము పనిచేసే విభాగం లేదా ప్రాంతం గురించే ఆలోచిస్తూ మొత్తం పార్టీ ప్రయోజనాలనూ ఇతర విభాగాల, ప్రాంతాల పనినీ పట్టించుకోలేరు. దీనినుంచే సంకుచితత్వం పుట్టుకొస్తుంది. రాజకీయంగా, సైద్ధాంతికంగా ఇది వృత్తిసంఘాలవారి దృక్పధాన్ని పోలి వుంటుంది. సంకుచితత్వం అనే పొరపాటు ధోరణిలో కూకుపోయిన కామ్రేడ్స్ అందరూ వ్యక్తిగతవాదులని అనుకోనవసరం లేదు. సాధారణంగా ఈ సంకుచితత్వానికి వ్యక్తిగత భావజాలం కారణమవుతూ ఉంటుంది.

**3**: బహుకొద్దిమంది పార్టీ కామ్రేడ్స్‌లో ఇప్పటికీ ఎంతో కొంత మేరకు దురహంకారం, హీరోయిజం, బడాయి పోకడలు కనిపిస్తూనే ఉన్నాయి.

ఈ రకమైన అభిప్రాయాలు కలిగిన వారు మొట్టమొదటగా పార్టీలో తమ స్థానాన్ని గురించి ఆలోచిస్తారు. దర్పాన్ని ప్రదర్శిస్తూ ఇతరులు తమను కీర్తించాలనీ, పొగడాలనీ కోరుకుంటారు. వీరికి ఉన్నత పదవులు కావాలి. వందిమాగధులను మెచ్చుకుంటారు. ప్రఖ్యాతిలోకి రావటానికై లేని గొప్పతనాన్ని ఆపాదించుకుంటారు. ప్రతిదీ తన చేతులమీదుగా జరగాలని భావిస్తారు. వీరిలో ప్రజాతంత్ర పని పద్ధతులు పూజ్యం. అమితమైన దురహంకారం వీరి సొత్తు. కష్టపడి పనిచేయడంగానీ లేదా ఒకే రకమైన పనిని చేయటంగానీ, సాంకేతికపనులలో తలదూర్చటంగానీ వీరికి ఇష్టం ఉండదు. అంతేకాక వీరు గర్వపోతులు. తాను చేసింది చిన్నపనైనా విర్రవీగుతారు. ఇతరులను తమ తోటివారిగా భావించరు. స్నేహభావంతో చూడరు. తమను చూసి తామే మురిసిపోతుంటారు. ధర్మోపన్యాసాలిస్తారు, ఆజ్ఞలు జారీచేస్తారు. ఇతరులపైన సవారీ చేస్తారు. ఇతరుల నుంచి, ప్రత్యేకంగా ప్రజలనుంచి వారేమీ నేర్చుకోరు. సహేతుకమైన అభిప్రాయాలనుగానీ, విమర్శలనుగానీ ఒప్పుకోరు. వారికి పైస్థాయి హోదాలంటేనే ఇష్టం. క్రిందిస్థాయివి గిట్టవు. ఆహ్లాదకరమైన వాతావరణం ఉండాలి. తద్విరుద్ధమైనది ఇష్టం ఉండదు. ఇతరులు పొరపాటుగా అవగాహన చేసుకున్నా, తప్పు చేసినా సహించరు. కీర్తికోసం పాకులాడటాన్ని విడిచిపెట్టరు. కమ్యూనిస్టు ఉద్యమానికి చెందిన "మహాత్ముల" మాదిరిగానూ, "వీర పురుషుల" మాదిరిగానూ కనిపించడానికి ప్రయత్నిస్తారు. తీరని కోర్కెలతో సతమతమవుతారు. వీరి

**"కమ్యూనిస్టులకు కొంచెమైనా ఆత్మ తృప్తిగానీ, గర్వంగానీ ఉండరాదు. కొంతమంది కామ్రేడ్స్ చాలా శక్తి పరులై ఉండవచ్చు. చెప్పుకోదగిన విజయాలనూ సాధించవచ్చు. తమను గురించి తాము గొప్పగా చెప్పుకోవటానికి వీలైన 'ఘన'కార్యాలుగా వీటిని లెక్కించవచ్చు. కానీ మొత్తంమీద మహత్తరమైన కమ్యూనిస్టు ఆశయంతో పోల్చుకుంటే ఇవి ఏపాటి ఘన మైనవి? కమ్యూనిస్టు ప్రాపంచిక దృక్పథమున్న వారు తమను చూసి తాము మురిసిపోవటానికి ఈ విజయంలో ఏముంది?"**

ఆశలు నెరవేరకపోతే ఊగిసలాట మొదలవుతుంది. ఈ రకమైన అభిప్రాయాలుగల కొంతమంది ఊగిసలాడి చివరకు పార్టీని విడిచివెళ్లినవారున్నారు. ఎవరైతే మహత్తరమైన కమ్యూనిస్టు ఆశయాన్ని అవగాహన చేసుకోవడంలో విఫలమయ్యారో, ఎవరిలోనైతే కమ్యూనిస్టు విశాల దృక్పథం కొరవడిందో అలాంటివారి బుర్రలను ఇప్పటికీ దోపిడీవర్గాల భావాలు తొలుస్తూనే ఉన్నాయి.

కమ్యూనిస్టులకు కించిత్తయినా ఆత్మ తృప్తిగానీ, గర్వంగానీ ఉండరాదు. కొంతమంది కామ్రేడ్స్ చాలా శక్తి పరులై ఉండవచ్చు. మంచి పనులు కూడా చేయొచ్చు. చెప్పుకోదగిన విజయాలనూ సాధించవచ్చు. తమను గురించి తాము గొప్పగా చెప్పుకోవటానికి వీలైన 'ఘన'కార్యాలుగా వీటిని లెక్కించవచ్చు. (ఉదాహరణకు మన సైనికాధికారులు యుద్ధరంగంలో వందల, వేలమందిని నడిపిస్తూ విజయం సాధిస్తూ ఉంటారు. లేదా మన పార్టీకీ, ప్రజాసంఘాలకు చెందిన నాయకులు గణనీయమైన మార్పులు తీసుకొనివచ్చి ఉండవచ్చు.) కానీ మొత్తంమీద మహత్తరమైన కమ్యూనిస్టు ఆశయంతో పోల్చుకుంటే ఇవి ఏపాటి ఘనమైనవి? కమ్యూనిస్టు ప్రాపంచిక దృక్పథమున్న వారు తమను చూసి తాము మురిసిపోవటానికి ఈ విజయంలో ఏముంది?

తన పనిని సక్రమంగానూ, చక్కగానూ చేయడమే కమ్యూనిస్టు విధి. ఉపేక్షా భావం, గర్వం చొరబడకుండా చూసుకోవాలి. పొరపాటు చేయకుండా ఉండటానికి లేదా ఎక్కువ పొరపాట్లు చేయకుండా ఉండటానికి శాయశక్తులా ప్రయత్నించాలి.

వ్యక్తిగత హోదా గురించి ఒక కమ్యూనిస్టు వేదనపడవలసింది ఏముంటుంది? ఒక చక్రవర్తి కన్నా ఎవరూ గొప్పవారు కారు. అయినప్పటికీ కమ్యూనిజం కోసం పోరాడే యోధునితో పోల్చినప్పుడు చక్రవర్తి గొప్పతనమేమిటి? కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లు ఆ చక్రవర్తి సముద్రంలో నీటిబొట్టంతే కదా? వ్యక్తిగత హోదా గురించి విచారించవలసింది గానీ, డాబుగా చెప్పవలసిందిగానీ ఏముంటుంది?

మన కామ్రేడ్స్ మరో విషయాన్ని కూడా గుర్తుంచుకోవాలి. పార్టీ సభ్యుడు కానివ్వండి లేదా నాయకుడు కానివ్వండి అతడు కమ్యూనిస్టు ఉద్యమానికి చెందిన పనిలో కొంత మాత్రమే చెయ్యగలడు. తత్సంబంధిత బాధ్యతలలో కొన్ని మాత్రమే నిర్వహించగలడు. కమ్యూనిస్టు ఆశయం నెరవేరాలంటే లక్షలాది ప్రజలు దీర్ఘకాలంపాటు సమిష్టిగా పనిచేయవలసి ఉంటుంది. ఏ ఒక్కరో చేయగలిగిన పని కాదిది. చివరకు మార్క్స్, లెనిన్, స్టాలిన్ వంటి మహానుభవాలు సైతం కమ్యూనిస్టు ఆశయ సఫలతకు అవసరమైన దానిలో కొంతభాగాన్ని మాత్రమే చేశారు. వారి ఆశయ సాధనకు గాను లక్షలాదిగా ఉన్న మనం కూడా కమ్యూనిస్టు ఆదర్శ సఫలతకై జరిగే కృషిలో కొంతభాగాన్ని చేయగలం. కొంతమేరకు బాధ్యతను నెరవేర్చగలం. అయితే మార్క్స్, ఏంగిల్స్, లెనిన్, స్టాలిన్‌లతో పోల్చుకుంటే మనం చేసే పని చాలా స్వల్పమైనది. అయినప్పటికీ మనం కూడా పనిలో భాగస్వాములమే. చిన్నది కానివ్వండి పెద్దది కానివ్వండి ఒక మహత్తర ఆశయ సాధనలో అదొక భాగం కనుక మన పనిని మనం సజావుగా చేస్తే మన బాధ్యతను మనం సరిగా నెరవేర్చినవాళ్లమవుతాము. సహజంగానే మనం మరింతగా పనిచేయడానికి ప్రయత్నించాలి. ఒకవేళ కొద్దిగా మాత్రమే పనిచేయగలిగినప్పటికీ అది కూడా ఉపయోగకరమైనదే. అది కూడా గౌరవ ప్రదమైనదే అవుతుంది.

ఎటువంటి పరిస్థితుల్లోనూ మనం కమ్యూనిస్టు ఉద్యమ ప్రగతికి ఆటంకం కారాదు. చిన్నదైనా పెద్దదైనా మన పాత్రను మనం నిర్వహించి కష్టమైనా, సులభమైనా మన పనిని చక్కగా నెరవేర్చాలి. పార్టీలోని ప్రతి సభ్యుడూ చేపట్టవలసిన ఖచ్చితమైన వైఖరి ఇది. సాంకేతిక నైపుణ్యంతో కూడిన పనులను చేయడానికి కొంతమంది కామ్రేడ్స్ ఇష్టపడరు. ఈ తరహా పని తమ ప్రతిభను అణచివేస్తుందనీ, పేరు ప్రతిష్టలు రాకుండా అడ్డుకుంటుందనీ (నిజానికి అలా జరగదు. సాంకేతిక విభాగంలో పనిచేసే స్టనకోవ్ ఇందుకు ఉదాహరణ) తమ శక్తియుక్తులు పూర్తిగా వినియోగపడకుండా నిరోధిస్తుందనీ, కమ్యూనిస్టులందరికీ ఉండవలసిన దీక్షాదక్షతలను హరించివేస్తుందనీ వీరి అభిప్రాయం. ఇది పొరపాటు అనుకోవాలి. మన పార్టీలో సాంకేతిక నైపుణ్యంతో కూడిన పని చాలా కీలకమైనది. ఈ రకమైన పనిలో నిమగ్నమై ఉన్న కామ్రేడ్స్ కూడా కమ్యూనిస్టు సాధనలో తమవంతు వాటాను కలిగి ఉన్నారు. ఇతర పనులు చేసే వారెవరికీ వీరేమీ తీసిపోరు. కమ్యూనిస్టు చేయవలసిందేమిటంటే, ఏ పనినైతే పార్టీ అతని నుంచి ఆశిస్తున్నదో ఆ పనిని ఉత్సాహంతోనూ, చక్కగా నెరవేర్చడం. అతడి అభిప్రాయాలకు అనుగుణమైనా కాకపోయినా అలా పనిచేయాలి.

**4** : కొద్దిమంది కామ్రేడ్స్ దోపిడీ వర్గాల భావజాలంతో ఖరాబై ఉన్నారు. సాధారణంగా ఇలాంటివారు ఇతర కామ్రేడ్స్‌తో వ్యవహరించేటప్పుడుగానీ, పార్టీ అంతర్గత సమస్యల పరిష్కారం విషయంలోగానీ సూత్ర రహితంగా ఉంటారు. పరస్పర సహాయమూ, సంఘీభావమూ అనే మహత్తర, నిష్కళంక కార్మికవర్గ, కమ్యూనిస్టు స్ఫూర్తికి వీరు పూర్తిగా దూరంగా ఉంటారు.

ఇలాంటి భావాలతో ఖరాబై ఉన్న వారు పార్టీలోని ఇతర సభ్యులనెత్తినెక్కి కూర్చోవాలని నిరంతరం కలలుగంటారు. ఇందుకు గాను ఇతరులపై దాడిచేయడం, వారికి హాని కలిగించడం చేస్తారు. తమకన్నా ఎక్కువ సామర్థ్యం ఉన్నవారిని చూసి అసూయపడతారు. ముందడుగులో ఉన్న వారిని వెనుకకు లాగడానికి నిరంతరం ప్రయత్నిస్తారు. ఇతరుల క్రింద పనిచేయడానికి వారెంత మాత్రం సహించరు. తమ గురించి తామేగానీ ఇతరుల గురించి ఎంతమాత్ర ఆలోచించరు. ఇతర కామ్రేడ్స్ కష్టాల్లో చిక్కుకున్నా, ఒడిదుడుకుల్లో

> చిల్లర విషయాలపై రాద్ధాంతం చేయడం, సార్వత్రిక ప్రయోజనాన్ని విస్మరించ డం అనే లోపాలు ఇప్పటికీ కొంతమంది పార్టీ సభ్యుల్లో కన్పిస్తాయి. కమ్యూనిస్టు దృక్పథం యొక్క ఔన్నత్యం, విశాలత్వం వీరిలో కొరవడి ముఖ్యమైన అంశాల విషయంలో అంధులవు తారు.

పడ్డా వీరికి ఆనందంగా ఉంటుంది. లోలోపల పొంగిపోతారు. ఒక కామ్రేడ్‌గా ఏమాత్రం సానుభూతి చూపరు. చివరికి వీరు కామ్రేడ్స్‌ను దెబ్బతీయడానికి కూడా వెనుకాడరు. బావిలో పడ్డవాడిపై బండవేసే రకం. కామ్రేడ్స్‌లోని బలహీనతలను, వారికెదురైన ఇబ్బందులను ఆసరా చేసుకొని వారిపై దాడిచేసి హాని కలిగిస్తారు. తమ స్వార్థం కోసం ప్రతి చిన్న అవకాశాన్ని వారు ఉపయోగించుకొంటారు. పార్టీ నిర్మాణంలో ఉన్న బలహీనతలను వాడుకుంటారు. పార్టీలో కలతలు రేపడం వారికి మహాయిష్టం. కామ్రేడ్స్ మధ్య విభేదాలను కలిగించడానికి ఇతరుల గురించి వారి పరోక్షం లో చెడుగా మాట్లాడతారు. పార్టీలో తలెత్తే సూత్ర రహిత వివాదాలలో తలదూర్చడమంటే వారికి మహా ప్రియం. అనవసరమైన తగాదాల పట్ల ఆసక్తి మెండు. పార్టీ ఇబ్బందుల నెదుర్కొంటున్నప్పుడు ఇలాంటి తగాదాలను ఎగదోయడంలో వారు మహా హుషారుగా ఉంటారు. ఒక్కమాటలో చెప్పాలంటే వీరు వంచనాశిల్పంలో ఆరితేరినవారు. ఇలాంటి వారు మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతాన్నీ, పద్ధతినీ ఆకళింపుకొని కార్మికవర్గ భావజాలాన్ని వ్యక్తీకరిస్తారని అనుకోవడం మూర్ఖత్వం అవుతుంది. వారు బోధించేదంతా పతనావస్థ లో ఉన్న దోపిడీ వర్గాల భావజాలాన్నే అనేది సుస్పష్టం.

**5** : చిల్లర విషయాలపై రాద్ధాంతం చేయడం, సార్వత్రిక ప్రయోజనాన్ని విస్మరించ డం అనే లోపాలు ఇప్పటికీ కొంతమంది పార్టీ సభ్యుల్లో కన్పిస్తాయి. కమ్యూనిస్టు దృక్పథం యొక్క ఔన్నత్యం, విశాలత్వం వీరిలో కొరవడి ముఖ్యమైన అంశాల విషయంలో అంధులవు తారు. యాదృచ్ఛికమైన, చిల్లర విషయాలపట్ల వారికి ఎక్కువ మక్కువ. పార్టీలోనూ, విప్లవం లోనూ ఎదురయ్యే క్లిష్ట సమస్యలపట్ల గానీ ఘటన పట్ల గానీ వారు పెద్దగా ఆసక్తి చూపరు. చిల్లర విషయాలపై రచ్చచేస్తారు. ఇటువంటి వాటికి సంబంధించిన చికాకైన, దరీదాపు లేని వాదనలలో తలదూర్చి మనను వికలం చేసు కుంటారు. ఇలాంటివారు కొద్దిపాటి సహాయానికి లేదా దయకు లొంగిపోతారు. గ్రామీణ ప్రాంతాలలోని చిన్న చిన్న ఉత్పత్తిదారుల అల్పమైన లక్షణాలన్నీ వీరికుంటాయి.

పార్టీ జీవితంలో స్పష్టమైన, కచ్చిత మైన వైకరి కలిగి వుండాలన్న విషయాన్ని గుర్తించని వారు మరికొందరుంటారు. తరచుగా వీరు అభిప్రాయాలను మార్చుకుంటూ గోడమీద పిల్లి వాటంగా ఉంటారు. నిజానికి వీరిలో రెండు రకాలైన వారున్నారు. ఒకరిది అవగాహ నకు సంబంధించిన సమస్య. రెండవ రకానికి చెందిన వారు వ్యక్తిగత వ్యవహారాల్లో ఎల్లప్పు డూ అవకాశవాదులుగానే ఉంటారు. ప్రతి వారినీ సంతోషపెట్టాలని చూస్తూ ఉంటారు. వ్యక్తులనుబట్టి, పరిస్థితులను బట్టి వారి మాటలు ఉంటాయి. వీరిది గాలివాటం ప్రవర్తన. మాటమీద నిలబడరు. ఇవీ వారి లక్షణాలు. వీరు పరిస్థితులను గమనిస్తూ, అవసరానికి తగిన విధంగా ఆలోచిస్తూ గెలిచిన పక్షానికి కొమ్ము కాస్తారు. ఇలాంటి రెండు నాల్కల జీవులు, ఇలాంటి ఉభయచరాలు మన పార్టీలో లేరని చెప్పలేము. దళారీ లక్షణాలు వీరికి ఉంటాయి. వీరికితోడు మరికొందరు ఉన్నారు. పాత సమా జానికి చెందిన దోపిడీవర్గాల తళుకుబెళుకుల ప్రపంచాన్నీ, వారి ఆడంబరాలనూ చూసి నిగ్రహించుకోలేని అశక్తులై ఊగిసలాటను ప్రారంభించి తప్పుడుదారులు తొక్కుతారు. పార్టీకీ, విప్లవానికీ ద్రోహం చేస్తారు.

ఇంకా మన పార్టీలోని కొంతమంది కామ్రేడ్స్ ఆలోచనల్లో పెటీబూర్జువాల దుడుకుతనమూ, సంశయమూ, పనీపాటా లేని అలగాజనంలోనూ, దివాళా ఎత్తిన కొంతమంది రైతుల్లోనూ ఉండే విధ్వంసక ప్రవృత్తి పొడచూపుతూ ఉంటాయి. వీటి వివరాల్లోకి ఇక్కడ నేను పోదలచలేదు.

క్లుప్తంగా చెప్పాలంటే మహత్తర మైన, శక్తివంతమైన కార్మికవర్గ కమ్యూనిస్టు భావజాలానికి మన పార్టీ ప్రాతినిధ్యం వహి స్తున్నది. అయితే అన్నిరకాలకు చెందిన కార్మిక వర్గేతర భావజాలం (పతనావస్థలో ఉన్న దోపిడీవర్గాల భావజాలంతో సహా) ఇప్పటికీ కొంతమంది కామ్రేడ్స్‌లో కాస్తో కూస్తో కన్పిస్తూనే ఉన్నది. కొన్ని సార్లు పార్టీలో ఇలాంటి ధోరణి నిగూఢంగా ఉంటూ కేవలం దైనందిన జీవితంలోని స్వల్ప విషయాలలో వ్యక్తమవుతూ ఉంటుంది. మరికొన్ని సార్లు ఇది విశ్వరూపం దాల్చి పార్టీ ఆదర్శాలకూ, ప్రధానమైన రాజకీయ సమస్యలకూ, పార్టీ అంతర్గత పోరాట సమస్య లకూ సంబంధించిన విషయాలలో ఒక పథకం ప్రకారం వ్యక్తమవుతూ ఉంటుంది. పార్టీ నిర్మాణంలోని కొన్ని సెక్షన్లు లేదా కొంతమంది బాధ్యులు ఈ రకమైన తప్పుడు భావాలకు లోబడిపోయి కొరగాకుండా పోయే ప్రమాదం లేకపోలేదు. అరుదైన సందర్భాలలో పార్టీ నాయకత్వంలోని కీలక బాధ్యులు కూడా తాత్కాలికంగా వీటికి లోబడే ప్రమాదం లేకపోలేదు. ఏది ఏమైనప్పటికీ సాధారణ సమయాలలో కచ్చితమైన కార్మికవర్గ భావజాలం ఇలాంటి వాటిని అరికడుతుంది.

ఇవీ.... పార్టీలో కార్మికవర్గ, కార్మికవర్గేతర భావజాలం మధ్య పోరాటాన్ని వ్యక్తం చేసే లక్షణాలు. కొంతమంది పార్టీ సభ్యుల విషయంలో కూడా ఇలానే జరుగుతుంది. కొన్ని సందర్భాలలో వారిలోని తప్పుడు భావాలు అణగివుండి అదుపులో ఉంటాయి. మరికొన్ని సందర్భాలలో ఇవి అంతకంతకూ హెచ్చి వాళ్ల కార్యాచరణను సైతం ప్రభావితం చేస్తాయి. కార్మికవర్గ, కార్మికవర్గేతర భావజాలాల మధ్య వైరుధ్యమూ, పోరాటమూ పార్టీ సభ్యులలో వ్యక్తమయ్యే తీరు ఇది. అన్నిరకాలైన తప్పుడు, కార్మిక వర్గేతర భావజాలాన్ని అధిగమించి, తొలగించుకోవాలంటే పార్టీ సభ్యులు సైద్ధాంతి కంగా స్వయంసాధనకు పూనుకోవలసి ఉం టుంది. అంటే కార్మికవర్గ భావజాలాన్నీ, కమ్యూ నిస్టు ప్రాపంచిక దృక్పథాన్నీ అత్యంత చైతన్యంతో వినియోగించవలసి వుంటుంది.



# కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలకు ఉండాల్సిన లక్షణాలు

**పార్టీ కార్యకర్తలు పార్టీ యొక్క కమాండింగ్ స్టాఫ్ వంటివారు. పార్టీ ఒకసారి సరైన రాజకీయ విధానం రూపొందించుకున్న తరువాత దాన్ని ఆచరణలో పరీక్షించాల్సి ఉంటుంది. ఈ పని పార్టీ నాయకత్వంలో జరుగుతుంది. ఇందులో పార్టీ కార్యకర్తలు నిర్ణయాత్మక పాత్ర వహిస్తారు.**

కమ్యూనిస్టు పార్టీ అనుయాయుల్లో నాలుగు రకాలైన వారుంటారు. సానుభూతి పరులు, సభ్యులు, కార్యకర్తలు, నాయకులు. పార్టీతో వీరి అనుబంధాన్ని బట్టి, పార్టీలో పనిని బట్టి ఈ విధమైన విభజన చేయవచ్చు. వీరి మధ్య తేడాలేమిటి?

1. సానుభూతిపరులు (సింపథైజర్స్) : పార్టీ సిద్ధాంతం పట్ల అంగీకారంతో వుండాలి. ఆర్థికంగా సహాయపడుతుండాలి.

2. పార్టీ సభ్యులు (మెంబర్స్) : పార్టీ సభ్యత్వం, లెవీ క్రమం తప్పకుండా చెల్లించాలి. పార్టీ సాహిత్యం చదవాలి, చదివించాలి. పార్టీ సమావేశాలకు హాజరు కావాలి. ఏదో ఒక ప్రజాసంఘంలో పని చేయాలి.

3. పార్టీ కార్యకర్త (కేడర్) : పార్టీ పట్ల విశ్వాసం కలిగివుండాలి. ప్రజలతో నిత్య సంబంధం కలిగి వుండాలి. స్వతంత్రంగా పని చేయగలిగి ఉండాలి. ఉక్కు క్రమశిక్షణ కలిగి వుండాలి.

4. పార్టీ నాయకుడు (లీడర్): నిర్ణయాలు చేయగలిగి వుండాలి. కార్యకర్తలను వినియోగించే శక్తి కలిగి వుండాలి. తనిఖీ చేయగలిగి వుండాలి. సమీక్ష చేయగలిగి వుండాలి.

పై నాలుగు రకాల అనుయాయుల్లో మనం పార్టీ కార్యకర్తల గురించీ, వారికి ఉండాల్సిన లక్షణాలగురించి తెలుసుకుందాం.

మావో దృష్టిలో పార్టీ కార్యకర్తకు ఈ క్రింది లక్షణాలుండాలి:

1) పార్టీ విధానాన్ని పట్టుదలతో అమలు పర్చగలిగేవాడై ఉండాలి.

2) పార్టీ క్రమశిక్షణకు కట్టుబడి వుండాలి.

3) స్వతంత్రంగా పని చేయగల సామర్థ్యం వుండాలి.

4) చురుకుగా, గట్టిగా పని చేయగలగాలి.

5) నిస్వార్థపరుడై ఉండాలి.

స్టాలిన్ దృష్టిలో పార్టీ కార్యకర్తను అంచనా వేయడానికి రెండు కొలబద్దలున్నాయి. మొదటిది, రాజకీయ కొలబద్ధ. దీని ప్రకారం పార్టీ కార్యకర్త పార్టీ పట్ల విశ్వాసపాత్రుడై ఉండాలి. రెండోది, ఆచరణ కొలబద్ధ. దీని ప్రకారం అతను/ఆమె నిర్ణీత పని చేసే సామర్థ్యం కలిగి ఉండాలి.

చౌఎన్‌లై పార్టీ కార్యకర్తకు ఆరు లక్షణాలుండాలని చెప్పాడు. అతని దృష్టిలో పార్టీ కార్యకర్త....

1) పటిష్టమైన లెనినిస్టు దృక్పధం, జీవితం పట్ల విప్లవ దృక్పధం కలిగి ఉండాలి.

2) సూత్రానికి కట్టుబడి వుండాలి.

3) ప్రజల శక్తిపై నమ్మకం కలిగి వుండాలి.

4) అధ్యయనానికి అంకితం కావాలి.

5) మొక్కవోని పోరాట పటిమ కలిగి ఉండాలి.

6) అత్యున్నత క్రమశిక్షణాపరుడై ఉండాలి.

**కార్యకర్తల ప్రాముఖ్యత:**

పార్టీ కార్యకర్తలు పార్టీ యొక్క కమాండింగ్ స్టాఫ్ వంటివారు. పార్టీ ఒకసారి సరైన రాజకీయ విధానం రూపొందించుకున్న తరువాత దాన్ని ఆచరణలో పరీక్షించాల్సి ఉంటుంది. ఈ పని పార్టీ నాయకత్వంలో జరుగుతుంది. ఇందులో పార్టీ కార్యకర్తలు నిర్ణయాత్మక పాత్ర వహిస్తారు. సరియైన రాజకీయ విధానం రూపొందించుకోవడం అనేది పార్టీకి ప్రాథమికమైన, అత్యంత ముఖ్యమైన విషయం. కాని అంత మాత్రాన సరిపోదు. ఆ విధానాన్ని ప్రజల్లోకి తీసికెళ్ళడానికి తగినంత మంది కార్యకర్తలు వుండాలి. అందువలన పథకం ప్రకారం విస్తారంగా కొత్తకార్యకర్తలను తయారుచేయడం ఒక పోరాట కర్తవ్యంగా చేపట్టాలి.

**కార్యకర్తలలో రకాలు:**

1) విప్లవమే ప్రధాన వృత్తిగా వుండే కార్యకర్తలు (హోల్‌టైమర్స్).

2) ఇతర వృత్తులు చేసుకుంటూ పార్టీకి తోడ్పడేవారు (పార్ట్ టైమ్ వర్కర్స్).

3) పాత కార్యకర్తలు - కొత్తకార్యకర్తలు.

4) స్థానిక - స్థానికేతర కార్యకర్తలు.

5) అక్షరాస్యులు - నిరక్షరాస్యులు.

6) పార్టీ కార్యకర్తలు - పార్టీయేతర కార్యకర్తలు.

7) వివిధ ప్రజా సంఘాలలో పని చేసే కార్యకర్తలు.

పనినిబట్టి వివిధ రకాలుగా కార్యకర్తలను మూడు రకాలుగా విభజించవచ్చు. మొదటి రకం వారు ప్రచారకులు. రెండో రకంవారు ఆందోళనకారులు. మూడో రకం నిర్మాణ దక్షత కలవారు.

**కొత్త కార్యకర్తల అవసరం:**

కమ్యూనిస్టు పార్టీ నిరంతరం కొత్త పార్టీ కార్యకర్తలను సమకూర్చుకోవలసి ఉంటుంది. ఎందుకంటే ఉద్యమంలో కార్యకర్తల సంఖ్య అనేక కారణాల వల్ల తగ్గిపోతూ ఉంటుంది. కొందరు సహజ మృత్యువుకు గురియవుతారు. మరి కొందరు పోరాటాల్లో అమరులౌతారు. పనికిరాకుండా వృధా అయ్యే కార్యకర్తలు కొందరుంటారు. కొందరు పార్టీ ద్రోహులుగా మారి, కొందరు క్రమశిక్షణా చర్యలకు గురై పార్టీనుండి వెళ్లిపోతారు. వీరి స్థానంలో కొత్త కార్యకర్తలను తీసుకోవలసి ఉంటుంది. ఇది కాకుండా పార్టీ విస్తృతం అయ్యేకొద్దీ కొత్త ప్రాంతాలకు కార్యకర్తల అవసరం పెరుగుతుంది. ఎంత ఎక్కువ మంది కార్యకర్తలుంటే ఉద్యమం అంత ఎక్కువగా

పెరుగుతుంది.

కార్యకర్తలను ఎంపిక చేసేటప్పుడు కొన్ని ముఖ్యమైన అంశాలు దృష్టిలో ఉంచుకుని ఎంపిక చేయాలి. వర్గ పొందిక, సాంఘిక పరిస్థితి, రాజకీయ చైతన్యం, పని సామర్థ్యం...వీటిని బట్టి కార్యకర్తలను ఎంపిక చేయాలి.

**అవలక్షణాలు-తప్పుడు దృక్పథాలు:**

పార్టీ కార్యకర్తల్లో అనేక అవలక్షణాలు కనిపిస్తుంటాయి. దృక్పథానికి సంబంధించి అనేక తప్పుడు ధోరణులు ఉంటాయి. కార్యకర్తలు స్వయం సాధన ద్వారానూ, విమర్శ - ఆత్మ విమర్శ ద్వారానూ వీటిని వదిలిపెట్టాలి.

మొదటిది అవలక్షణాలు: పెత్తందారీతనం, అహంభావ-నమ్రత లేకపోవడం, నిరాశా వాదం, కోపగించుకోవడం. స్వీయ మానసిక తత్వంతో పనిచేయడం, వ్యక్తిగత వాదం-పిడి వాదం, విచ్ఛిన్న వాదం-ముఠాతత్వం, ఆత్మ విమర్శ చేసుకోకపోవడం, స్వార్థంతోనూ పార్లమెంటరీతత్వంతోనూ వుండటం, ప్రజలను చిన్నచూపు చూడటం, ఉదారవాదం-దుందుడుకు వాదం, మొక్కుబడిగా పనిచేయడం.... ఇవన్నీ కార్యకర్తలు వదులుకోవలసిన అవలక్షణాలు.

ఇక రెండవది కార్యకర్తల దృక్పదానికి సంబందించి వదిలిపెట్టాల్సిన అంశాలు ఇలా ఉంటాయి: కొంత మంది కార్యకర్తలు రోజువారి ప్రజల సమస్యలకు విలువ ఇవ్వరు. మరికొంత మంది దీర్ఘకాలిక కార్యక్రమానికి విలువనివ్వరు. ఈ రెండూ తప్పు. రెంటికీ తగు ప్రాధాన్యత ఇవ్వాలి.

ఎప్పుడైనా ఒక కేంద్ర కర్తవ్యం వుంటుంది. మిగతా కర్తవ్యాలు ద్వితీయ, తృతీయ శ్రేణికి చెంది వుంటారు. కార్యకర్త దీన్ని అవగతం చేసుకోవాలి.

నిరాశా నిస్పృహలకు గురి కాకూడదు. కొందరు తప్పులు చేస్తున్నానని బాధపడి నిస్పృహ చెందుతారు. అలాగే ఎప్పుడూ తప్పులు చేయనని అనుకోవడం కూడా పొరపాటే అవుతుంది. పనిలో ముందంజ వేయలేక పోవటం, ఫలితం సాధించలేకపోవడంతో నిరాశా నిస్పృహ తెస్తుంది. అలాగే కొన్నిసార్లు ఫలితాలు, విజయాలు సాధించడంతో గర్వం, విర్రవేగే తత్వాన్ని పెంచుతాయి.

కార్యకర్తలు తమకు అర్థమైనదంతా ప్రజలకు అర్థమైందని అనుకో కూడదు. ప్రజలు అర్థంజేసుకున్నదీ లేనిదీ ప్రజల్లోకి వెళ్ళి పరిశీలన చేస్తేనే తెలుస్తుంది.

ప్రజలమీద అధారపడినంతకాలం, ప్రజల సృజనాత్మక శక్తిపై నమ్మకముంచి నంతకాలం ఏ కష్టాన్నైనా అధిగమించ వచ్చు, శత్రువును ఓడించవచ్చు.

**కార్యకర్తలు అభివృద్ధి చేసుకోవాల్సిన లక్షణాలు:**

- పరిశీలనా తత్వం అలవరుచుకోవాలి.
- చదవడం ద్వారా నేర్చుకోవాలి.
- ఆచరించడం ద్వారా నేర్చుకోవాలి.
- నాయకత్వ పాత్రలో ఇతరులకు ఆదర్శంగా వుండాలి.
- లక్ష్యాన్ని సాధించే వరకు పోరాడాలి.
- మాటలకు చేతలకు పొంతన వుండాలి.
- కోపం పనికిరాదు. ఇతరులతో చర్చిస్తుండాలి.
- ప్రజల మిత్రులుగా వుండాలి. వారిపై పెత్తనం చేయరాదు.
- అలుపెరగని ఉపాధ్యాయుల మాదిరిగా ఉండాలే తప్ప పెత్తందారీ రాజకీయ నాయకుల మాదిరిగా వుండరాదు.
- స్వప్రయోజనం కన్నా ప్రజాప్రయోజనం మిన్నగా వుండాలి.
- స్వార్థం, అవినీతి, ఒళ్ళు దాచుకోవడం విడనాడాలి.
- తనుమాత్రమే మంచివాడిని/ మంచిదాన్ని అనీ ఇతరులు పనికిరారనీ భావించ కూడదు.
- ప్రజలను ప్రేమిస్తూ, వారితో మమేకం అవుతూ, వారికి నచ్చ చెప్పుతూ, ఉత్సాహ పరుస్తూ ముందుకు పోవాలి.
- ఇతరులను పర్యవేక్షిస్తూ, నేర్పుతూ ఉండాలే తప్ప, పనికిరారని వదిలివేయకూడదు.
- తక్షణ కోర్కెలు పైబడినప్పుడు దీర్ఘకాలిక కర్తవ్యాలను మరువరాదు. దీర్ఘకాలిక కర్తవ్యాల కోసం తక్షణ కోర్కెలను మరువరాదు.
- దేశభక్తితోపాటు అంతర్జాతీయ తత్వం వుండాలి.
- అధ్యయనంలో ఆదర్శంగా వుండాలి.
- శత్రువు పట్ల ఎప్పుడూ జాగ్రత్తగా వుండాలి.
- ఐక్యకార్యాచరణతోపాటు స్వతంత్ర కార్యాచరణకు ప్రాధాన్యత నివ్వాలి.
- పార్టీ నుండి స్వతంత్రతను వ్యక్తం చేయరాదు. అంటే పార్టీవేరు తనువేరు, పార్టీ పనివేరు తనపని వేరు అనుకోకూడదు.
- పోరాటంలో తక్కువ అనుభవం వున్నవారు తత్కారణంగా బాధ్యతలు తీసికోవడానికి వెనక్కు తగ్గుతారు. పోరాటంలో ఎక్కువ అనుభవం వున్నవారు కుర్రకుంకవు నీకేం తెలుసు, నీకేం అనుభవం వుంది అని ఇతరులను చిన్న చూపు చూడటం తగదు.
- బాగా చదివిన వారు చదువు తక్కువగా వున్న రైతులనూ, వ్యవసాయ కార్మికులనూ కించపరిచి చూడటం తగదు. ప్రత్యేక విజ్ఞానంతో అహంభావం పొందితే ఇతరుల యెడల చిన్న చూపు ప్రబలవచ్చు. ఇలాంటి బూజు వదిలించుకోకపోతే తప్పులు జేస్తుంటారు.
- కష్టకాలంలో మన విజయాలను మర్చిపోరాదు. ధైర్యాన్ని కోల్పోరాదు.
- పనిలో ప్రతినిత్యం కొత్త శైలి అలవర్చుకోవాలి.

**కార్యకర్తలు ఇంకా ఈ పనులు చేయాలి:**

సిద్ధాంతాన్ని ఆచరణలో మేళవించాలి. ప్రజల తలలో నాల్కలా వుండాలి. ఆత విమర్శనా పద్ధతిని అలవర్చుకోవాలి. పిడివాదాన్ని విడనాడాలి. ఎప్పుడూ ప్రజలపై అధారపడాలి, వారిని నమ్మాలి. ప్రజలపై నమ్మకముంటే ఏ శత్రువూ ఓడించలేదు. చైతన్యయుతంగా ఆత్మ విమర్శ చేసుకోవాలి. తెలిసినదంతా చెప్పు, మినహాయింపులు లేకుండా. చెప్పిన వారిని నిందించకు, చెప్పిన విషయం జూడు. తప్పులు చేస్తే సరిదిద్దుకో, చేయకపోతే చేయకుండా జాగ్రత్తపడు. ప్రవహించే నీరు చప్పగా వుండదు, తలుపు గడియ ఎప్పుడూ తుప్పు పట్టదు. రోజు తడవక పోతే ఇంటిలో దుమ్ము చేరుతుంది. రోజూ కడగక పోతే ముఖానికి మురికి పడుతుంది. అందుకనే పాత పొరపాట్లనుండి నేర్చుకో భవిష్యత్తులో చేయకుండా వుండేందుకు.

దీర్ఘకాల దృష్టితో జూస్తున్నప్పుడు శత్రు బలాన్ని తక్కువగా అంచనా వేయరాదు. తక్షణ పోరాటాల విషయంలో శత్రుబలాన్ని తక్కువగా అంచనా వేయరాదు. అలా చేయడం అతివారం అవుతుంది. దీర్ఘకాలిక దృష్టితో అతిగా అంచనా వేయడం మితవాదం అవుతుంది.

జీవితంలో నిరాడంబరంగా వుండాలి- పోరాటంలో కరుకుగా వుండాలి. ఉత్సుకతకలిగి ఉండాలి. పట్టుదలలో వుడుంపట్టు నిత్యం వుండాలి. సమగ్ర ప్రణాళికతో పని చేయాలి. పని కొనసాగుతున్నప్పుడు వాస్తవపరిస్థితులను బట్టి పథకాలను సరిచేస్తుండాలి.

గుడ్డిగా రొటీన్ పద్ధతినే అనుసరించడం, దానిని అధిగమించడానికి భయపడడం, దాంతో మార్పును గమనించడానికి భయ పడడం, దీనితో నలుగురితో నారాయణ, గాలివాటం, నీ అభిప్రాయమే నా అభిప్రాయం అని చెప్పి కూర్చొని పోవడం...తగదు.

కార్యకర్తకు కార్మికవర్గ ప్రపంచ దృక్పథం తప్ప మరేది ఉండరాదు. స్వీయ ఆలోచనను, పని పద్ధతులను దిద్దుబాటు ద్వారా సంస్కరించుకోవాలి. 

# పార్టీలో అంతరంగిక పోరాటం ఎలా నిర్వహించాలి?

**కమ్యూనిస్టు పార్టీలో అంతరంగిక పోరాటమనేది ఇష్టంవచ్చినట్లు సాగే బూటకపు ప్రజాస్వామ్యానికి దారితీసేదిగా ఉండకూడదు. మన ఆత్మవిమర్శ, పార్టీలో ఆంతరంగిక పోరాటం అనేవి పార్టీ నిర్మాణాన్నీ, సంఘీభావాన్నీ, క్రమశిక్షణనూ, ప్రతిష్టతనూ నీరుగార్చడానికో లేదా పార్టీ పనిని ఆటంకపరచటానికో ఉద్దేశించినవి కావు. అవి పార్టీ నిర్మాణాన్నీ, సంఘీభావాన్నీ పటిష్టపరచడానికీ, పార్టీ క్రమశిక్షణనూ, ప్రతిష్టనూ పెంచటానికీ, పార్టీ పనివిధానాన్ని మెరుగుపరచటానికీ ఉద్దేశించినవి.**

**లీ షావ్‌చీ**

కమ్యూనిస్టు పార్టీలో అంతరంగిక పోరాటమనేది అత్యంత ప్రాధాన్యంగల విషయం. అంతరంగిక పోరాటాన్ని నిర్వహించేటప్పుడు మనం నిక్కచ్చిగానూ, అత్యంతా బాధ్యతాయుత వైఖరితోనూ ఉండాలి. నిర్లక్ష్యంగా వ్యవహరించరాదు. పార్టీలో అంతరంగిక పోరాటం నిర్వహించేటప్పుడు మనం పార్టీ వైఖరికి పూర్తిగా కట్టుబడి ఉండాలి. పార్టీ ప్రయోజనాలకు నిస్వార్థంగా తోడ్పడే వైఖరిని చేపట్టాలి. ఇతర కామ్రేడ్స్ తమ పొరపాట్లను గుర్తించి సమస్యల పట్ల సదవగాహన కలిగివుండేందుకు తోడ్పడాలి. సమగ్రమైన పరిశీలన, అధ్యయనాల ద్వారా ముందుగా మనం వాస్తవాలను గురించీ, సమస్యల గురించీ స్పష్టమైన అవగాహన కలిగిఉండాలి. అదే సమయంలో మనం పార్టీ అంతరంగిక పోరాటాన్ని నియమబద్ధంగానూ, సకల సన్నాహాలతోనూ సమర్ధవంతమైన నాయకత్వంతోనూ ముందుకు తీసుకు వెళ్లాలి.

ముందుగా మనం సవ్యమైన వైఖరి చేపట్టడం ద్వారా మాత్రమే ఇతర అపసవ్య వైఖరులను సరిదిద్దగలమని కామ్రేడ్స్ గ్రహించాలి. సవ్యంగా ప్రవర్తించడం ద్వారా మాత్రమే ఇతరుల అపసవ్య ప్రవర్తనను సరిదిద్దగలం. ఏదో సామెత చెప్పినట్లుగా "ఇతరుకు చెప్పే ముందు మనలను మనం సరిదిద్దుకోవాలి".

నీలో ఊగిసలాట లేనప్పుడు మాత్రమే నీవు ఊగిసలాడే వాళ్లకు వారి ఊగిసలాట నుంచి బయటపడేందుకు తోడ్ప డగలవు.

సవ్యమైన సూత్రాలతోనూ, సిద్ధాంతంతోనూ నీవు సాయుధమైనప్పుడే అసవ్య సూత్రాలనూ, సిద్ధాంతాలనూ అధిగమించడానికి ఇతరులకు తోడ్పడగలవు.

సూత్రబద్ధమైన విషయాల పట్లా, సక్రమమైన విషయాలపట్లా మంచి అవగాహన కలిగి వున్నపుడే ఇతరులలోని గందరగోళాన్ని పారద్రోలడానికి తోడ్పడగలవు.

నిర్దిష్ట సమస్యల గురించి చాలినంత సమాచారాన్ని సేకరించి, ఒక క్రమపద్దతిలో అధ్యయనం చేసినప్పుడు మాత్రమే ఇతర కామ్రేడ్స్‌కూ, పార్టీకీ మరింత సహాపడగలవు.

ఈ రకంగా చేయకపోతే నీవు సవ్యమైన వైఖరిని చేపట్టడంలో మందుపీఠన నిలవలేవు. సవ్యమైన సూత్రాల గురించి సమగ్ర జ్ఞానాన్ని పొందలేవు. భౌతిక పరిస్థితులను సూత్రానుగుణంగా చూడలేకపోయినా, లేదా సమస్యలను క్రమబద్ధంగా అధ్యయనం చేయలేకపోయినా, నీలో ఏవైనా నిర్దిష్ట లోపాలు కొన్ని ఉండి నిర్దిష్టమైన అంశాలపై స్పష్టత లోపించినా పార్టీ అంతరంగిక పోరాటక్రమంలో ఇతరుల లోపాలను సవరించే శక్తి నీకు సమకూరదు. అలా కాకుండా తలబిరుసుతనంతో పోరాటాన్ని ముందుకు తీసుకెళ్లేందుకు ప్రయత్నిస్తే తప్పుడు దారిలో నీ ప్రయాణం ముగుస్తుంది.

కేవలం వాస్తవికమైన సత్యాలు మాత్రమే, కేవలం ఆచరణ గీటురాయిపై నిగ్గుదేలిన అనుభవాలు మాత్రమే, కేవలం యధార్థాలు మాత్రమే విజయపతాకను ఎగురవేయగలవు.

మన ఆత్మవిమర్శ, పార్టీలో ఆంతరంగిక పోరాటం అనేవి పార్టీ నిర్మాణాన్నీ, సంఘీభావాన్నీ, క్రమశిక్షణనూ, ప్రతిష్టతనూ నీరుగార్చడానికో లేదా పార్టీ పనిలో అభివృద్ధిని ఆటంకపరచటానికో ఉద్దేశించినవి కావు. దానికి భిన్నంగా అవి పార్టీ నిర్మాణాన్నీ, సంఘీభావాన్నీ పటిష్టపరచడానికీ, పార్టీ క్రమశిక్షణనూ, ప్రతిష్టనూ పెంచటానికీ, పార్టీ పనివిధానాన్ని మెరుగుపరచటానికీ ఉద్దేశించినవి. పార్టీ అంతరంగిక పోరాటమనేది ఇష్టంవచ్చినట్లు సాగే బూటకపు ప్రజాస్వామ్యానికి దారితీసేదిగా ఉండకూడదు. పార్టీలోపల పెత్తందారీతనాన్నీ, బూటకపు ప్రజాస్వామ్యాన్నీ అనుమతించరాదు. ఈ రెండూ పార్టీలోపల అసాధారణ స్థితికి సంబంధించిన రెండు ధృవాలు.

పార్టీపట్ల, విప్లవంపట్ల మహత్తర మైన బాధ్యతతో పార్టీ అంతరంగిక పోరాటాన్ని నిర్వహించాలి.

రెండవ విషయం: పార్టీ అంత రంగిక పోరాటమనేది మౌలికంగా పార్టీలోపల విరుద్ధ భావజాలకూ, సూత్రాలకూ మధ్య సాగే పోరాటమని కామ్రేడ్స్ తప్పనిసరిగా గుర్తుంచు

కోవాలి. పార్టీలో రకరకాలైన భావాలకూ, సూత్రాలకూ మధ్య ఉండే వైరుధ్యానికి అది ప్రాతినిధ్యం వహిస్తుంది. కనుక భావజాలానికీ, సూత్రాలకూ సంబంధించి స్పష్టమైన విభజన కావించడం అత్యంతావశ్యకం. అయితే నిర్మాణ దృష్ట్యా చూసినప్పుడు పోరాట రూపమూ, మాట్లాడేతీరూ, విమర్శించే పద్ధతీ సాధ్యమైనంత తక్కువ వైరీభావంతో ఉండాలి. చర్చలు వాదనలు ప్రశాంతంగా జరపాలి. సాధ్యమైనంత మేరకు క్రమశిక్షణా చర్యలను చేపట్టకుండానూ, నిర్మాణపరమైన నిర్ధారణలు చేయకుండానూ ఉండేందుకు ప్రయత్నించాలి.

> **"పార్టీ అంతరంగిక పోరాటంలో మనం సూత్రాల విషయం లోనూ, భావజాలం విషయంలోనూ పోరాడే టప్పుడు సమరశీలత ఉండాలి. అదే విధంగా నిర్మాణానికీ, పోరాట రూపానికీ సంబంధించిన విషయాలలో సాధ్యమైనంత ప్రశాంతంగా ఉండాలి."**

భావజాలం విషయంలోనూ, సూత్రాల విషయంలోనూ ఐక్యత సాధించేటందుకై పార్టీ అంతరంగిక పోరాట సమయంలో కామ్రేడ్స్ తప్పనిసరిగా చిత్తశుద్ధితోనూ, నిష్కల్మషంగానూ, సానుకూలంగానూ వ్యవహరించాలి. మరో మర్గం లేనప్పుడూ, అనివార్యమైనప్పుడూ మాత్రమే మనం తీవ్రమైన పోరాట రూపాలను చేపట్టవచ్చు. నిర్మాణపరమైన చర్యలను తీసుకోవచ్చు. తన తప్పులనే పట్టుకు వేళ్లాడే పార్టీ సభ్యుని విషయంలో నిర్మాణపరమైన నిర్ధారణలకు వచ్చేందుకు పార్టీ సంఘాలన్నింటికీ వాటి వాటి పరిధుల్లో పూర్తి హక్కులున్నాయి. కొన్ని కొన్ని పరిస్థితులలో క్రమశిక్షణా చర్యలు చేపట్టడం, నిర్మాణపరమైన చర్యలు తీసుకోవడం అనివార్యమవుతుంది. అయితే ఇలాంటి చర్యలను యధాలాపంగానో, విచక్షణా రహితంగానో తీసుకోవటం జరగదు. కామ్రేడ్స్‌కు తీవ్రమైన శిక్షలను విధించినంత మాత్రాన పార్టీ క్రమశిక్షణ నిలబడదు. కామ్రేడ్స్‌కు విధించే శిక్షలపై పార్టీ క్రమశిక్షణ, పార్టీ ఐక్యత నిలబడవు. (ఒకవేళ అలా నిలిచివున్నట్లయితే అది పార్టీలో సంక్షోభానికి గుర్తు.) భావజాలాలకు సంబందించీ, సూత్రాలకు సంబందించీ పార్టీ యధార్ధ ఐక్యత అనేది అత్యధిక పార్టీ సభ్యుల చైతన్యంపై ఆధారపడి ఉంటుంది. భావజాలానికీ, సూత్రాలకూ సంబంధించి మనమెప్పటికీ పూర్తి స్పష్టతతో ఉంటే అవసరమైనప్పుడు నిర్మాణపరమైన నిర్ధారణలకు రావటం సులభం. పార్టీ సభ్యులను బహిష్కరించటానికి లేదా పార్టీ నుంచి స్వచ్ఛందంగా ఉపసంహరించుకోవటానికి ఒక్క నిమిషం కూడా పట్టదు.

విభిన్నమైన భావజాలానికీ, సూత్రాలకూ సంబంధించి కామ్రేడ్స్ వట్టుదల ప్రదర్శించవచ్చు. వ్యతిరేకతనూ, వాదనలనూ వినిపించవచ్చు. అయితే అవన్నీ పార్టీ నిర్మాణానికీ, మెజరిటీకీ, అగ్రస్థాయి నాయకత్వం పట్ల విధేయతకూ లోబడి ఉండాలి. అలా కాకపోతే పార్టీలో ఐక్యత ఉండదు. సమైక్య చర్యలు ఉండవు. సూత్రబద్ధమైన విషయాలపై తమకున్న పట్టుదల కారణంగా కామ్రేడ్స్ ఎన్నడూ పార్టీని నిర్మాణరీత్యా వ్యతిరేకించడంగానీ, మెజారిటీనీ, అగ్రనాయకత్వాన్నీ ధిక్కరించడంగానీ, స్వతంత్ర చర్యలకు పూనుకోవడం గానీ చేయరాదు. అలా చేస్తే అది పార్టీ మౌలిక క్రమశిక్షణను ఉల్లంఘించినట్లే అవుతుంది.

పార్టీ అంతరంగిక పోరాట నిర్వహణలో మనం అనుసరించవలసిన కచ్చితమైన పద్ధతులు ఇలా ఉండాలి: సూత్రాల విషయం లోనూ, భావజాలం విషయంలోనూ పోరాడే టప్పుడు సమరశీలత ఉండాలి. అదే విధంగా నిర్మాణానికీ, పోరాట రూపానికీ సంబంధించిన విషయాలలో సాధ్యమైనంత ప్రశాంతంగా ఉండాలి. చాలామంది కామ్రేడ్స్ పొరపాటు పడటానికి కారణమేమిటంటే ఒకవైపున భావజాలానికీ, సూత్రాలకూ సంబంధించి ఎలాంటి పోరాటంగానీ, సుస్పష్టమైన విభేదాలు గానీ వుండవు. మరోవైపున నిర్మాణానికీ, పోరాటరూపాలకూ సంబంధించిన విషయాలపై శృతిమించిన పోరాటం ఉంటుంది. ముఖం కందగడ్డలా మారేవరకూ వాదనలు చేస్తారు. శాపనార్థాలు పెడతారు. రకరకాల పేర్లతో ఒకర్నొకరు పిలుచుకొంటారు. ఒకరితో మరొకరు కలుసుకోవటానికి ఇష్టపడనంతగా తగువులాడుతారు. వాళ్లమధ్య విద్వేషం ప్రబలుతుంది. అయితే విచిత్రమేమిటంటే సూత్రాలకూ, భావజాలానికీ సంబంధించి వారి మధ్య విభేదాలు వుండవు.

మూడవ విషయం: పార్టీ నిర్మాణంపైనా, లేదా కామ్రేడ్స్‌పైనా, వారి పనివిధానంపైనా చేసే విమర్శలు సముచితంగానూ, సక్రమంగానూ ఉండాలి. బోల్షివిక్ ఆత్మవిమర్శ ఎప్పుడూ బోల్షివిక్ ప్రమాణాలకు అనుగుణంగా ఉండాలి. శృతితప్పిన విమర్శ, ఇతరుల తప్పులను అతిగా చూపడం, విచక్షణారహితంగా పేరుపెట్టి చెప్పడం ఇవన్నీ సరైన పద్ధతికాదు. అంతరంగిక పోరాటంలో ఉగ్రరూపం దాల్చటం ఉత్తమమని అనుకోరాదు. పార్టీ అంతరంగిక పోరాటాన్నెప్పుడూ తగిన పరిమితులలో, సముచితమైన రీతిలో నిర్వహించాలి. గుడ్డివాడు రాయి విసిరిన విధంగా ఉండకూడదు.

ఇతరులను ఎత్తిచూపేటప్పుడు లేదా వారి తప్పులను విమర్శించేటప్పుడు కామ్రేడ్స్ తప్పనిసరిగా కీలకమైన అంశాలు గ్రహించి ప్రధానమైన విషయాలనే ప్రస్తావించాలి. సరియైన తీరులో స్పష్టమైన రీతిలో సమస్యలను ఇతరులకు వివరించాలి. అలా చేస్తే సమస్యలు పరిష్కారం కాగలవు. ఇతరుల తప్పులను రకరకాలుగా చిత్రించరాదు. అలా చేస్తే నీవు ఉద్దేశపూర్వకంగానే ఇతరులలో తప్పులు వెదుకుతున్నావని, దాడి చేస్తున్నావనీ, దెబ్బ తీస్తున్నావనీ మిగిలినవారు భావించే ప్రమాదం ఉంది.

ఒకానొక కామ్రేడ్ గురించి అంచనా వేయాలన్నా, విమర్శించాలన్నా అతిని లోపాలను తప్పులను మాత్రమే నీవు ఎత్తిచూపరాదు. అవే అతని సర్వస్వమన్నట్లుగా చెప్పరాదు. చెప్పుకోదగిన అతని ఘనకార్యాలనూ, అనుసమాన సేవలనూ, సద్విషయాలనూ, సరియైన అతని దృక్పథాన్నీ కూడా వివరించాలి. ఒకవేళ అతని అభిప్రాయాల్లో సరియైనవి స్వల్పమే అయినప్పటికీ వాటిని విడిచిపెట్టరాదు. అలా చేయగలిగిన నాడే అతని గురించి పూర్తి అంచానాకు రాగలవు. విమర్శించగలవు. తనను తాను మెరుగుపరచుకోవటానికి అతనికి తోడ్పడగలవు. అతనికి

**" పార్టీలోపలా, వెలుపలా జరిగే పోరాటాల మధ్య స్పష్టమైన విభజన ఉండాలి. సముచిత సమన్వయం ఉండాలి. పార్టీ వెలుపల జరిగే పోరాటం పార్టీ అంత రంగిక పోరాటంలో అనుసరించే రూపాలను ఎంత మాత్రం తీసుకోరాదు. అలాగే పార్టీ అంతరంగిక పోరాట రూపాలు పార్టీ వెలుపల పోరాట రూపాలను పోలివుండరాదు. "**

నచ్చచెప్పగలవు.

పార్టీ ఆంతరంగిక పోరాటంలో మనం అనుసరించవలసిన పద్ధతి ఇది. గుడ్డివాడు రాయి విసిరినట్లు కాకుండా సముచిత మైన విమర్శనూ, సముచితమైన వైఖరినీ, సముచిత మైన పద్ధతినీ అనుసరించాలి.

నాలుగో విషయం: పార్టీలోపల గానీ, వెలుపలగానీ పోరాట సమావేశాల నిర్వహణను నిలిపివేయాలి. కార్యాచరణను మదించి వేసి సమీక్షించే సందర్భంలోనే రకరకాల లోపాలను, తప్పులను ఎత్తిచూపవలసి వుంది. ముందుగా మనం 'విషయాన్ని' చర్చించాలి. ఆ తరువాత వ్యక్తి గురించి మాట్లాడాలి. ముందుగా మనం వాస్తవాలను సమస్యలను, స్వభావాన్ని, తీవ్రతను గ్రహించాలి. లోపాలకు తప్పులకు గల మూల కారణాలను గ్రహించాలి. అప్పుడు మాత్రమే ఈ లోపాలను, తప్పులకు బాధ్యులెవరో, ఎవరి భాధ్యత ఎక్కువో, ఎవరి బాధ్యత తక్కువో గమనించాలి.

ఈ పొరపాట్లకు, ఈ తప్పులకు బాధ్యులు ఎవరా అన్న విషయంతో మన పరిశీలన ప్రారం భించరాదు. ఎవరైనా ఒక కామ్రేడ్ తెలియక తప్పుచేసి దానిని గుర్తించి సరిదిద్దుకుంటే అతని పట్ల ఆదరాన్ని చూపాలి. ఆ తప్పును పదే పదే గుర్తు చేయరాదు. పార్టీ అంతరంగిక పోరాటాన్ని నిర్వహించడంలో మన ఉద్దేశం మన కార్యకర్తలనూ, కామ్రేడ్స్‌నూ చావుదెబ్బ తీయటం కాదు. ఇతరులపైన దాడి చేయటం కాదు. అలా చేసినట్లయితే దానికీ, దోపిడీ వర్గాలు కార్మికులపై కొరడా ఝుళిపిస్తూ అణచి వేయటానికి తేడా ఉండదు. మన విధానమే మిటంటే కార్యకర్తల మధ్య పరస్పర సహకారం, ఒండొరుల మధ్య పరిశీలన ఉండాలి.

పదే పదే నిర్ణయాలనూ, క్రమ శిక్షణనూ, కమ్యూనిస్టు నీతినీ ఉల్లంఘిస్తూ దారి తప్పిన కామ్రేడ్స్‌ను సూత్రబద్ధమైన అంశాలకు కట్టుబడి వుండేలా చేయటం అసాధ్యమని పించినప్పుడు నిర్దిష్టమైన విచారణా సమావేశా లను నిర్వహించడం అనుమతించదగినదే. కొన్ని సార్లు అవసరం కూడా అవుతుంది. అయితే ఇలాంటి సమావేశాల నిర్వహణ అలవాటుగా మార్చుకుంటే అది తప్పవుతుంది.

ఐదవ విషయం: విమర్శకు లేదా శిక్షకు గురైన కామ్రేడ్స్‌కు అప్పీలు చేసుకునే అవకాశం ఉండాలి. నియమం ప్రకారం ఒక కామ్రేడ్‌కు సంబందించిన రికార్డులను నిర్మాణ పరమైన నిర్ధారణలను ఆ కామ్రేడ్‌కు తెలియచేయాలి. ఈ నిర్ధారణలు కూడా అతని సమక్షంలో జరగాలి. ఒక వేళ అతను వ్యతిరేకత తెలిపితే ఆ తర్వాత చర్చలు జరిపి పై కమిటీకి విష యాన్ని వివరించాలి. (పార్టీ విధించిన శిక్ష పట్ల ఒక కామ్రేడ్ అసంతృప్తిని వ్యక్తంచేస్తే ఆ కామ్రేడ్ అప్పీలు చేయడానికి తిరస్కరించి నప్పటికీ సంబంధిత బాధ్యుడు పై కమిటీకి ఈ విషయాన్ని తీసుకువెళ్లాలి). శిక్షకు గురైన కామ్రేడ్ పై కమిటీకి అప్పీలు చేసుకోకుండా ఆపే అధికారం ఏ పార్టీ కమిటీకీ లేదు. అప్పీలు చేసుకునే హక్కును ఏ పార్టీ సభ్యునికీ తృణీకరించ రాదు. అప్పీలును బిగదొక్కే అధికారం ఏ పార్టీ కమిటీకి లేదు.

భావజాలానికీ, సూత్రాలకూ సంబం ధించిన విషయాల్లో సంబంధిత పార్టీ సభ్యుడు పై కమిటీకి గాని లేదా కేంద్రకమిటీకి గానీ నేరుగా అప్పీలు చేసుకోవచ్చు. తానున్న పార్టీ కమిటీతో సంబంధం లేకుండా ఈ పని చేయ వచ్చు. ఈ రకమైన అప్పీలు చేసుకునే ముందు సంబంధిత కామ్రేడ్ తన అభిప్రాయాలనూ, కారణాలనూ, విభేదాలనూ సంబంధిత కమిటీకి వివరించాల్సి వుంది. అంతేకాని తన కమిటీలో మౌనంగా ఉండి పై కమిటీని వంచిచే విధంగా బాధ్యతా రహితమైన వ్యాఖ్యలను పై కమిటీల వద్ద చేయరాదు. అప్పీలుపై తుది నిర్ణయం తీసుకునే బాధ్యత కమిటీదే అవుతుంది. ఆ కామ్రేడ్‌పై దిగువ కమిటీ తీసుకున్న క్రమ శిక్షణా చర్యలను పైకమిటీ తొలగించవచ్చు. లేదా తగ్గించవచ్చు. అదీకాకపోతే హెచ్చించవచ్చు.

బావజాలానికీ, సూత్రానికీ సంబంధించి పార్టీ కమిటీలో చర్చల అనంతరం అంగీకారం కుదరకపోతే మెజార్టీ నిర్ణయం ద్వారా ఈ నిర్ణయం పరిష్కరించుకోవలసి ఉంది. విరుద్ధ అభిప్రాయాలు గల మైనారిటీ తన అభిప్రా యానికి కట్టుబడి వుండే హక్కు ఉంది. అయితే నిర్మాణ విషయాలలోనూ తమ తమ కార్యక లాపాల విషయాలలోనూ వారు మెజార్టీ నిర్ణ యానికే పూర్తిగా కట్టుబడి ఉండాలి.

పని సమీక్షకోసం సమావేశాన్ని ఏర్పాటు చేయవలసిందిగా నిర్దిష్ట సంఖ్యలో కామ్రేడ్స్ గానీ దిగువ స్థాయి కమిటీలో గాని కోరినప్పుడు పై స్థాయి కమిటీ లేదా నాయకత్వ సంస్థలు అవకాశాన్ని చూసుకొని అలాంటి సమావేశాన్ని ఏర్పాటు చేయాలి.

ఆరో అంశం: పార్టీలోపలా, వెలుపలా జరిగే పోరాటాల మధ్య స్పష్టమైన విభజన ఉండాలి. సముచిత సమన్వయం ఉండాలి. పార్టీ వెలుపల జరిగే పోరాటం పార్టీ అంత రంగిక పోరాటంలో అనుసరించే రూపాలను ఎంత మాత్రం తీసుకోరాదు. అలాగే పార్టీ అంతరంగిక పోరాట రూపాలు పార్టీ వెలుపల పోరాట రూపాలను పోలివుండరాదు. పార్టీ వ్యతిరేఖ పోరాటాన్ని లేవనెత్తడానికి లేదా పార్టీని విచ్చినం చేయడానికి బయటి శక్తులకు అవకాశం లభించకుండా ప్రత్యేకమైన జాగ్రత్తలు తీసుకోవాలి. ప్రచ్ఛన్నంగా మెలిగే ట్రాట్‌స్కీ వాదులూ, విప్లవ ప్రతి ఘాతకులూ పార్టీలోని ఘర్షణలను పోరాటాలను అవకాశంగా తీసు కొని విచ్ఛిన్న కార్యకాలాపాలకు పూను కోకుండా పార్టీ సభ్యులందరూ అత్యంత జాగురూకతతో మెలగాలి. పార్టీ అంతరింగిక పోరాటాలు సాగే టప్పుడు ఈ విచ్ఛిన్న శక్తులు తమను ఉపయో గించుకునేందుకు పార్టీ సభ్యులు అవకాశాన్నీ యరాదు. పార్టీ క్రమశిక్షణను తూచా తప్ప కుండా పాటించడం ద్వారా, పార్టీ అంతరంగిక పోరాటాన్ని సక్రమంగా నిర్వహిండం ద్వారా ఈ పని చేయవలసి ఉంది.

పార్టీ లోపల కేవలం దాపరికం లేని పోరాటాలకు సైద్ధాంతిక పోరాటాలకు మాత్రమే వీలు కల్పించాలి. పార్టీ నిబంధనావళిని లేదా

పార్టీ క్రమ శిక్షణను ఉల్లంఘించే పోరాట రూపాలను అనుమతించరాదు.

ఏడవది: పార్టీలో సూత్రరహిత వివాధాలను నిరోధించేటందుకు గాను ఈ దిగువ తెలిపిన చర్యలను తీసుకోవడం ఏంతైనా అవసరం.

1) పార్టీ నాయకత్వ కమిటీలోగాని మరే ఇతర కమిటీతోగాని విభేదించే పార్టీ సభ్యులు తమ అభిప్రాయాలను విమర్శలను సంబంధిత పార్టీ కమిటీకి తెలియచేయాలి. అంతేకాని జనాల మధ్య చర్చకు పెట్టరాదు.

2) ఇతర పార్టీ సభ్యులతోనూ, లేదా నిర్దిష్ట మైన బాధ్యతలను చూసే పార్టీ సుభ్యులతోగాని విభేదించే పార్టీ సభ్యులు ఆయా సభ్యుల సమక్షం లోనూ లేదా తత్సంబంధిత పార్టీ కమిటీల లోనూ విర్శించవచ్చు. అంతే కాని జనాంతి కంగా మాట్లాడరాదు.

3) పై స్థాయి పార్టీ కమిటీతో విభేదించే పార్టీ సభ్యులుగానీ లేదా దిగువ స్థాయి పార్టీ కమిటీలుగాని పై స్థాయి కమిటీ ముందు తమ అభిప్రాయాలు వుంచాలి. లేదా ఆ విషయాన్ని పరిశీలించేటందుకు సమావేశాన్ని ఏర్పాటే చేయమని కోరాలి. అదే కాకుండా ఇంకా పైస్థాయి కమిటీకీ విషయాన్ని నివేధించాలి. అంతే కాని యధాలాపంగా చర్చలు సాగించ టమో లేకపోతే దిగువస్థాయి కమిటీలకు విషయాన్ని తెల్పడమో చేయరాదు.

4) పార్టీ సభ్యులెవరైనా తప్పు చేస్తున్నట్లు గాని, లేదా పార్టీ ప్రయోజనాలకు హానికరం గాలకు ప్రవర్తిస్తున్నట్లుగానీ పార్టీ సభ్యుల దృష్టికి వచ్చినట్లయితే వారు ఆ కార్యకలాపాల గురించి సంబంధిత పార్టీ కమిటీకి తెలియచేయాలి. అంతేగాని దాన్ని కప్పిపుచ్చడానికి ప్రయత్నం చేయరాదు. లేదా పరస్పర లాభంకోసం ఉపయో గించుకోరాదు.

5) నికరమైన పని విధానాన్ని పార్టీ సభ్యులు ప్రోత్సహించాలి. వంచనాపూరితమైన ప్రతి దానిని వ్యతిరేకించాలి. కపటంతో కూడుకున్న మాటలను, చేతలను వ్యతిరేకించాలి. పనికి మాలిన మాటలలోనూ, కట్టుకధలల్లటం లోనూ, ఇతరుల రహస్యాల పట్ల ఆసక్తి చూప టంలోనూ, వదంతులను వ్యాప్తి చేయటంలోనూ కాలం గడిపే వారందరినీ తీవ్రంగా నిరసిం చాలి. అభ్యంతరకర విషయాల గురించి మాట్లాడకుండా పార్టీ సభ్యులపై అంక్షలు విధిస్తూ పార్టీ నాయకత్వ కమిటీలు ఎప్పటికప్పుడు సూచనలుపంపుతూ ఉండాలి.

> **“ సూత్రరహిత వివాధాలను పరిష్కరించే ప్రయత్నం లో మనం ఎన్నడూ తీవ్రంగా వ్యవహరించ రాదు. ఎందుకంటే ఇలాంటి వాటిపై తీర్పు ఇవ్వడం, పరిష్కారం కుదర్చటం అసాధ్యమైన పని. తీర్పు సముచితంగా లేకపోతే ఉభయ పక్షాలు అసంతృప్తిగా ఉంటాయి. వివాధం కొనసాగుతూనే ఉంటుంది. ”**

6) పనికి మాలిన కబుర్లలోనూ సూత్ర రహిత వివాధాలలోనూ మునిగితేలే కామ్రేడ్స్‌ను అన్నిస్థాయిలోనూ నాయకత్వ కమిటీలు ఎప్పటి కప్పుడుగా పిలిపించి వాళ్లతో మాట్లాడి, వాళ్లని సరిదిద్ది హెచ్చరించడమో లేక ఇతర విధాలైన క్రమశిక్షణ చర్యలను తీసుకోవటమో చేయాలి.

7) అన్ని స్థాయిలలోని పార్టీ కమిటీలు తప్పనిసరిగా పార్టీ సభ్యులు వ్యక్తంచేసే అభి ప్రాయాలను గౌరవించాలి. సమస్యల గురించి చర్చించేటందుకు పని విధానాన్ని సమీక్షించే టందుకు తరచుగా సమావేశాలు ఏర్పాటు చేయాలి. పార్టీ సభ్యులు తమ అభిప్రాయాలను వ్యక్తంచేసేందుకు అవకాశాలు కల్పించాలి.

సూత్రరహితమైన వివాధాలను మొత్తం మీద నిషేధించాలి. వాటి మీద ఎలాంటి తీర్పునూ ఇవ్వరాదు. ఎందుకంటే ఈ రకమైన సూత్రరహిత వివాధంలో ఎవరిది తప్పో ఎవరిది ఒప్పో తేల్చడం కష్టం.

కామ్రేడ్స్ మధ్య తలెత్తే సూత్రరహిత వివాధాలను పరిష్కరించడానికి మనం పూను కున్నప్పటికీ నేరుగా వివాదంలో తల దూర్చ రాదు. వారి పని విధానాన్ని సమీక్షించి మదింపు వేయాలి. సానుకూలమైన రీతిలో చక్కదిద్దాలి. సూత్రబద్ధమైన రీతిలో వారి భవిష్యత్ కార్య క్రమాన్ని గురించీ, అనుసరణీయమైన మార్గం గురించీ మాట్లాడాలి. వారి పని విధానాన్ని సమీక్షించే సందర్భంలో వారి భవిష్యత్ కార్య క్రమాలు, పని విధానం, పంధా గురించి చెప్పే టప్పుడు ఇతర కామ్రేడ్స్‌లోని అపసవ్య ధృక్ప ధాలను మిమర్శించాలి ఇంకా విభిన్నమైన దృక్పధాలను కలిగివున్నారేమోనని వారిని అడగాలి. ఒక వేళ ఉన్నాయంటే అప్పుడు అది సూత్రానికి సంబంధించిన వివాదమవుతుంది. ఆ రకంగా సూత్రరహిత వివాధాన్ని సూత్రబద్ధమైన వివాదం స్థాయికి తీసుకెళ్ళవచ్చు. భవిష్యత్ ఆలోచనలకు సంబంధించి పని విధానాన్ని, అదే విధంగా మన పధకాలను, కార్యకలాపాలను నిర్వహించేందుకూ, సూత్రర హితమైన వివాధాన్ని విడిచిపెట్టేందుకూ అంద రూ కలిసిరావాలని వాళ్ళకు చెప్పాలి. సూత్రర హిత వివాధాలను ఎప్పుడూ గత కాలపు పని విధానాన్ని సమీక్షించాలి. సమీక్షించడం ద్వారా వర్తమాన లక్ష్యాల నిర్దేశం ప్రస్తుత పని పురోగ మనం ద్వారా పరిష్కరించవలసి ఉంది. లేని పక్షంలో సూత్రరహిత వివాధాలు పరిష్కారం కావు.

సూత్రరహిత వివాధాలను పరిష్కరించే ప్రయత్నంలో మనం ఎన్నడూ తీవ్రంగా వ్యవహరించరాదు. ఎందుకంటే ఇలాంటి వాటిపై తీర్పు ఇవ్వడం, పరిష్కారం కుదర్చటం అసాధ్యమైన పని. తీర్పు సముచితంగా లేకపోతే ఉభయ పక్షాలు అసంతృప్తిగా ఉంటాయి. వివాధం కొనసాగుతూనే ఉంటుంది.

ఒకానొక కామ్రేడ్‌కు మరొకరిపై పూర్తి నమ్మకం లేదు. లేదా ఇంకొకరిపై అనుమానంగా ఉంది... ఇలాంటి విషయాలను సాధారణంగా చర్చకు తీసుకురాకూడదు. ఎందుకంటే ఇలాంటి విషయాలపై చర్చ నిరుపయోగంగా ఉంటుంది.

ఆ ఒకనొక కామ్రేడ్ పని విధానంలోనూ, పోరాటంలోనూ, కార్యాచరణలోనూ అతని విశ్వ నీయత రుజువవుతుంది. అతనిపై ఉన్న అనుమానాలు తొలగిపోతాయి. ఆ రకంగా మాత్రమే అలాంటి విషయాలు పరిష్కార మవుతాయి.

ఒకవేళ కామ్రేడ్స్ తమ సూత్రబద్ధమైన పోరాటంలో సూత్రరహితమైన అంశాలు చొప్పిస్తే సూత్రబద్ధమైన అంశాలపై చర్చకు మాత్రమే మనం ప్రాధాన్యం ఇవ్వాలి. సూత్ర రహితమైన అంశాలకు ప్రాధాన్యాన్నివ్వరాదు. లేని పక్షంలో సూత్రబద్ధమైన సమస్యలు మరుగు

**“ మొత్తం మీద పార్టీ అంత రంగిక పోరాటం అనేది భావజాలంపైనా, సూత్రాలపైనా సాగే ఒక పోరాటరూపం, ఒక వివాదం. పార్టీలో ప్రతిదీ హేతువుకు లొంగివుండాలి. ప్రతి దానిలోను హేతువును అన్వేషించాలి. ”**

పడతాయి.

ఎవరైనా ఒక కామ్రేడ్ సూత్రబద్ధమైన పోరాటం ముసుగులో సూత్రరహితమైన పోరాటాన్ని సాగిస్తుంటే మనం, అతడు లేవనెత్తిన నిర్దిష్టమైన అంశాలకు చెందిన ఖచ్చితమైన సూత్రాలను ఎత్తి చూపాలి. మనం ఆ సూత్రాలను తిరస్కరించరాదు. ఎందుకంటే అతడు వాటినే ఉపయోగిస్తాడు. అతని వైఖరి, పద్ధతి తప్పు అని సముచితమైన రీతిలో ఎత్తిచూపాలి. ఆ రకంగా మాత్రమే సూత్రబద్ధమైన పోరాటం సూత్రరహితమైన పోరాటంగా మారకుండా నిరోధించగలం.

చెప్పాలంటే మొత్తం మీద పార్టీ అంతరంగిక పోరాటం అనేది భావజాలంపైనా, సూత్రాలపైనా సాగే ఒక పోరాటరూపం, ఒక వివాధం. పార్టీలో ప్రతిదీ హేతువుకు లొంగివుండాలి. ప్రతి దానిలోను హేతువును అన్వేషించాలి. ప్రతిదానిలోనూ దానిపైన హేతువు వుండాలి. కాని పక్షంలో హేతువును కనుగొన గలిగితే ఎలాంటి కష్టం లేకుండా ఏపనైనా చేయగలం.

హేతువుకు లొంగివుండే తత్వాన్ని పార్టీలోపల మనం పాదుకొల్పాలి. ఏది సరైన హేతువో నిర్ణయించడానికి గీటురాళ్ళు ఏమిటంటే పార్టీ ప్రయోజనాలు, కార్మిక వర్గ పోరాట ప్రయోజనాలు, పాక్షిక ప్రయోజనాలు, మొత్తం ప్రయోజనాలకు లొంగివుండటం, తక్షణ ప్రయోజనాలు సుదీర్ఘకాల ప్రయోజనాలకు లొంగివుండటం, పార్టీ ప్రయోజనాలకు, కార్మికవర్గ పోరాట ప్రయోజనాలకు మొత్తం మీద పార్టీ సుదీర్ఘకాల ప్రయోజనాలకు, కార్మికవర్గ పోరాట సుదీర్ఘకాల ప్రయోజనాలకు లాభకరంగా ఉన్నప్పుడు ఈ హేతువులు, ఈ అభిప్రాయాలు సరైనవే అవుతాయి. లేని పక్షంలో సరైనవి కాబోవు. ఏ పోరాటమైనప్పటికీ అది హేతువుకు లోబడకపోతే లేదా దానికంటూ హేతువు లేకపోతే అది సూత్ర రహిత పోరాటమే అవుతుంది. ఏదేమైన్పటికీ హేతువుకు లోబడకపోతే హేతువుకు దూరంగా ఉంటే అది సరైనది కాదు. ఇలాంటి సదర్భాలలో ఖచ్చితమైన నిర్ధారణలు లాగలేము. అంతిమ పరిష్కారం లభించదు. హేతువు లభించిన తర్వాత కూడా ఒక ఒప్పందానికి రావటంలో మనం విఫలమైతే అప్పుడు పార్టీ ప్రయోజనాలనూ, కార్మిక పోరాట ప్రయోజనాలనూ ఉల్లంఘిస్తున్నదెవరో స్పష్టమవుతుంది. ఇక అప్పుడు తమ లోటు పాట్లనే మొండిగా అంటి పెట్టుకొని వున్న కామ్రేడ్స్ పై నిర్మాణ పరమైన నిర్ధారణలకు రావచ్చు. ఎలాంటి ఇబ్బందులూ లేకుండా సమస్యను పరష్కరించుకోవచ్చు.

హేతువును కనుగొనాలంటే పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యం ఉండాలి. ప్రశాంతమైన, ఆవేశ రహితమైన చర్చల ద్వారా సమస్యలను చక్కదిద్దుకోవాలి. వినయ విధేయతలతో కూడిన అధ్యయనం, కామ్రేడ్స్ సైద్ధాంతిక స్థాయిని పెంచడం, పరిస్థితిని గురించి స్పష్టమైన అవగాహనను కలిగిఉండటమూ, వివాదాన్ని క్షుణ్ణంగా పరిశీలించి సమస్యను కూలంకషంగా పరిశోధించడం ఎంతైనా అవసరం. మనం అజాగ్రత్తగా ఉన్నా, చిలకపలుకులు వల్లించినా, ఆచరణ నుండి వేరుపడినా, వివాదాన్ని క్షుణ్ణంగా పరిశీలించకపోయినా హేతువును కనుగొనలేము.

మనం హేతువుకు లోబడకపోయినా హేతువును కనుగొనడంలో విఫలమైనా బలాన్నీ, చిట్కాలనూ, పార్టీ ద్వారా సంక్రమించిన అధికారాన్నీ ఉపయోగించవలసి వస్తుంది. సమస్యల పరిష్కారార్థం చివరకు పంచనకు కూడా దిగటం జరుగుతుంది. అలాంటి సందర్భాలలో పార్టీ అంతరంగిక ప్రజాస్వామ్యం నిరుపయోగమవుతుంది. పార్టీ అంతరంగిక ప్రజాస్వామ్యానికి హేతువు అవసరం. అప్పుడు మాత్రమే నిర్దిష్టమైన చర్యలను చేపట్టగలం.

'హేతువు' అంటే నేను ఉద్దేశించేదేమిటంటే అభౌతికమూ, భ్రమతో కూడిన హేతువు కాదు. అసలైన యథార్థాలు, అసలైన సత్యము, ఆచరణ అనే గీటురాయిపై రుజువుకావాలి. కొంత మంది మేధావులు, నిష్క్రియాపరమైన సంభాషణలు సాగిస్తూ తప్పుడు. హేతువులతో మునిగిపోతారు. ఇలాంటివారు నిజానిజాలతో నిమిత్తం లేకుండా చాలా కబుర్లు చెబుతుంటారు. ఈ చరాచర ప్రపంచంలో ప్రతిదాని గురించీ అనర్గళంగా మాట్లాడతారు. ఇవన్నీ గాలి కబుర్లు, అర్థరహితమైనవి, నిరుపయోగమైనవి. ఇవి పార్టీకి, విప్లవానికి ప్రమాదకరమైనవి. కనుక మన కార్యాచరణను, హేతువుకు లోబడేలా చేయాలంటే గాలి కబుర్లను, అర్థరహితమైన మాటలను వ్యతిరేకించాలి. వాస్తవాన్నుండి ఉద్భవించి ఆచరణకుద్దేశించిన వాస్తవిక, భౌతిక హేతువును మనం సమర్థించాలి. అంటే "మన సిద్ధాంతాలు భౌతికమైనవి" గా ఉండాలి.

ప్రతిదీ తప్పనిసరిగా హేతువుకు లోబడి ఉండాలి. అలా లేనట్లయితే దానిని విడనాడాలి. సరియైన హేతువు లేకపోయినా దానిని విసర్జించాలి. గాలి కబుర్లలో మునిగితేలటం మరింత ఆక్షేపణీయం. ఇలా ఉండటం కాస్త కష్టమైనపనే. కాని అలా చేయగలిగినప్పుడు మాత్రమే మనం బోల్షివిక్కులమనిపించుకోవడానికి అర్హులమవుతాయి.

బోల్షివిక్కులు హేతువుకు లొంగి వుంటారు. సత్య సమర్థతకులుగా ఉంటారు. హేతువును స్పష్టంగా అర్థం చేసుకున్న వ్యక్తులు కారు. అకారణ పోరాట నిపుణులంతకంటే కాదు.

కామ్రేడ్స్, పార్టీ అంతరంగిక పోరాట నిర్వహణకు సంబంధించి నేను చేసే కొన్ని సూచనలు ఇవి.

పార్టీలో అంతరంగిక పోరాటాన్ని నిర్వహించేటప్పుడు, రకరకాలైన తప్పుడు ధోరణులను వ్యతిరేకించేటప్పుడు, ప్రతిపార్టీ సభ్యుని లోనూ ప్రత్యేకించి కేడర్‌లోనూ పార్టీ చైతన్యాన్ని పరిశీలించేటప్పుడు మన కామ్రేడ్స్ ఈ పద్ధతులను అనుసరించాలన్నదే నా అభి ప్రాయం ఆ రకంగా చేస్తే భావజాలం విషయం లోనూ, నిర్మాణపరంగానూ మన పార్టీ మరింత సంఘటితమవుతుంది. ఇదే మన లక్ష్యం.

# పార్టీలో కేంద్రీకృత ప్రజాస్వామ్యం

లెనిన్‌చే రూపొందించి, వివరించి, నొక్కిచెప్పబడిన ఈ కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రం ఒక్కటే కమ్యూనిస్టుపార్టీని పోరాటపటిమతో నిలిపి, నిజమైన విప్లవ పార్టీగా కొనసాగించగల నిర్మాణ సూత్రం.

ఇతర బూర్జువా, పెటీ బూర్జువా పార్టీలవలె కాకుండా కమ్యూనిస్టుపార్టీ అన్నది అధికారం కొరకు శ్రామికవర్గం జరిపే పోరాటాలలో సమరశీలత కలిగిన విప్లవ నిర్మాణ సంస్థ. కనుక అణచివేతకు, హింసకు పాల్పడే బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని నిరంతరం ఎదుర్కొనవలసిన పరిస్థితిలో కమ్యూనిస్టుపార్టీ వుంటుంది. శ్రామికవర్గపు ఈ రాజకీయ పార్టీని అత్యంత కేంద్రీకృతంగా నిర్మించి సమైక్యపరచి, నిర్వహిస్తేనే తప్ప అది అత్యంత ప్రబలమైన తన వర్గ శత్రువులను ఎదిరించి తన విప్లవ కర్తవ్యాలను నిర్వహించలేదు. లెనిన్‌చే రూపొందించి, వివరించి నొక్కిచెప్పిన ఈ కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రం ఒక్కటే కమ్యూనిస్టుపార్టీని పోరాటపటిమతో నిలిపి, నిజమైన విప్లవ పార్టీగా కొనసాగించగల నిర్మాణ సూత్రం.

మనపార్టీలో కేంద్రీకరణ అంటే, నాయకత్వ సంస్థలను పార్టీ సభ్యులు ఎన్నుకుంటారు. అవి పార్టీ సభ్యుల విశ్వాసాన్ని పొంది ఉంటాయి. పార్టీ వ్యవహారాలన్నింటినీ నిర్వహించే అధికారాన్ని వాటికి ఇచ్చేది ఇదే. నిర్మాణానికి వ్యక్తి విధేయుడై ఉండేట్లు ఆజ్ఞాపించగలిగిందీ, మెజారిటీకి మైనారిటీ బద్ధులయ్యేలా చేసేదీ, క్రింది సంస్థలు పై వాటికీ, అన్ని సంస్థలూ కేంద్రకమిటీకి అధీనమై ఉండేట్లూ చేసేదీ ఇదే. పార్టీయొక్క కేంద్రీకృత లక్షణం ప్రజాతంత్రంపై ఆధారపడి వుంటుందేగాని వేరుపడి వుండదు.

మన పార్టీలో ప్రజాతంత్రం అంటే, తగిన నాయకత్వం క్రింద పార్టీ సమావేశాలు జరుగుతాయి. సమగ్ర పరిశీలనతో రూపొంది జాగ్రత్తగా చర్చలు జరిగిన పిమ్మట తీర్మానాలు ఆమోదం పొందుతాయి. నామినేషన్ల జాబితా జాగ్రత్తగా తయారైన తర్వాత ఎన్నికలు జరుగుతాయి. మన పార్టీలో ప్రజాతంత్రమంటే నాయకత్వంలేని ప్రజాతంత్రమూ కాదు. అతి ప్రజాతంత్రమూ కాదు. పార్టీలో అరాచకత్వం అంతకంటే కాదు.

కనుక కేంద్రీకృత ప్రజాస్వామ్యంలో కేంద్రీకృతమూ, నియంతృత్వమూ రెండూ ఉంటాయి. ఇవి రెండూ గతి తార్కిక బంధంలో ఉంటాయి. ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉంటాయి. అంటే ఒకదాన్ని ఒకటి అదుపు చేస్తుంటాయి. నిర్ణయాల రూపకల్పనలో ప్రజాస్వామ్యముంటుంది. అంటే పార్టీకి సంబంధించిన అంశాలను నిర్ణయించే క్రమం ప్రజాస్వామ్యయుతంగా ఉంటుంది. అఖిలభారత మహాసభకు రెండునెలల ముందు ముసాయిదాను విడుదల చేసి శాఖలకు పంపి సవరణలు, అభ్యంతరాలు వుంటే స్వీకరిస్తుంది. వాటిని చర్చించి అవసరమైతే పొందుపరుస్తుంది. అంటే అఖిల భారత స్థాయిలో అనుసరించే పార్టీ వైఖరిని ఒక సాధారణ పార్టీ సభ్యుడు ఆమోదించాల్సి ఉంటుంది. కింది స్థాయి నుండి ఆపై స్థాయికి తమ ప్రతినిధులను పంపే వీలుంది. కనుక జరిగే ఎన్నికలోనూ ఈ సభ్యునికి స్థానం ఉంది. నిర్ణయం అంటూ వెలువడ్డాక దానిపై ఉన్న అభ్యంతరాలను పైన పేర్కొన్న ప్రజాస్వామ్య పద్ధతుల్లో వ్యక్తం చేసినా ఆచరణలో మాత్రం నిర్ణయాన్ని అమలు చేయాలి. ఇది కేంద్రీకృతం. దీనినే బూర్జువాలు నియంతృత్వం అంటూ దుమ్మెత్తిపోస్తుంటారు. కానీ పరస్పర విరుద్ధమైన కేంద్రీకృతం, ప్రజాస్వామ్యం లేకపోతే మనదీ బూర్జువాల తరహా కొట్లాటల పార్టీ అవుతుంది. అందుకని మన పార్టీ ఐక్యతకు ఇది చాలా అవసరం. కేంద్రీకృతం ఐదు విధాలుగానూ, ప్రజాస్వామ్యం మూడు విధాలుగానూ అమలౌతుంది.

**1) కేంద్రీకృతం :**

1) మొత్తం పార్టీకి వ్యక్తి లోబడి ఉండటం ద్వారా

2) మెజారిటీకి మైనారిటీ లోబడి ఉండటం ద్వారా

3) పై కమిటీకి కింది కమిటీ లోబడి ఉండటం ద్వారా

4) అఖిల భారత మహాసభకు కేంద్ర కమిటీ లోబడి ఉండటం ద్వారా

5) పై కమిటీల పర్యవేక్షణలో ప్రజాస్వామ్య అంశాలు అమలు చేయడం.

**2) ప్రజాస్వామ్యం :**

1) పార్టీ విధానాలు రూపొందించడంలో

2) పార్టీ నాయకత్వాన్ని ఎన్నుకోవడంలో

3) విమర్శ, ఆత్మవిమర్శ పాటించడంలో

పార్టీలో ఉన్నతమైన ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని పెంపొందించుకొన్నప్పుడు మాత్రమే దానిపై ఆధారపడి, పార్టీ నాయకత్వంలో ఉన్నతమైన కేంద్రీకరణను సాధించగలం. ఉన్నతమైన పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని పెంపొందించడానికి ఈ క్రింది అంశాలు ఉపయోగపడతాయి.

'రకరకాల పార్టీ పనులకు బాధ్యులై, ప్రజా బాహుళ్యంతో మంచి సంబంధాలు నిలబెట్టుకునే కేడర్లు పార్టీ కమిటీలలో తప్పక చేరి వుండాలి. నిర్ణయాలు ఉమ్మడిగా తీసుకోవాలి. ఈ నిర్ణయాలు నిర్వర్తించేందుకు వ్యక్తులను కేటాయించాలి. ఆ నిర్ణయాలను ఎంతవరకు అమలు జరిపారో తనిఖీ చేయాలి.

'విమర్శ, ఆత్మవిమర్శలను ప్రోత్సహించడం ప్రజాస్వామ్యాన్ని విస్తృతం చేయడంలో ఒక కీలకాంశం. అన్ని స్థాయిలలో గల నాయకులే మొట్టమొదట తమ పనులలో

వచ్చే లోపాలను గురించి, తప్పులను గురించి సమగ్రమైన ఆత్మవిమర్శ చేసుకొనడానికి పూనుకోవాలి. ఇతరులు చేసే విమర్శలను అంగీకరించాలి. ఎలాంటి పరిస్థితిలోనూ వుద్రేకులు కారాదు. అహంకారం ప్రదర్శించరాదు.

'నాయకత్వ కమిటీలు తమ పనిని గురించి పార్టీ సభ్యులకు, క్రింది కమిటీలకు నివేదికలు పంపాలి. వాటిలో సాధించిన విజయాలను గురించేకాక లోపాలు, బలహీనతలు, తప్పులను గురించి కూడా తెలియజేసి విమర్శనూ, వ్యాఖ్యలనూ పంపమని కోరాలి. పార్టీ సభ్యులూ, క్రింది కమిటీలూ తమ వ్యాఖ్యలనూ, వాటితోపాటు తమ ఆత్మవిమర్శనూ పంపాలి. తమ పనినీ, కార్యకలాపాలను గురించి క్రమంగా పై కమిటీలకు నివేదికలు పంపాలి.

కమిటీ సమావేశాలను సక్రమంగా నిర్వహించాలి. ప్రజాతంత్రం, విమర్శ, ఆత్మ విమర్శల సమ్మేళనాభావంతో వాటిని నడపాలి. ఈ సమావేశాలు నిర్జీవంగా, ప్రజాతంత్ర రహితంగా, చెప్పినదే పదిసార్లు చెప్పే ఉపన్యాసాలతో విసుగుపుట్టించకుండా ఏదో ఒక మొక్కుబడిగా ఓటింగుతో ముగియకుండా వుండాలి. సమావేశాలను ఎక్కువసార్లు వేసినంత మాత్రాన అది ప్రజాస్వామ్యమనిపించుకోదు.

'అవి పార్టీ సభ్యుల చొరవను, కార్యకలాపాలను అభివృద్ధిపరచేవిగా వుండాలి. పార్టీ లక్ష్యం అంటేనూ, ప్రజా ప్రయోజనాల లక్ష్యం అంటేనూ వారిలో బాధ్యతా భావాన్ని పెంచేవిగా ఉండాలి. తమ వాదనా పటిమను ఉపయోగించగల విధంగా, సమస్యలను ధైర్యంతో, సరియైన పద్ధతిలో లేవనెత్తి తమ అభిప్రాయాలను పూర్తి వ్యక్తిగతం చేయడానికి తోడ్పడేవిగా వుండాలి.

'పై కమిటీలనుండి నిర్ణయాలూ, ఆదేశాలూ వచ్చినప్పుడు ఆ ఆదేశాల మీదను వాటిని అమలు పరచవలసిన స్థానిక పరిస్థితుల మీదను తీవ్ర పరిశీలన అవసరం. దానిని ప్రోత్సహించాలి. ఏది ఆచరణీయమో దానిని దృఢచిత్తంతో నిర్వహించాలి. ఏది ఆచరణ యోగ్యంకాదో దానికి తగు వివరాలతో కారణాలను తెలుపుతూ, సవరణలు కోరుతూ పై కమిటీకి నివేదికలు పంపాలి. ఇది ఒక్కటే నిర్ణయాలను హృదయపూర్వకంగా తెలివితేటలతో అమలుపరచేందుకు తీసుకొనే వైఖరి. పార్టీ సభ్యులలో యిలాంటి సృజనాత్మకతనీ, కార్య కలాపాలనూ మనం ప్రోత్సహించాలి. అయితే తమకు నచ్చిన నిర్ణయాలను మాత్రమే అమలు చేయడానికీ, మిగతా వాటిని ఉపేక్షించడానికీ పూనుకొనే ధోరణి స్వయంపాలనావాదం (అటానమిజం) అవుతుంది. ఇది అనుమతించ రానిది. అలాగే ఏ నిర్ణయాలనైనా లేక ఆదేశాల నైనా అవి అక్కడున్న స్థితిగతులకు వర్తిస్తాయో లేదో పరిశీలించకుండానే వాటిని గుడ్డిగా, యాంత్రికంగా అమలు చేయ ప్రయత్నించడం కూడా అనుమతించరానిది.

'క్రింది కమిటీలూ, సభ్యులూ తమ తమ సూచనలను, ప్రశ్నలనూ పంపడానికి, తన నిర్ణయాలను, ఆదేశాలను మార్చాలని ప్రతిపాదించడానికి పై కమిటీ అనుమతించాలి. తన నిర్ణయాలలో నిజంగా తప్పులున్నాయని కనుగొన్నప్పుడు వాటిని సరిదిద్దాలి. క్రింది కమిటీలది తప్పు అయితే తమ అభిప్రాయాల్ని బలపరచడం కోసం తృప్తికరంగా వివరించాలి. ఏదైనా మార్పు జరగాలని విజ్ఞప్తి చేసినప్పటికీ పై కమిటీ గనుక తన నిర్ణయాన్ని తప్పక అమలు చేయాలని పట్టుబడితే దానిని అమలుపరచాలి.

మనలో కొందరు కామ్రేడ్స్ పార్టీ నాయకత్వంతోనూ మొత్తం పార్టీతోనూ నిమిత్తం లేనివిధంగా తమ చర్యలను విడిగా చూస్తుంటారు. మొత్తం పరిస్థితినంతటినీ గురించి ఆలోచించక, పార్టీయొక్క దీర్ఘకాల ప్రయోజనాలను పట్టించుకొనక, తమ స్వీయ ప్రయోజనాలు, అభిప్రాయాలతో మాత్రమే నడుస్తూ నిరాటంకంగా, స్వేచ్ఛగా సంచరిస్తారు. నిర్మాణానికి సంబంధంలేని, సూత్రబద్ధంగాని అన్నిరకాల చర్చలలో కార్యక్రమాలలో నిమగ్నమవుతారు. పార్టీలో రాజకీయేతర చర్చలు రెచ్చగొట్టడానికి కావాలని గోరంతను కొండంతలు చేసి చూపుతారు. లేదా అంతూ పొంతూలేని, ఉబుసుపోని కబుర్లతో, తగాదాలతో వ్యవహరిస్తారు. పార్టీ సభ్యులలో సరైన పరిశీలన కొరవడి తాత్కాలిక అవగాహనలోపానికి గురైనప్పుడు దానిని అవకాశంగా తీసుకొని, తమ అభీష్టం మేరకు తమ ప్రతిపాదనను ఓటింగుకు పెట్టి మెజారిటీ పేరుమీద నిర్ణయాలు తీసుకుంటారు. ఇదే అతి-ప్రజాస్వామ్యం. దీని మూలం, పరస్పరానుబంధం లోపించడమనే పెటీ-బూర్జువా భావంలో వుంది. దీనిని పార్టీలోపలికి తెచ్చిన పుడు అది రాజకీయంగానూ, నిర్మాణ రూపం లోనూ అతి ప్రజాస్వామ్య భావంగా తయారవు తుంది. ఇది శ్రామికవర్గపు పోరాట కర్తవ్యాలతో మౌలికంగానే పొసగనిది. భౌతికంగా నిజానికిది ఒక రకమైన విప్లవ ప్రతీఘాత సిద్ధాంతం.



# వ్యూహం-ఎత్తుగడలు

**వ్యూహం ఎత్తుగడలనేవి కేవలం రాజకీయాలకే పరిమితం కాదు. రోజువారి పని విధానంలోనూ, కార్యక్రమాల్లోనూ, యూనియన్ నిర్వహణలోనూ వీటిని ఉపయోగించవచ్చు.**

వ్యూహం ఎత్తుగడలనేవి మార్క్సిస్టు సాహిత్యంలో సర్వసాధారణంగా కనపడే దృక్పథాలు. విప్లవదశపైనా, విప్లవాన్ని ముందుకు తీసుకుపోవడంలో విభిన్న వర్గాల పాత్రతో పాటు ఆయా వర్గాల కలయికపైనా ఆధార పడింది వ్యూహం.

వ్యూహానికి ఎత్తుగడలు లోబడి వుంటాయి. ఈ రెండూ పరస్పర సంబంధం కలిగి వుంటాయి. స్టాలిన్ మాటల్లో చెప్పాలంటే రాజకీయవ్యూహం – ఎత్తుగడలనేవి కార్మికోద్యమానికి సంబంధించినవిగా వుంటాయి.

కార్మికోద్యమంలో రెండు భాగాలుంటాయి.

**మొదటిది వస్తుగతమైన లేక సద్యోజనితమైన భాగం :** ఇది మన చైతన్యంతో నిమిత్తం లేనిది. ప్రకృతి, సమాజ సూత్రాల ననుసరించి జరిగేది. ఉదాహరణకు దేశ ఆర్థికాభివృద్ధి, పెట్టుబడి దారి అభివృద్ధి, పీడిత వర్గాల సద్యోజనితమైన పోరాటం వగైరాలు కార్మికుల చైతన్యంతో నిమిత్తం లేకుండా జరుగుతాయి. ఇదంతా వస్తుగత అంశం.

వ్యూహానికి ఈ వస్తుగత విషయంలో సంబంధంలేదు. ఎందువలనంటే వాటిని ఆపడంగాని, మార్చడం గాని అది చేయలేదు. అది వాటిని గమనంలోకి తీసుకొని ముందుకు పోగలదు. వీటిని మార్క్సిజం, మార్క్సిస్టు కార్యక్రమం అధ్యయనం చేస్తాయి.

ప్రకృతిలో కూడా దీనికి అనేక ఉదాహరణలు చెప్పుకోవచ్చు. విత్తనం నుండి మొక్క రావడం, చెట్టు పెరగడం, పువ్వులూ కాయలూ కాయడం ఇవన్నీ మానవ ప్రయత్నం లేకుండానే జరుగుతాయి. ఇది వస్తుగతమైన విషయం.

**రెండోది స్వీయ మానసికమైన లేక చైతన్య పూర్వకమైన భాగం:** పై ఉదాహరణలోనే చూసుకుంటే పొలాన్ని దున్నడం, విత్తనాలు నాటడం, ఎరువులు, నీళ్ళు పెట్టడం, అంటు కట్టడం వంటి పనులన్నీ ఈ భాగం క్రిందకు వస్తాయి.

కార్మికోద్యమంలో ఇది ఉద్యమం యొక్క రెండో ముఖంగా ఉంటుంది. కార్మికోద్యమానికే కాదు, అన్ని వర్గాలకూ వుంటుంది. ఇది చైతన్య పూర్వకమైన ఉద్యమం. కార్మిక వర్గాన్ని ఒక నిర్దిష్టమైన దిశ వైపు క్రమబద్ధంగా నడిపించేది. ఇది వ్యూహం-ఎత్తుగడల చేత ప్రభావిత మవుతుంది.

వ్యూహం-ఎత్తుగడలు వుద్యమాన్ని వేగ వంతం చేయగలవు. వేగాన్ని తగ్గించగలవు. దగ్గర మార్గంలో పయనింప జేయగలవు. సుదీర్ఘమైన, కష్టతర మార్గంలో కూడా నడిపించ గలవు.

వ్యూహం, ఎత్తుగడలు అనేవి పరిస్థితి అధ్యయనం మీద ఆధారపడి వుంటుంది.

"మన వుద్యమాన్ని నడిపేటప్పుడు మనం చేసుకునే హెచ్చుతగ్గులే వ్యూహం – ఎత్తుగడలు" అని స్టాలిన్ చెప్పాడు. ఈ వ్యూహం ఎత్తుగడలనేవి కేవలం రాజకీయాలకే పరిమితం కాదు. రోజువారి పని విధానంలోనూ, కార్యక్రమాల్లోనూ, యూనియన్ నిర్వహణలోనూ వీటిని ఉపయోగించవచ్చు.

కార్మిక సంఘాల పనిలోనూ, యాజమాన్యంతో జరిగే చర్చలలోనూ, పోలీసుతో జరిగే ఘర్షణలోనూ, యుద్ధంలోనూ, జిల్లాలో పార్టీ అభివృద్ధికి సంబందించిన కార్యక్రమంలోనూ, కార్యకర్తలకు అప్పచెప్పిన బాధ్యతలకు సంబంధించిన రోజువారి కార్యక్రమం అమలులోనూ....ఒకటేమిటి మన కార్యకలాపాలన్నిటిలోనూ వ్యూహం-ఎత్తుగడలు ఉండాలి. ఉదాహరణకు: ఒక ప్రాంతంలో ట్రేడ్ యూనియన్ పని ఉంది. దాన్లో మన వ్యూహం -ఎత్తుగడలు నిర్దిష్టంగా ఉండాలి. ఒక ఫ్యాక్టరిలో సమ్మె జరుగుతోంది. ఇక్కడా మనకు వ్యూహం-ఎత్తుగడలుండాలి. ఒక ప్రాంతంలో భూపోరాటం జరుగుతోంది. ఆ సందర్భంగానూ మనం స్పష్టమైన వ్యూహం-ఎత్తుగడలు రూపొందించుకోవాలి.

ఇవే కాదు ఆటలు, ఎన్నికలు, కార్యకర్తల శిక్షణ, కార్యకర్తలను సరి చేయడం.....వాగైరా కార్యక్రమాల్లో కూడా వ్యూహం- ఎత్తుగడలు వుంటాయి.

మన పార్టీ లక్ష్యం జనతా ప్రజాతంత్ర విప్లవం. దీన్ని సాధించటానికి వ్యూహం పన్నుతాము. దీన్నే పథకం అంటారు. ఆ వ్యూహాన్ని అమలు పరచటానికి ఎత్తుగడలు చేస్తాం. దీన్నే పని అంటాం. ఇది అంతా వ్యూహం-ఎత్తుగడల క్రిందికి వస్తుంది.

విప్లవ శక్తుల ఐక్యతను ఎలా సాధించాలి. పోరాటం ఎలా నడపాలనేది విప్లవ వ్యూహం.

**1)** వ్యూహం అంటే విప్లవం యొక్క ఒకానొక దశలో కార్మికవర్గపు ప్రధాన దాడి యొక్క దిశను నిర్ణయించడం అని స్టాలిన్ చెప్పాడు. వ్యూహంలో విప్లవం యొక్క ప్రధాన బలగాలకు వాటి రిజర్వులకు సంబంధించిన అంశాలుంటాయి అని ఆయన చెప్పాడు.

**2)** వ్యూహం అంటే మొత్తం యుద్ధాన్ని నడిపించే దానికి కావలసిన చర్యలన్నింటినీ ముందుగా నిర్ణయించుకోవడం అని మావో చెప్పాడు.

**3)** వ్యూహం అంటే శత్రువు యొక్క బలాన్ని సమగ్రంగా అంచనా వేయడం అని చౌఎన్ లై వివరించాడు.

**వ్యూహం:**

మన లక్ష్యాన్ని సాధించటానికి వ్యూహం పన్నుతాము. దీన్నే పథకం అంటాము. వ్యూహం అనేది పని ప్రారంభించడానికి ముందు పన్నుతాము. పని ప్రారంభించిన తరువాత ఎత్తుగడలు వేస్తాం. ఎత్తుగడలనే పని అంటాం.

> **"ఒకానొక దశలో వ్యూహం మారకుండా వుండిపోతుంది. దశ మారితేనే వ్యూహం మారి పోతుంది. ఉదాహరణకు, జనతా ప్రజాతంత్ర విప్లవ దశలో మన వ్యూహం ఆ విప్లవం వచ్చే వరకూ మారకుండా ఉంటుంది. ఎత్తుగడలు మాత్రం ఎప్పటికప్పుడు పరిస్థితిని బట్టి మారు తాయి."**

మన లక్ష్యాన్ని నేరవేర్చుకోవడానికి తోడ్పడే శక్తులనూ, ఆటంక పరచే శక్తులనూ గుర్తించడం వ్యూహం అవుతుంది. ఒక్క మాటలో చెప్పాలం టే మన మిత్రులనూ, శత్రువులనూ గుర్తించడం అన్న మాట. రాజకీయాలలో మిత్రపక్షాలు, శత్రు పక్షాలు.... సమ్మె సందర్భంలో యాజమా న్యబలాలు, కార్మిక సంఘాల బలాలు వంటివి వీటికి ఉదాహరణలు. వ్యూహంలో ఇది మొదటి స్థాయి.

ఇక వ్యూహంలో రెండవ స్థాయి, శత్రు వుల, మిత్రుల మోహరింపుకు సంబంధించింది. ఇందులో శత్రువులను, మిత్రులను ప్రాధాన్య క్రమంలో నిర్ణయించడం ప్రధానమైనది. పరిస్థి తుల తీవ్రతను బట్టి, స్థాయిని బట్టి ఆ క్రమం మారుతుంది. ఈ రకంగా ప్రాధాన్యతాక్రమం నిర్ణయమైన తరువాత, మనం చేయవలసిన దాడి ప్రధాన దిశను నిర్ణయించాలి.

మన పార్టీ లక్ష్యమైన జనతా ప్రజాతంత్ర విప్లవంలో ప్రస్తుతం దాడి ప్రధానంగా భూస్వా ముల మీద ప్రారంభమవుతుంది. అప్పుడు పెట్టుబడిదారులు వారికి తోడుగా వస్తారు. అప్పుడు వారి మీద కూడా దాడి జరుగుతుంది. అందుకే కీలకమైన ప్రధానమైన శత్రువు మీద దాడి కేంద్రీకరించాలి. ప్రధానమైన మిత్రుని చుట్టూ బలాన్ని సమీకరించాలి. ఇవన్నీ చేయాలంటే బలాబలాలు అంచనా వేయాలి. బలాబలాలు పరిస్థితిని బట్టి దాడి ఏరకంగా జరపాలి అనేది నిర్ణయించాలి.

సమర్థవంతమైన, వ్యూహాత్మకమైన నాయ కత్వం అంటే ఏమిటి? ఈ క్రింది పనులు చేయగల నాయకత్వమే సమర్థవంతమైన నాయ కత్వం అవుతుంది.

1) మనకు రిజర్వులుగా వున్న ప్రత్యక్ష, పరోక్ష మిత్రులను అంచనా వేయాలి.

2) శత్రవు యొక్క బలహీనతపై కేంద్రీకరించాలి.

3) సాధించాల్సిన లక్ష్యంపై కేంద్రీ కరించాలే తప్ప, ప్రక్కకు మళ్ళరాదు.

4) పరిస్థితి మొత్తాన్ని అంచనా వేయాలి.

5) ప్రధానమైన విషయంపైనే కేంద్రీ కరించాలి.

6) శత్రువుల గురించి, వారి బలం గురించి సరిగ్గా అంచనా వేయాలి.

7) శత్రువుల జాతీయ, అంతర్జాతీయ మిత్రుల గురించి అంచనా వేయాలి.

8) శత్రువులను ఒంటరి చేసి, దాడి ఎలా చేయాలో నిర్ణయించాలి.

9) మన మిత్రులను ఐక్య పరచే విధానాన్ని రూపొందించాలి.

10) కార్మిక వర్గ చైతన్యం గురించి అవగాహన కలిగి ఉండాలి.

11) మన ప్రధానమైన దాడి ఎవరిపైన చేయాలి, మన శక్తుల మోహరింపు ఎలా చేయాలి అన్న విషయంలో స్పష్టంగా ఉండాలి.

ఒకానొక దశలో వ్యూహం మారకుండా వుండిపోతుంది. దశ మారితేనే వ్యూహం మారి పోతుంది. ఉదాహరణకు, జనతా ప్రజాతంత్ర విప్లవ దశలో మన వ్యూహం ఆ విప్లవం వచ్చే వరకూ మారకుండా ఉంటుంది. ఎత్తుగడలు మాత్రం ఎప్పటికప్పుడు పరిస్థితిని బట్టి మారు తాయి. ప్రస్తుతం మనం ఈ దశలో ఉన్నాం, కనుక మన వ్యూహం ఇలా వుంటుంది. విప్లవ కార్మిక వర్గానికి మిత్రులు: 1) వ్యవసాయ కార్మికులు, 2) చేతివృత్తులవారు, 3) పేద రైతులు, 4) పట్టణ, గ్రామీణ మధ్య తరగతి వ్యాపారులు, 5) ధనిక రైతులు, 6)బడాయేతర పెట్టుబడిదారులు. శత్రువులు: 1) భూస్వా ములు 2) స్వదేశీ గుత్త పెట్టుబడిదారులు 3) విదేశీ పెట్టుబడిదారులు.

విప్లవ స్వభావాన్ని బట్టి వ్యూహం వుంటుంది. నేటి మన విప్లవ దశలో భూస్వామ్య వ్యవస్థ రద్దు కీలకమయింది. భూస్వామ్య విధానం రద్దు వల్ల నష్టపడే వర్గాలన్నీ ఒక వైపు, లాభపడే వర్గాలన్నీ మరోకవైపు మోహ రిస్తాయి.

**ఎత్తుగడలు:**

ఉద్యమం యొక్క ఆటుపోట్లను బట్టి, విప్లవ ఉధృతి, తిరోగమనాలను బట్టి కార్మికవర్గాన్ని నడిపించే మార్గాన్ని నిర్దేశించడాన్నే ఎత్తుగడ లంటాం.

ఆ మార్గాన పయనించేందుకు పాత పోరాట రూపాల స్థానంలో కొత్త పోరాట రూపాలనూ, పాత నిర్మాణ రూపాల స్థానంలో కొత్త నిర్మాణ రూపాలనూ, పాత నినాదాల స్థానంలో కొత్త నినాదాలనూ రూపొందించడం, వీటి నన్నింటినీ ఐక్యం చేయడమే ఎత్తుగడలంటే.

ఒక విప్లవ దశలో ఎత్తుగడలు అనేక పర్యాయాలు మారవచ్చు.

ఎత్తుగడలు వ్యూహంలో భాగంగానే ఉంటాయి. అవి వ్యూహాన్ని అనుసరించి దానిని ముందుకు తీసుకుపోవడానికి ఉద్దేశించినవి. ఎత్తుగడలు వ్యూహానికి భిన్నంగా వుండరాదు.

ఏ ఒక్క సమస్యో తీసుకుని మొత్తం మిత్ర వర్గాలన్నింటినీ కదలించలేము. అనేక సమస్య లపై పని చేయాలి. చిన్న చిన్న ప్రవాహాలు మహా ప్రవాహాలు కావాలి.

నిర్దిష్ట సమయంలో, నిర్దిష్ట పరిస్థితిని బట్టి కార్మిక వర్గాన్ని నడిపించే పద్ధతి, మార్గాలను ఎత్తుగడలంటారని కామ్రేడ్ స్టాలిన్ చెప్పాడు. శత్రువు యొక్క ప్రధాన బలహీనతను గుర్తించడం ఎత్తుగడల ప్రధాన ధ్యేయమని కామ్రేడ్ చౌఎన్ లై చెప్పాడు. తక్షణ కర్తవ్యాలను సాధించేందుకు అనుసరించే పోరాట, నిర్మాణ పద్ధతులనూ, వినియోగించే కళనూ, తీరునూ ఎత్తుగడ లంటాం.

వ్యూహం శత్రువు యొక్క బలంమీద కేంద్రీ కరిస్తుంది. ఎత్తుగడలు శత్రువు బలహీనతను గుర్తిస్తుంది.

ఎత్తుగడలలో సామర్థ్యం కలిగిన నాయ కత్వం అంటే ఎలా ఉండాలి?

1) అన్ని రకాలైన పోరాట, నిర్మాణ పద్ధతులపై పట్టు కలిగి ఉండాలి.

2) ఆయా ప్రత్యేక పరిస్థితులకు తగ్గట్లు, పై పోరాట, నిర్మాణ పద్ధతులు ఉపయో గించాలి.

3) వ్యూహాన్ని సాధించడానికి కావలసిన లింకును పట్టుకోవాలి.

4) ఆందోళనా పద్ధతులైన ఉపన్యాసం, కరపత్రం వంటి వాటిని సమయానుకూలంగా విస్తృతంగా ఉపయోగించుకోవాలి.

5) ప్రచార పద్ధతులైన క్లాసులు, పుస్తక పఠనాన్ని నిర్వహించాలి.

6) రకరకాల పోరాట పద్ధతులను-పార్లమెంటరీ,పార్లమెంటేతర, చట్టబద్ధమైన, చట్టవ్యతిరేకమైన - పద్ధతులను పరిస్థితిని బట్టి ఉపయోగించుకోవాలి.

7) రకరకాల నిర్మాణ పద్ధతులు సమయానుకూలంగా పాటించాలి. ఉదాహరణకు: సరళీకృతమైన నిర్మాణపద్ధతి, ఒక క్లబ్బు మాదిరి, చిన్న శాఖలు, కమిటీలు, పెద్ద శాఖలు, కమిటీలు, నామినేషన్ పద్ధతి, ఎలక్షన్ పద్ధతి, స్వతంత్రమైనది / ఐక్యఫ్రంట్.

8) నినాదం...ప్రచారం... ఆందోళన....కార్యాచరణ.....పథనిర్దేశం. ఇలా ఒకదాని వెంట మరొకటి సాగిపోవాలి.

ఎత్తుగడలలో కింది సూత్రాలుంటాయి:

Initiative - చొరవ కలిగి ఉండాలి.

Enthusiastic - ఆసక్తిని ప్రదర్శించాలి.

Concentration of force - బలగాలు మోహరించాలి.

Surprise - అవసరమైనప్పుడు మెరుపు దాడి చేయాలి.

Speed - వేగవంతంగా పనిచేయాలి.

Flexibility-పట్టువిడుపులతో ఉండాలి.

Mobility -నిత్యం చలనంతో ఉండాలి.

Secrecy - నిగఢత పాటించాలి.

Independant and united - స్వతంత్రత, ఐక్యత...రెంటినీ మేళవించాలి.

Compromise, Agreement, Boy Cott - రాజీపడటం, సంధి చేసుకోవడం, బహిష్కరించడం...వీటిని సమయానుకూలంగా వినియోగించాలి.

Coordination - సమన్వయం చేసుకోవాలి.

రోజు వారీ కార్యక్రమాలలో వీటిని అమలు చేయాలంటే:

**(1)** శత్రువులు తక్కువగానూ, మిత్రులు ఎక్కువగానూ ఉండేటట్లు చూడాలి. శత్రువులలో చీలిక తేవడం ద్వారా కూడా వారి శక్తిని తగ్గించవచ్చు. ఉదాహరణకు పరిశ్రమలలో సమ్మె చేయదలచినప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలు, అనుకూల పరిస్థితులు పరిశీలించుకోవాలి.

**(2)** ఎదురుదాడి, ఆత్మరక్షణ: శత్రువు బలహీనంగా ఉంటే ఎదురుదాడి చేస్తాం. శత్రువు బలంగా వుంటే ఆత్మ రక్షణచేసుకుంటాం. దీనికి అంచనాలు కూడా సరిగా వుండాలి.

**(3)** కేంద్రీకరణ, వికేంద్రీకరణ: తాత్కాలిక బలాన్ని పొందుతూ, ఆ బలం మొత్తాన్ని కేంద్రీకరించడం ద్వారా శత్రువును ఎదుర్కోవాలి. ఇది కేవలం తాత్కాలిక చర్య మాత్రమే. తప్పనిసరి పరిస్థితులలో మాత్రమే దీన్ని ఆచరించాలి. శత్రుదాడి వలన మనం నష్టపోయే పరిస్థితి ఉన్నప్పుడు మన బలాన్ని వికేంద్రీకరించడం ద్వారా దెబ్బతినకుండా కాపాడుకోవచ్చు. ఉదాహరణకు: ఎన్నికలప్పుడు అన్ని రంగాల్లోని కార్యకర్తలనూ ప్రోగుచేయడం. అనేక కార్యక్రమాలు ఒకేసారి వచ్చినప్పుడు విడగొట్టి పని చేయడం.

**(4)** బలాన్ని నిగూఢంగా ఉంచాలి (కన్సీల్ మెంట్): ఆయా సందర్భాలనుబట్టి, మన శక్తిని ఎక్కువగా (ఉన్నదానికంటే) చూపించడం గానీ, తక్కువ చేసి చూపించడం గానీ చేయాలి. ఉదాహరణకు: అనుకూలంగా ఉన్నప్పుడు సంఘాలు స్థాపించడం, జండాలు ఎగుర వెయ్యడం చేయాలి. అవసరమైతే కొంతకాలం తాత్కాలికంగా వాయిదా చేయడం వంటి పనులు చేయాలి.

**(5)** చొరవ: మనకు అనుకూల పరిస్థితులు వున్నప్పుడు మనం చొరవ తీసుకుని కార్యక్రమాలు చేయాలి. ఈ విషయంలో మనం ఆలస్యం చేయడం మనకునష్టం కల్గిస్తుంది. ఇది ముఖ్యంగా మన బలం తక్కువగా ఉన్నచోట్ల మరింత ముందుగా చొరవ చూపించాలి. లేకపోతే మనల్ని మించిపోయే ప్రమాదం వుంది.

**(6)** ఐక్యత - పోరాటం, స్వతంత్రత - ఐక్యత: మన మిత్రులతో కలసి వుంటూనే, అవసరమైనప్పుడు వారితో పోరాటం చేయాలి. అయితే, దీనివల్ల ఐక్యత చెడిపోకూడదు. దీనివల్ల మన బలం తగ్గకుండా ఉంటుంది, ఐక్యత కొనసాగుతుంది. ఉదాహరణకు, పరిశ్రమల్లో ఇతర సంఘాలతో కలసి పోరాటం చేయటం. అయితే ఏ సందర్భంలో, ఏరకమైన పోరాటం చేయాలనే విషయాన్ని కూడా ఎంతో జాగ్రత్తగా నిర్ణయించుకోవాలి. కార్మికుల సమస్యల మీద సరైన సమయంలో పోరాటం నిర్వహించకపోతే నష్టపోతాం. ఈ ఐక్యత - పోరాటంలో చాలా జాగ్రత్త వహిస్తూ నిర్ణయాలు చేయవలసి వుంటుంది.

స్వతంత్రత-ఐక్యత వలన మన ప్రత్యేకతను మనం నిలబెట్టుకొంటూ స్వతంత్రంగా పని చేస్తూనే, మన మిత్రులందరినీ కలుపుకుంటూ ఐక్యంగా పనిచేయాలి. కార్మికులకు సంబంధించిన సమస్యలమీద మన స్వతంత్ర విధానాలను ప్రకటించి, పని చేయాలి. అదే సమయంలో ఇతర సంఘాలను కూడా కలుపుకుని ఆ సమస్యల పరిష్కారానికి కృషి చేయాలి. ఇది క్రమంగా మనం బలపడడానికి వుపయోగ పడుతుంది. ఉదాహరణకు, కరపత్రాలు విడిగా వేయడం, కార్యాచరణ ఐక్యంగా జరపడం.

ఎత్తుగడల విషయంలో పట్టువిడుపుగా వుండాలి. కొన్ని పరిస్థితులలో రాజీ పడాల్సి వుంటుంది. కొన్ని పరిస్థితులలో పోరాటం చేయాల్సి వుంటుంది. రాజీ అనేది నష్టాన్ని నివారించేదిగా ఉండాలి. సరైన సమయం చూసి దెబ్బకొట్టడం అవసరం. అది సమ్మె విషయంలోనైనా సరే. మన పోరాటం దీర్ఘకాలం సాగకూడదు. అది శత్రువుకి ప్రయోజనం కల్గిస్తుంది. కనుక మనం తక్కువ సమయంలోనే పోరాటం పూర్తిచేయాలి. అది మనకు ఉపయోగపడుతుంది. ఆలస్యం జరిగేకొద్దీ కార్మికుల్లో నిరుత్సాహం పెరుగుతుంది.

క్రియాశీలక పోరాటం చేయాలేగానీ, ప్రేక్షక పాత్రలో వుండరాదు. పోరాటం మొదలుపెడితే,

**"స్వతంత్రత-ఐక్యత వలన మన ప్రత్యేకతను మనం నిలబెట్టుకొంటూ స్వతంత్రంగా పని చేస్తూనే, మన మిత్రులందరినీ కలుపుకుంటూ ఐక్యంగా పనిచేయాలి. కార్మికులకు సంబంధించిన సమస్యలమీద మన స్వతంత్ర విధానాలను ప్రకటించి, పని చేయాలి. అదే సమయంలో ఇతర సంఘాలను కూడా కలుపుకుని ఆ సమస్యల పరిష్కారానికి కృషి చేయాలి. ఇది క్రమంగా మనం బలపడడానికి వుపయోగ పడుతుంది."**

సమరశీలంగా వుండాలి. అందువల్ల పోరాటం మొదలుపెట్టే సమయాన్ని ఖచ్చితంగా నిర్ణయించుకోవాలి.

పోరాటానికీ విశ్రాంతికీ మధ్య, కేంద్రీకరణకూ వికేంద్రీకరణకూ మధ్య, దాడికీ రక్షణకూ మధ్య, పురోగమనానికీ తిరోగమనానికీ మధ్య, దాక్కోడానికీ బహిరంగంగా రావటానికీ మధ్య, దెబ్బతినడానికీ నిలువరించటానికీ మధ్య, కేంద్రీకృత నాయకత్వానికీ వికేంద్రీకృత నాయకత్వానికీ మధ్య, దీర్ఘకాల పోరాటానికీ తక్షణ ఫలితాలిచ్చే పోరాటానికీ మధ్య, మన బలాలకూ శత్రువుల బలాలకూ మధ్య, క్యాడరుకూ సాధారణ కార్యకర్తలకూ మధ్య, పాత క్యాడరుకూ కొత్త క్యాడరుకూ మధ్య, గత కర్తవ్యాలకూ ప్రస్తుత కర్తవ్యాలకూ మధ్య, ప్రస్తుత కర్తవ్యాలకూ భవిష్యత్ కర్తవ్యాలకూ మధ్య, ఒక నిర్దిష్ట పరిస్థితుల్లోని కర్తవ్యాల మధ్య, స్థిరమైన రంగాలకూ అస్థిరమైన రంగాలకూ మధ్య, ఒక చారిత్రక దశకూ – మరొక చారిత్రక దశకూ మధ్య..... ఇలా వివిధ సమస్యల మధ్య వున్న తేడాలనూ, వాటి మధ్య సంబంధాలనూ అధ్యయనం చెయ్యాలి.

వ్యూహానికి సంబంధించిన ఈ సమస్యలు ఏవీ కూడా సూటిగా కంటికి కనిపించవు. కాని మనం లోతుగా ఆలోచించుకుంటే వాటిని అర్థం చేసుకోగలుగుతాము. వాటిలో నైపుణ్యం సంపాదించగలుగుతాము. ఈ విధంగా ఒక పోరాటానికి సంబంధించిన ప్రధాన సమస్యలను దాని తరువాత ఉన్నతస్థాయికి చెందిన సూత్రాలుగా రూపొందించుకొని పరిష్కరించు కోగలం. వ్యూహాత్మక సమస్యల అధ్యయనం యొక్క లక్ష్యమిదే.

## 'మార్క్సిస్టు' పై
## మీ అభిప్రాయాలు తెలపండి!

'మార్క్సిస్టు' సైద్ధాంతిక మాసపత్రికపైనా, పత్రికలోని నిర్దిష్ట వ్యాసాలపైనా మీ అభిప్రాయాలనూ, సూచనలనూ ఆహ్వానిస్తున్నాం. ఆయా వ్యాసాలపై మీరు చర్చించాల్సిన అంశాలున్నా, అదనపు సమాచారమున్నా క్లుప్తంగా రాసి పంపండి

మీ లేఖలు అందాల్సిన చిరునామా!

**ఎడిటర్,**
'మార్క్సిస్టు' సైద్ధాంతిక మాసపత్రిక
ప్రజాశక్తి ప్రెస్, గవర్నరుపేట, విజయవాడ-2

# అభిప్రాయాలు

## మరింత జాగ్రత్త అవసరం

'మార్క్సిస్టు' డిసెంబర్, 2007 సంచికలో పశ్చిమ బెంగాల్ పారిశ్రామికీకరణ అవసరాలు, అవకాశాలు, సవాళ్లకు సంబంధించి కామ్రేడ్ బుద్ధదేవ్ చాలా చక్కగా వివరించారు. కేంద్రంలో ప్రభుత్వం వామపక్షాలపై ఆధారపడాల్సి రావటం, దేశవ్యాప్తంగా వామపక్షాల పోరాటాలూ వాటితోపాటే వాటి ప్రతిష్ట పెరగడం, బెంగాల్‌లో వామపక్షాలు తమ ఓటింగును మరింత పెంచుకోవడం బూర్జువా పార్టీలకు ఈ దశాబ్దంలోనే మింగుడుపడని విషయాలు. వామపక్షాలను బద్నాం చేయడానికి ఎప్పుడు అవకాశం దొరుకుతుందా అని గోతికాడ నక్కల్లా కూర్చున్నాయి. చిన్న పొరపాటును ఆధారంగా చేసుకుని అభివృద్ధి నిరోధక శక్తులన్నీ ఏకమై దాడి చేశాయి. దేశ సార్వభౌమాధికారాన్ని తాకట్టు పెట్టే అణు ఒప్పందాన్ని వ్యతిరేకించినందుకు నందిగ్రామ్ ఘటనతో వామపక్షాలను బ్లాక్‌మెయిల్ చేసే ప్రయత్నాలు జరిగాయి. వాస్తవాలను దాచిపెట్టి, నిజాలను వక్రీకరించి మీడియాలో పెద్ద భాగం మార్క్సిస్టుల ప్రతిష్టను దిగజార్చాలని చూశాయి. అయినా నిజాలు నిలకడమీద బయటకు వస్తున్నాయి. ఈ విషయం బెంగాలీయులు ముఖ్యంగా నందిగ్రామ్ ప్రజలు భవిష్యత్తులో మరింతగా రుజువు చేస్తారు. పెట్టుబడిదారీ చట్రంలో ముప్పయ్యేళ్లకు పైగా ఒక వామపక్ష ప్రభుత్వాన్ని నడిపిన ఘనత మార్క్సిస్టుల కుంది. ఇది ప్రపంచంలోనే ఒక ప్రత్యేకమైన స్థితి. రాష్ట్రాలకున్న పరిమిత అధికారాలతో అనేక ఒడుదుడుకులను ఎదుర్కొని ప్రజల మన్ననలు పొందారు. ఎన్ని మేకవన్నెపులులు దాడిచేసినా ప్రజల మద్దతుతో సమాధానం చెబుతారు. పెట్టుబడిదారీ వ్యవస్థే కాదు, దాని భావజాలం కూడా పూర్తిగా తుడిచిపెట్టుకుపోయే వరకు సర్వదా అప్రమత్తమై ఉండాలన్న విషయం ప్రతి మార్క్సిస్టు కార్యకర్తా గుర్తుంచుకోవాలి. "ముళ్లూ, రాళ్లూ ఎన్నున్నా ముందు దారి మాది". భవిష్యత్తు వామపక్షాలది.

**పి. పాండురంగారావు,**
చింతలపూడి,
పశ్చిమగోదావరి జిల్లా

## విప్లవకర సాంస్కృతిక విలువలు నెలకొల్పాలి

డిసెంబర్ 2007 సంచికలో 'విప్లవ సంస్కృతి' వ్యాసం ద్వారా మిహిర్ భట్టాచార్య విలువైన విశ్లేషణలందించారు. అయితే రెండు సందర్భాల్లో వారి రచనలోని భావాలు అర్థంకాలేదు. 1. పోస్ట్ స్ట్రక్చరలిస్టులు వాదిస్తున్నట్లుగా గొర్రెపిల్లలో ఉండే మౌనం నిర్వేదం కాదు అనేది, 2. మార్క్సిజం, రియలిజం మధ్య ఉన్న సంబంధం ఎన్‌లైట్‌మెంట్‌తో కలిస్తే ఉండే ఈ ఫలితం.... ఈ వాక్యాల వెనుకనున్న భావాన్ని మరింత సూటిగా వివరిస్తే బాగుండేది.

ఆర్థిక వ్యవస్థల మార్పుల గురించి బలంగా వాదించే కమ్యూనిస్టులు సాంస్కృతిక అంశాలపట్ల ఎంతటి ఆసక్తినీ, చైతన్యపూరిత కార్యాచరణనూ ప్రదర్శిస్తారో సోవియట్ యూనియన్‌లోని తొలినాళ్ల పాలన మనకు తెలుపుతుంది. ఆర్థికరంగంలో చేసే పునర్నిర్మాణంతో పాటు ప్రయత్న పూర్వకంగా ఉన్నత సంస్కృతిని నిర్మించే క్రమం లెనిన్ అనంతరం కొంత, స్టాలిన్ అనంతరం పూర్తిగా విస్మరించబడింది. గ్రాంసీ ప్రస్తావించిన సమీకృత మేధావి అనే భావాన్ని ఒక ఆదర్శంగా ప్రజల ముందుంచడంలో తరువాతి వారు ఆసక్తి చూపలేదు. అందుకే సోవియట్ అనుభవాలు మనకు రెండు విషయాలు నేర్పుతాయి. ఒకటి, విప్లవాన్ని విజయవంతం చేయడమెలా అనేది. రెండు, విప్లవాన్ని వినాశనం నుండి ఎలా రక్షించుకోవాలి అనేది.

విప్లవ సంస్కృతి దానికదే ఏర్పడుతుందన్న ధోరణి, లేదా రాజ్యాధికారం కైవసం చేసుకున్నాకనే విప్లవ సంస్కృతి నిర్మాణం ప్రారంభిస్తామనే ధోరణి కమ్యూనిస్టు ఉద్యమాలను బలహీనపరిచాయి. గత సంస్కృతుల లోని పురోగామి అంశాలను వృద్ధి పరుస్తూనే నూతన సమాజ నిర్మాణానికి అవసరమైన నైతిక, సాంస్కృతిక విలువలను పార్టీలోనూ, ప్రజాసంఘాల్లోనూ నిరంతరాయంగా నిర్మిస్తూ పోవాలి. ఒక పార్టీగానీ, ఒక సంస్థగానీ, ఒ వ్యక్తిగానీ విప్లవకరంగా నిలబడాలన్నా, కొనసాగాలన్నా ఇలాంటి ప్రయత్నమే ఒక ముఖ్యమైన షరతు కూడా.

**ఎం. నిర్మల్ కుమార్,ఎల్.బి. రోడ్,**
సత్తుపల్లి, ఖమ్మం జిల్లా

# నక్సలైట్ల విధానాలు ఆచరణలో పాలకవర్గాలకే తోడ్పడతాయి




- బి.వి. రాఘవులు

**చంద్రబాబు నాయుడు రైతులకు మద్దతుధరపై స్పందించినంతగా సిపిఐ(ఎం), సిపిఐలు స్పందించలేదనిపిస్తోంది. ఇళ్లస్థలాల సమస్యమీద చేసిన పోరాటం కార్మికవర్గాన్ని ఆకట్టుకుంది. కాని రైతుకు మద్దతు ధరపై ఆందోళన చేసి చంద్రబాబు కొంతవరకు రైతుల ఆదరణ పొందారు. వాస్తవానికి ఈ ఆదరణ వామపక్షాలకు రావల్సిందని నా అభిప్రాయం. వివరించగలరు. మద్దతుధరపై తలపెట్టిన బంద్‌కు ప్రతిపక్షాలన్నీ మద్దతు తెలిపాయి. కాని బంద్ పూర్తిగా జరగకపోవడానికి కారణం ప్రతిపక్షాల అనైక్యతే అనుకుంటున్నాను. వామపక్షపార్టీలయినా గ్రామస్థాయిలో రైతులకు వివరించి కదిలించినట్టైతే బంద్ జయప్రదం అయ్యేది. కాని అలా జరగలేదు. కారణం చెప్పగలరు.**

**గాలా పాపయ్య,**
సంతనూతలపాడు,
రొంపిచర్ల(మం),
గుంటూరు జిల్లా

పంటలకు మద్దతు ధర చెల్లించడంపై జరిగిన ఉద్యమంలో కాంగ్రెస్ మినహా అన్ని పార్టీలు పాల్గొన్నాయి. ఈ ఉద్యమంలో వామపక్షాలు చురుకైన పాత్రను పోషించాయి. టిడిపి కూడా ఉద్యమంలో చురుకుగానే పాల్గొంది. ఇళ్లస్థలాల భూ పోరాలంటో టిడిపి పాల్గొనలేదు. దాని వర్గ స్వభావం రీత్యానే అది పేదల సమస్యలు వచ్చినప్పుడు మొక్కుబడిగా వ్యవహరించడం ఆశ్చర్యంకాదు. భూస్వామ్యవర్గాలకూ, ధనిక రైతులకూ ఇతర రైతాంగంతోపాటు ఎక్కువ ప్రయోజనం కలిగే మద్దతుధరపై టిడిపి కదలకపోతేనే ఆశ్చర్యపడాల్సివుంది. అయితే, ఈ మద్దతు ధరల ఉద్యమంలో టిడిపితో సమానంగానే ఇతర పార్టీల కృషి ఉంది. కాకపోతే, ప్రధాన ప్రతిపక్షపార్టీ నేతమైన చంద్రబాబునాయుడుగారికి మీడియా ప్రాధాన్యత ఇచ్చింది. ఆ రకంగా ఇస్తుంది కూడా! మీడియాలో వచ్చిన ప్రచారాన్ని బట్టి ఏ పార్టీ ఎంత చురుకుగా ఉందనేది తేల్చడం సబబుకాదు. మద్దతుధరలపై జరిగిన బంద్‌కు రాష్ట్రవ్యాప్తంగా ఒకే రకమైన స్పందన రాలేదన్నది వాస్తవం. ప్రధాన ప్రతిపక్షమైన తెలుగుదేశం పార్టీ రంగలో ఉన్నప్పటికీ బంద్ పాక్షికంగా జరిగిందన్నది గమనించాలి. వామపక్షాలు చురుకుగా లేనవందునే ఇలా జరిగిందనుకోవడం సరికాదు. బంద్ పాక్షికంగా జరిగినదనుకోవడం కూడ సంపూర్ణ వాస్తవం కాదు. ప్రధానంగా సమస్య వడ్ల ధరకు సంబంధించింది. దీనిపై వడ్లఉత్పత్తితో సంబంధంలేని తరగతులన్ని ఒకే విధంగా స్పందిస్తాయని అనుకోలేము. అలాగే అనేక ప్రాంతాల్లో ముమ్మరంగా పనులు కూడా ఉన్నాయి. వీటన్నింటిని పరిగణలోకి తీసుకుంటే జరిగిన బంద్ జయప్రదమైనదనే భావించాలి.

**భగత్‌సింగ్ ఆనాడు స్వాతంత్ర పోరాటంలో విప్లవకారునిగా పనిచేశాడు. ఇంక్విలాబ్ జిందాబాద్ అన్నాడు. సమాజాభివృద్ధిని కోరుకున్న భగత్‌సింగ్ జయంతి ఉత్సవాలను నేడు బిజెపి అనుబంధ విద్యార్థి సంస్థ అయిన ఎబివిపి జరపడం ఎంతవరకు సమంజసం? మతోన్మాదంతో ప్రజలను చీలదేసేవారు భగత్సింగ్ ఉత్సవాలు, రథయాత్రలు జరపడం ఏమిటి? ఎబివిపి పోస్టర్ల మీద భగత్‌సింగ్ ఫోటోలు పెట్టడం కరెక్టా?**

**లింగంపల్లి భీమేష్,**
- ఎస్ఎఫ్ఐ,
సి-30టిఐకెవై, బెల్లంపల్లి,
ఆదిలాబాద్‌జిల్లా.

భగత్‌సింగ్ దేశం కోసం ప్రాణాలర్పించిన విప్లవకారుడు. సామ్యవాది. శాస్త్రవిజ్ఞానానికి సమున్నత స్థానాన్నిచ్చినవాడు. అటువంటి భావాలను అనుసరించేవారే ఆయనకు నిజమైన వారసులవుతారు. భారత ప్రజల హృదయాల్లో భగత్‌సింగ్‌కు చెరగనిస్థానం ఉంది. ఆయన వారసులుగా చెప్పుకోకుండా భారత ప్రజల గౌరవాన్ని పొందడం ఎవరికైనా కష్టం. అందుకే బిజెపి, ఎబివిపి భగత్‌సింగ్ భావాలనూ, ఆయన ఆచరణనూ మరుగుపరిచి తామే వారసులమని చూపించుకునే ప్రయత్నం చేస్తున్నాయి. బ్రిటిష్ పాలకులను దేశం నుండి తరిమివేయడానికి భగత్‌సింగ్ ప్రాణాలు అర్పించాడు. అది నిజమైన దేశభక్తి. ఇప్పుడు ప్రపంచీకరణ విధానాలనూ, అమెరికా పెత్తనాన్నీ ఎదిరించడం నిజమైన దేశభక్తి అవుతుంది. కాని అమెరికాకు దాసోహం అయ్యే విధానాలను అనుసరించే బిజెపి దేశభక్తియుతమైన పార్టీగా చలామణి కావాలంటే భగత్‌సింగ్ వారసత్వం అనే ముసుగును వేసుకోవాల్సిన పరిస్థితి. అందుకే భగత్‌సింగ్ ఉత్సవాలూ, భగత్‌సింగ్ యాత్రలూ చేస్తున్నారు. ఆయన బొమ్మలను వినియోగించుకుంటున్నారు. ఈ బూటకత్వాన్ని ప్రజలు అర్థంచేసుకోరని వారి నమ్మకం. కాని ప్రజలు వారి కుత్సిత బుద్ధిని అర్థం చేసుకుంటారు. భగత్‌సింగ్ నిజమైన వారసులెవ్వరో, నకిలీ వారసులెవ్వరో గుర్తిస్తారు.

**నక్సలైట్లు తమను తాము కమ్యూనిస్టు విప్లవకారులమని చెప్పుకుంటారు. మరి వారు బెంగాల్‌లో సిపిఎం నాయకత్వంలోని వామపక్ష ప్రభుత్వ మీదా, సిపిఎం సభ్యులు, అనుయాయులమీదా ఎందుకు దాడులు చేస్తున్నారు?**

**జి. యాదయ్య,**
సిరిసిల్ల,
కరీంనగర్ జిల్లా

కమ్యూనిస్టు ఉద్యమంలో మితవాదం, అతివాదం తగాదాలు

## 'మార్క్సిస్టు'కు
## మీ సందేహాలు రాయండి!

'మార్క్సిస్టు' సైద్ధాంతిక మాసపత్రికలో సిపిఐ(ఎం) రాష్ట్ర కార్యదర్శి బివి రాఘవులు ప్రతినెలా పాఠకుల సందేహాలకు సమాధానాలిస్తున్న సంగతి మీకు తెలుసు. ప్రస్తుత అంతర్జాతీయ, జాతీయ, రాష్ట్ర రాజకీయ పరిణామాలపై మీ సందేహాలను నివృత్తి చేసుకునేందుకు ప్రశ్నలను రాసి పంపండి! ప్రతినెలా 20వ తేదీలోపు మీ ప్రశ్నలు మాకు చేరితే తదుపరి సంచికలో రాఘవులు సమాధానాలు లభిస్తాయి.

మీ ప్రశ్నలు అందాల్సిన చిరునామా!

**ఎడిటర్,**
'మార్క్సిస్టు' సైద్ధాంతిక మాసపత్రిక,
ప్రజాశక్తి ప్రెస్, గవర్నరుపేట, విజయవాడ-2

కవలపిల్లలుగా ఉంటాయని లెనిన్ ఏనాడో చెప్పాడు. ప్రపంచదేశాలన్నింటిలోనూ కమ్యూనిస్టు ఉద్యమం ఇటువంటి ధోరణులు ఏదో ఒక సమయంలో ముందుకు వచ్చాయి. మన దేశంలో కమ్యూనిస్టు ఉద్యమంలో అతివాదానికి ప్రతినిధులుగా వివిధ నక్సలైటు గ్రూపులు కొనసాగు తున్నాయి. తామే అసలైన కమ్యూనిస్టు విప్లవకారులమని వారు చెప్పుకుంటారు. అయితే, ఆచరణలో తమ తప్పుడు సిద్ధాంతాల ద్వారా పాలకవర్గాలకు తోడ్పడుతుంటారు. మన దేశంలోనూ వారు నిర్వహించిన పాత్ర అదే. కమ్యూనిస్టు ఉద్యమంలో దుందుడుకు వాదాన్నీ, ఒంటెత్తువాదాన్నీ అనుసరించి ఉద్యమాన్ని విచ్ఛినంచేసి, నష్టపరిచి భూర్జువా, భూస్వామ్య శక్తులకు అన్నివిధాల సహాయపడ్డారు. వారి ఉద్దేశ్యాలు ఏమైనా వారి ఆచరణ మాత్రం ఇప్పటికీ ఆ పనే చేస్తోంది. వారికి ప్రధాన శత్రువులు పాలకవర్గ పార్టీలు కాదు ఇతర కమ్యూనిస్టులు. మనదేశంలో ముఖ్యంగా సిపిఎం. అందుకే సిపిఎంపై సైద్ధాంతికంగా దాడిచేయడమే కాకుండా భౌతికంగా దాడి చేయడమూ వారు చేస్తుంటారు. బెంగాల్‌లో సిపిఎం పైనా, వామపక్షప్రభుత్వంపైనా గురిపెట్టి దాడులు చేయడం ఇందులో భాగమే. సైద్ధాంతికంగా ప్రజలను ఐక్యం చేసి ముందుకు పోవడమే ఈ దుందుడుకు వాదులకూ, విచ్ఛిన్నకచర్యలకూ విరుగుడు.

**లోక్‌సత్తా పార్టీవారు తాము ధర్నాలు, రాస్తారోకోలు వంటి కార్యక్రమాలకు వ్యతిరేకం అని ప్రకటించారు. నిజానికి సమస్యలను తెలియచెప్పడానికి దర్నాలు,రాస్తారోకోలు తప్ప వేరే మార్గాలే లేవా?**

**సిహెచ్ స్వర్ణలత,**
రోడ్‌నెంబర్12,
బంజారాహిల్స్,
హైదరాబాద్.

లోక్‌సత్తా పార్టీ లక్ష్యాలేంటి? వారు ఏ వర్గాలకు, ఏ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించదలుచుకున్నారు? వాళ్ల లక్ష్యాలను ఎలా సాధించదలుచుకున్నారు అనే విషయాలన్ని ఇప్పటికీ అస్పష్టమే. రాజకీయపార్టీగా ఎటువంటి కార్యక్రమాలు చేయదలుచుకున్నారు? ఏ కార్యక్రమానికి అనుకూలం, ఏ కార్యక్రమానికి ప్రతికూలం అనేది కూడా ఇంకా స్పష్టం కాలేదు. ధర్నాలను వ్యతిరేకిస్తే, నిరాహారదీక్షలు, సభలు, ప్రదర్శనలు, సత్యాగ్రహాలు వంటివి చేస్తారాలేదా? వాటికి కూడా వ్యతిరేకమా అనేది స్పష్టంగా లేదు. సత్యాగ్రహాలు, హర్తాళ్లు, శాసనోల్లంఘనలు, రాస్తారోకోలు ప్రపంచంలో అన్ని రకాల ఉద్యమాల్లోనూ అనుసరిచేవి. శాంతికి, అహింసకు ప్రతీకగా ఉన్న మహాత్మాగాంధీ కూడా వీటన్నింటిని ఉద్యమంలో సాధనాలుగా ఉపయోగించారు. ఇప్పటికీ ప్రపంచంలో అనేక దేశాల్లో సమస్యల పరిష్కారానికి సాధనంగా వినియోగిస్తున్నారు. అందువల్ల ఇటువంటి ఆందోళన రూపాల్ని తప్పని చెప్పడం అవివేకం. వీటిని అనుసరించడం, అనుసరించకూడదనేది ఎవరిష్టం వారిదే. కాని ఆందోళనలనూ, ఉద్యమాలనూ అప్రతిష్టపాలు చేయడం పాలకవర్గాలకు, పాలకపార్టీలకు మేలు చేయడమే. ప్రస్తుత వ్యవస్థను యథాతథ స్థితిలో ఉంచడానికి ఇటువంటి వాదనలు ఉపయోగపడతాయి.

**దేశం అభివృద్ధి కావాలంటే ఆధునిక యంత్రాలను ప్రవేశపెట్టడం తప్పనిసరికదా? మరి కమ్యూనిస్టులు యంత్రాలతో పనులు చేస్తే (ప్రొక్లెయిన్, వరికోత యంత్రాలు) వ్యతిరేకిస్తున్నారు. ఎందుకు?**

**ఆర్.సుభాష్,**
కళ్యాణదుర్గం,
అనంతపురం జిల్లా

దేశమంటే మట్టికాదోయ్... దేశమంటే మనుషులోయ్ అని గురజాడ అన్నారు. ఒక సార్వజనీన సత్యాన్ని ఆయన చెప్పారు. దేశాభివృద్ధికి యంత్రాలు ఉపయోగపడటం అంటే దేశప్రజలకు ఉపయోగపడాలి. కాని యంత్రాల ప్రవేశం దోపిడి వర్గాల లాభాలు పెంచుకోవడానికీ, కష్టజీవులు పని కోల్పోవడానికీ, ఆ రకంగా సామాన్య ప్రజల జీవన ప్రమాణాలు దెబ్బతీయడానికీ కారణమైతే దాన్ని దేశాభివృద్ధి అని ఎలా అనగలం? సంపన్నుల అభివృద్ధి అని మాత్రమే అనగలం. కమ్యూనిస్టులు ఎప్పుడూ యంత్రాలకు వ్యతిరేకం కాదు. వాస్తవంగా ఉత్పత్తిశక్తులు బాగా అభివృద్ధి కావాలని కోరుకుంటారు. కాకపోతే యంత్రాల, ఉత్పత్తిశక్తుల అభివృద్ధి ప్రజలందరికీ దక్కాలని భావిస్తారు. అందుకే ఇప్పుడు బూర్జువా ఆర్థికవేత్తలు కూడా అచ్చమైన అభివద్ధి గురించి మాట్లాడలేకపోతున్నారు. సమానత్వంతో కూడిన అభివృద్ధి అని మాట్లాడ వలసివస్తోంది. ప్రస్తుతం భారతదేశంలో అమలు జరుగుతున్న అభివృద్ధి ఏకపక్షంగా ఉన్నదని ఇప్పుడు అందరూ అంగీకరించే సత్యం. అందుకే ఈ మధ్యన అభివృద్ధి ఫలాలు అందరికీ అందాలన్న అభిప్రాయాన్ని ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ కూడా ఒప్పుకోవాల్సిన పరిస్థతి వచ్చింది.



# మానికొండ సుబ్బారావు

(2వ పేజీ నుంచి)

విస్తరించింది. పార్టీ సభ్యత్వం పెరుగుదల, పార్టీ పనిచేసే తీరుతెన్నులు, పార్టీ పత్రికల విస్తృత ప్రచారం, ప్రజాసంఘాల సభ్యత్వం, పార్టీ విరాళాల సేకరణ, వీటన్నింటి రాశిలోనూ వాసిలోనూ పార్టీ గణనీయమైన అభివృద్ధి సాధించింది.

1945-46 నాటికే మానికొండ కుటుంబం ఆదర్శ విప్లవ కుటుంబం అనే ఖ్యాతి గాంచింది. మానికొండ తాను కమ్యూనిస్టుగా ఉద్యమంలో దిగడంతో ఆగిపోకుండా తన తల్లి బుల్లెమ్మ గారిని విప్లవ మాతగా తీర్చిదిద్దారు. భార్య సూర్యావతిని విప్లవ నారిగా తయారు చేశారు. సాధారణంగా తల్లులు తమ బిడ్డలు పెద్ద ఉద్యోగాలు సంపాదించి ఆర్థికాపరులై ప్రయోజకులు కావాలని ఆశిస్తారు. కానీ బుల్లెమ్మగారు తన ఒక్కగానొక్క కుమారుడు కష్టమయమైన కమ్యూనిస్టు కార్యకర్త జీవితాన్ని ఎంచుకున్నందుకు చింతించలేదు. గోర్కీ నవల 'అమ్మ'లోని నిలోవ్నాను ఆమె తలపింపచేసింది. పార్టీ రహస్య జీవితంలో మానికొండ ఇంటికెందరెందరో వచ్చి పోతుండేవారు. బుల్లెమ్మగారు వారినందరినీ తన బిడ్డల్లాగా ఆదరించింది. తరువాత 1945 నుంచి ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ, ప్రజాశక్తి కార్యాలయాల్లో ఆమె కమ్యూన్ నిర్వహించారు. పార్టీ కోసం సభ్యులు, కార్యకర్తలు తమ ఆస్తిపాస్తులను సమర్పించాలని పిలుపు ఇచ్చినప్పుడు మానికొండ దంపతులు తమ ఆస్తి యావత్తూ పార్టీకి సమర్పించారు. తన కొడుకూ కోడలూ వాళ్ల వంతు ఆస్తిని పార్టీ కోసం త్యాగం చేసినప్పుడు బుల్లెమ్మగారు హృదయపూర్వకంగా వారిని ఆశీర్వదించింది. పైపెచ్చు తన డబ్బు నుంచి వెయ్యినూటపదహార్లు పార్టీకి సమర్పించింది. 1948లో ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ జరుపుకోవడాన్ని ప్రభుత్వం నిషేధించిన సందర్భంగా విజయవాడలో జరిగిన నిరసన ప్రదర్శనలో బుల్లెమ్మగారు జెండా పుచ్చుకొని అగ్రభాగాన నడిచారు. ఊరేగింపును చెదరగొట్టడానికి పోలీసులు ప్రయోగించిన బాష్పవాయువుకు ఆమె శరీరం కాలి స్పృహ తప్పి పడిపోయింది.

మానికొండ సాధారణ స్థానాల్లో ఉంటూ కూడా తన భార్య సూర్యావతి పైస్థాయిలకు వెళ్లడానికి తగిన ప్రోత్సాహాన్నిచ్చారు. ప్రాథమిక పాఠాల చదువుకే పరిమితమైన ఆమెకు ఆయన తన కృషి ద్వారా విద్యావిజ్ఞానం, ఆత్మవిశ్వాసం కల్పించి ఆమె ఆంధ్రప్రదేశ్ మహిళా ఉద్యమానికి నాయకత్వం వహించే స్థాయికి తీసుకురాగలిగారు. ఎంతో ఆదర్శమైన కమ్యూనిస్టు మహిళగా ఆమెను తీర్చిదిద్దారు. ఆమె సర్పంచ్‌గా, ఎంపిపిగా, శాసనమండలి సభ్యురాలుగా పనిచేశారు. ఈ దంపతుల గురించి ఆనాటి భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి పిసి జోషి మానికొండను ప్రజాస్వామిక భర్త అనీ, ఆదర్శ కమ్యూనిస్టు రివల్యూషనరీ భర్త అనీ అభివర్ణించారు. ఉద్యమ సమయంలో సూర్యావతిని రాయవెల్లూరు జైలులో ఏడాదిపాటు నిర్బంధించారు. ఇంచుమించు అదే సమయంలో మానికొండను కూడా అరెస్టు చేసి జైలులో పెట్టారు. జైలులో ఉన్న రెండున్నరేళ్లు ఆయన ఆదర్శప్రాయమైన జీవితం గడిపారు. అక్కడ అధ్యయనం, అధ్యాపనం నిర్వహించారు. ఎక్కువ సమయాన్ని అధ్యయనానికి ఉపయోగించి తన రాజకీయ సైద్ధాంతిక పునాదిని గట్టిపరుచుకున్నారు. జైల్లో ఉన్న సాధారణ కార్యకర్తలకు రాజకీయ తరగతులు నిర్వహించారు. ఆరు నెలల తరువాత జామీనుపై విడుదల చేయగా, పార్టీ కార్యక్రమాలు కొనసాగించడానికి ఆయన రహస్య జీవితం గడిపారు. 1955లో పార్టీ ఆర్థిక సంక్షోభంలో పడినప్పుడు బుల్లెమ్మగారు మానికొండ దంపతులను ఆదుకొని తన దగ్గర మిగిలివున్న కొద్దిపాటి డబ్బుతో సంసారాన్ని నడుపుకొచ్చింది.

1955లో జరిగిన రాష్ట్ర శాసనసభ మధ్యంతర ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ ఓటమి పాలయింది. దీంతో పార్టీ రాజకీయంగా, ఆర్థికంగా గట్టి దెబ్బతింది. పార్టీ అప్పులు తీర్చడం మాట అలా ఉంచి కార్యకర్తలను పోషించడమే కష్టమైపోయింది. మరోవైపు ఎన్నికల్లో గెలిచిన కాంగ్రెస్ విజయగర్వంతో పార్టీ కార్యకర్తలపైనా, ఓటు వేసిన ప్రజలపైనా దౌర్జన్యకాండ ప్రారంభించింది. ఈ పరిస్థితుల్లో కమ్యూనిస్టు పార్టీ తన ఉనికిని నిలబెట్టుకోవడం, ఆర్థిక స్థితి నుంచి బయటపడి పార్టీ నిర్మాణాన్ని కాపాడుకోవడం ప్రధాన కర్తవ్యాలయ్యాయి. మానికొండ ఈ పరిస్థితిని ఎదుర్కోవడానికి ధైర్యంగా, చైతన్యంతో ప్రజలపై సంపూర్ణ విశ్వాసంగల విప్లవకారుడిగా నిలబడ్డారు. కానీ రాష్ట్ర జిల్లా కమిటీల్లో ఓటమి తర్వాత ప్రాబల్యం పైచేయి అయింది. పార్టీ కోసం సర్వస్వం అంకితం చేసిన ప్రొఫెషనల్ రివల్యూషనరీలను పెద్ద సంఖ్యలో పార్టీ నుంచి (నిర్మాణ రంగంలో) తప్పించి ఎవరికివారు వారివారి బతుకుదెరువు చూసుకోవాలనే ధోరణి మెజారిటీ ధోరణిగా తయారయింది. జిల్లా కార్యదర్శిగా ఉన్న మానికొండ ఈ ధోరణిని ప్రతిఘటించారు. ఓపికతో ఆ ధోరణే నెగ్గి పార్టీ నిర్ణయం జరిగాక ఆయన సంప్రదాయ సైనికుడివలె ఆ పార్టీ పూర్తికాలం కార్యకర్తగా ఉన్నప్పుడు మానికొండ వంటి కమ్యూనిస్టు విప్లవకారుడు ఏ విధానంతో పెట్టుకుంటూ ఎవరి దగ్గర ఉంటారు? ఆయన తల్లి బుల్లెమ్మగారు తన దగ్గరున్న కొద్దిపాటి సాధన సంపత్తితో ఆ దంపతులకు ధైర్యాన్నిస్తూ అండగా నిలబడ్డారు. పార్టీని బలపరిచే ఎందరో పెద్దలు చాలా బాధపడ్డారు. వారాయనను కలుసుకొని పార్టీ పనిని మానుకోవాల్సిన అవసరం లేదనీ తాము ఆర్థిక తోడ్పాటు ఇస్తామనీ ఆయనను ప్రోత్సహించారు. కానీ మానికొండ వ్యక్తిగత సహాయాన్ని నిరాకరిస్తూ వారు ఆర్థిక సాయం చేద్దామనుకున్న మొత్తాన్ని పార్టీకి ఇమ్మనీ అప్పుడే పార్టీయే సముచిత నిర్ణయం తీసుకోగలదనీ నచ్చజెప్పారు. ఆయన ఎంతో కష్టదశలో ఉన్నా ఉన్నత కమ్యూనిస్టు నైతిక ప్రమాణాలను వీడలేదు. తన అవసరాలను కుదించుకొని, భార్య తోడురాగా వారిరువురూ మానవులుగా బతకడానికి అవసరమైన కనీస అన్నవస్త్రాలు మించి వాడుకోలేదు. ఒకే ఒక జత చొక్కా ధోవతులతో ఆయన గడిపేవారు. ప్రజల వద్ద నుంచి వసూలు చేసిన నిధుల నుంచి ముందు పార్టీ కార్యకర్తల జీతాలు గడిపేవారు.

1964లో కమ్యూనిస్టు పార్టీలో చీలిక అనివార్యమైంది. దీనికి ముందు జరిగిన రాజకీయ సిద్ధాంత సిద్ధాంత పోరాటంలో మార్క్సిస్టులుగా మానికొండ దంపతులు రివిజనిజాన్ని ప్రతిఘటించి నిలిచారు. కృష్ణాజిల్లా కమిటీ కార్యదర్శిగా మానికొండ పార్టీ పునర్నిర్మాణ బాధ్యతలను చేపట్టారు. 1964 డిసెంబర్ 29 రాత్రి అనేకమంది నాయకులతోపాటు మానికొండ దంపతులను అరెస్టు చేసి ప్రభుత్వం హైదరాబాద్ సెంట్రల్ జైలులో డిటెన్యూలుగా ఉంచింది. జైల్లో మానికొండ ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర రాశారు. జైల్లో ఓసారి ఆయనకు తేలికపాటి గుండె జబ్బు కూడా వచ్చింది. జైలు నుంచి బయటకు వచ్చింది మొదలు కృష్ణాజిల్లా పార్టీ పునర్నిర్మాణంపై కేంద్రీకరించారు. 1964 నుంచి ఆయన జిల్లా కార్యదర్శిగా, రాష్ట్ర కమిటీ సభ్యులుగా, 1968 నుంచి 1975లో ఆయన చనిపోయేవరకూ రాష్ట్ర కార్యదర్శివర్గ సభ్యులుగా పనిచేశారు. 1975 జనవరి 27వ తేదిన కృష్ణాజిల్లా కాటూరులో పార్టీ నిధి వసూళ్ల కార్యక్రమంలో ఉండగా ఆయన గుండెపోటుకు గురయ్యారు. ఆ మరునాడు ఆయన హృదయం ఆగిపోయింది. వాణి మూగపోయింది. సొంత లాభం సొంతం మానుకొని ప్రజలకోసం అహర్నిశలూ పనిచేసిన ఆదర్శమూర్తి మానికొండ.



**సవరణ :** డిసెంబర్ 'మార్క్సిస్టు' సంచిక 'స్మార్తి'లో ఉడరాజు రామం బయోగ్రఫీ(మూడవ కవర్‌పేజీ)లో జమీందారీ వ్యతిరేక అని ఉండాల్సిన చోట రైతాంగ వ్యతిరేక అని అచ్చు అయింది. పొరపాటును చింతిస్తున్నాం.

**–సంపాదకుడు**

RNI Reg.No. APTEL/2006/17554. Postal Regd.No.H/SD/407/07-09

# వర్గపోరాటాలద్వారానే ప్రజలు వాస్తవాలు తెలుసుకుంటారు



వి.ఐ. లెనిన్

అన్ని రకాల నైతిక, మతపరమైన, రాజకీయ, సామాజిక ప్రకటనల వెనుకా, హామీల వెనుకా ఏదో ఒక వర్గం యొక్క ప్రయోజనం దాగి ఉన్నదన్న విషయం తెలుసుకోనంతవరకూ రాజకీయాల్లో ప్రజలెప్పుడూ మోసగించబడుతూ, తమనుతాము మోసగించుకుంటూ ఉంటారు. అలాగే సంస్కరణల ద్వారా సమాజాన్ని మార్చగలమనీ, అభివృద్ధిచేయగలమనీ భావించేవారు కూడా ఈ సమాజంలో మనకు కనిపించే పాతసమాజపు ప్రతి సంస్థనూ -అది ఎంతటి క్రూరమైనదైనా, ఎంతగా కుళ్లిపోయినదైనా- దాన్ని కొన్ని పాలకవర్గాలు రక్షిస్తూ ఉంటాయన్న విషయం తెలుసుకోనంతవరకూ పాత సమాజపు సంరక్షకులచేత మోసగించబడుతూనే ఉంటారు. అయితే ఈ వర్గాల ప్రతిఘటనను సమూలంగా నాశనం చేసే మార్గం ఒక్కటే ఉంది. మన చుట్టూ ఉన్న సమాజంలోనే పాతదాన్ని నాశనం చేసి, కొత్తదాన్ని సృష్టించగలిగే సామర్థ్యం కలిగి ఉన్న శక్తులను - తమ సామాజిక అస్థిత్వం ద్వారా అటువంటి సామర్థ్యాన్ని స్వంతం చేసుకున్న శక్తులను- గుర్తించి, చైతన్యపరిచి, పోరాటంలోకి సమీకరించడమే ఆ మార్గం.

ఇప్పటివరకూ పీడితవర్గాలన్నీ అనుభవించిన, ప్రస్తుతం కార్మికవర్గం అనుభవిస్తున్న మానసిక బానిసత్వం నుండి దాన్ని బయటపడేసే మార్గాన్ని... మార్క్స్ ప్రతిపాదించిన తాత్విక భౌతికవాదం మాత్రమే చూపించగలుగుతుంది. పెట్టుబడిదారీ వ్యవస్థ యొక్క సాధారణ క్రమంలో కార్మికవర్గపు వాస్తవ స్థితి ఏమిటో చెప్పింది మార్క్స్ ఆర్థిక సిద్ధాంతం మాత్రమే.
కార్మికవర్గం యొక్క స్వతంత్ర సంస్థలు అటు అమెరికానుండి ఇటు జపాన్‌వరకూ, అటు స్వీడన్ నుండి ఇటు దక్షిణాఫ్రికా వరకూ అన్ని చోట్లా అనేక రెట్లుగా పెరిగిపోతున్నాయి. కార్మికవర్గం తన వర్గపోరాటంలో రాటుదేలి చైతన్యం పొందుతోంది, ఎడ్యుకేట్ అవుతోంది. బూర్జువా సమాజపు చీకటితెరలనుండి బయటపడుతోంది. ప్రతి నిత్యం మరింత సంఘటితమవుతోంది. విజయం సాధించడం ఎలాగో నేర్చుకుంటోంది. ఉక్కుశిక్షణతో రాటుదేలుతోంది. నిరాఘాటంగా అభివృద్ధి చెందుతోంది."

**(లెనిన్ రాసిన "మార్క్సిజం యొక్క మూడు మూలాలు, మూడు అంశాలు" అన్న గ్రంథం నుండి. 1913 మార్చిలో ఇది ప్రచురించబడింది.)**

Marxistu, monthly organ of Communist Party of India (Marxist) A.P . State Committee.
Printer & Publisher B.V. Raghavulu. RNI Reg.No. APTEL/2006/17554. Vol.2, No.9, January 2008



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M118 |
| పుస్తకం పేరు | మార్క్సిస్టు |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | |
| పేజీలు విడదీసినది | |
| స్కాన్ చేసినది | APSAV |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |